మానవ జీవితంలో కల్లా మనిషిని ఆశ్చర్య పరిచేవి ప్రమాదాలు. ఉన్న పరిస్థితి నంతా క్షణంలో మార్చి పారెయ్యటం వల్ల స్పష్టంగా నాటుకుపోయిన అభిప్రాయాల్ని ఒకటి వేళ్ళతో పీకిపారేసి జీవితాన్నే తారుమారు చేస్తవి.

నా అభిప్రాయంలో—జీవితంలో మనం సాధించగలిగే చాలా పనులు ప్రమాదవశాత్తూ జరుగుతున్నవే కాని, మన శక్తి సామర్థ్యాలవల్ల మాత్రం కాదు. అందాకా ఎందుకూ? మన పుటకే ప్రమాదవశాత్తూ జరిగి వుంటుంది. కామం తీర్చుకున్నప్పుడల్లా మానవజాతి అభివృద్ధిచెందే బీజాలు పడటం లేదు; ఎప్పుడో హఠాత్తుగా అది జరుగుతూవుంది. మనం కావాలన్నప్పుడు జరగని పనులూ, మన శక్తికంచనలేకుండా, అసలు మనకు ఆ ఆశేమీలేకుండా ఉన్నప్పుడు ఒక్క క్షణంలో జరిగే పనులూ—ఇవన్నీ యీ జాతికే చెందినవి. చివరకు మృత్యువు—తుది ప్రమాదం!

పుట్టినప్పుడు ఎవ్వరూ—చివరకు తల్లి దండ్రులు కూడా తెలియదు. క్రమంగా అనేక సందర్భాల్లో ప్రమాదవశాత్తూ ఎంతోమంది స్నేహితులు, బంధువులు, ప్రియులు, ముఖ్యులు విరోధులు—ఇంకా ఎన్నో తరగతుల జనంతో పరిచయం కలుగుతూ వొస్తోంది. ఇదంతా మనం కావాలని

కోరుకున్నది మాత్రం కాదు; వాటంతటవే జరిగిపొయ్యే సంఘటనలు...

నా జీవితంలో ఒక్క సందర్భంలో మాత్రం యీ ప్రమాదపు విలువను కనిపెట్టగలిగాను. అదే మొట్ట మొదటి ప్రమాదం కాదు, ఇదివరకు ఎన్నో జరిగిపోయినయ్. ఆ జరగటం అతి సామాన్యమైనదిగా ఉండిపోవటంవల్ల, వాటిని నిర్లక్ష్యం చేశాను. సూర్యోదయాన్ని కానీ, సూర్యాస్తమయాన్ని కానీ, వెన్నెలను కానీ చూడటం కొత్త కాకపోయినా, ఒకో సందర్భంలో మాత్రమే ఆ ప్రకృతి శోభను మెచ్చుకోగలుగుతున్నాం. మిగతా సందర్భాల్లో కూడా ఆ శోభ తక్కువై కాదు; మెచ్చుకునేప్పుడు జరిగే సంఘటన లేకపోవటంవల్ల! అదేవిధంగా యీ ప్రమాదానికి నా జీవితంలో ఇంత గొప్ప విలువను ఆపాదించాల్సి వొచ్చింది.

ఆ సంఘటన ఇది:

## 2

ఎనిమిదేళ్ళ నాటి మాటైనా అదంతా నిన్ననో మొన్ననో జరిగినట్టుగా వుంది. తెల్లవారుజామునే ప్రయాణం అనే మాట జ్ఞాపకం చేసుకోగానే, నిద్ర పట్టలేదు. ఆ రోజులన్నీ ఒకటొకటిగా వరుసక్రమంలో ఈ ఊహాప్రపంచంలో తిరగసాగినై. ఆ స్నేహితులూ, మాస్టర్లూ, ఆడుకున్న ప్రదేశాలూ అన్నీ మారి వుంటై. నేనే మారగాలేంది, నా చుట్టూవున్న వాతావరణమంతా మారుతుండగాలేంది—నాకు వంద మైళ్ళల్లో వున్న ప్రదేశాలుమాత్రం మారకుండా ఉంటాయా? అవన్నీ చిన్ననాటి అనుభవాలే వినా, ఆ లేత హృదయం మీద గాఢంగా అతుక్కున్నయ్; మరీ రోజు రోజూ వాటిని

జ్ఞాపకం చేసుకుంటూ, ఆ ఘట్టాల్ని ఇప్పటి లోకజ్ఞాన కాంతిలో చూస్తూ ఆనందించటం ఒక అలవాటయ్యాక, అవి తేలిగ్గా మరిచిపొయ్యే విషయాలు కాకుండానే ఉండిపోయినయ్...

ఈ ఉద్యోగంలో ప్రవేశించాక అనేక కొత్త పట్టణాల్లో వింత ముఖాల మధ్య గడుపుతున్నాను; అలాటిదే యీ పట్టణమూ ఐతే సరిపొయ్యేది. ఆందోళనా, ఆత్రుతా ఏమీ ఉండేవి కావు. కాని, యీ పట్టణంలో నా పూర్వానుభవాలు అపూర్వమైనవని యీ మధ్యనే బాగా తెలిసివచ్చిన ఘట్టాలు, నా జీవితంలో గొప్ప మార్పుల్ని తెగలిగిన దృశ్యాలు జరిగినై. అది జ్ఞాపకం రాగానే ఆ గడిచిన రోజులన్నీ కళ్ళకు కట్టినట్లయినయ్

# 3

మా పక్క భాగంలోనే ఇంటివాళ్ళు ఉండేవాళ్ళు. కొద్ది రోజుల్లోనే మాకూ వాళ్ళకూ గొప్ప 'బాంధవ్యం' లాటిది ఏర్పడ్డది! మా ముసలిది, వాళ్ళ ముసలిదానికి రామాయణ భారతాలే కాక, ఇతర వేదాంత గ్రంథాల్ని కూడా చదివి వాటికి అర్థ తాత్పర్యాదుల్ని నూరిపోసేది. మా ముసలిదాని తెలివికి వాళ్ళ ముసలిది ఆశ్చర్యపోయి—ఆమెను తన స్వంతం చేసుకునేందుకల్లే 'అక్కయ్యా!' అని పిలిచేది. ఇంటి పని మిగపోయించి మిగతా కాలాన్నంతట్నీ యీ 'గురు శిష్యులు' సరసకాలంగానే భావించేవాళ్ళు...అమ్మ లేకపోవటంవల్ల మొదటినుంచీ నేను ముసలిదాని దగ్గరే తరిఫీదయ్యాను. అందుకని ఇష్టం వున్నా లేకున్నా యీ ముసలమ్మలు పురాణం వింటూ వాళ్ళ దగ్గరే కూర్చునేవాణ్ణి.

మేము ఆ ఇంట్లో ప్రవేశించిన సంవత్సరానికి, ఆ ఇంటి

పెంపుడు కొడుకు కొత్త కాపరం ప్రారంభమైంది. అతని భార్య 'సుందరి'—నిజంగా సుందరే! ఆ పన్నెండేళ్ళ వయస్సప్పుడే నా మనస్సు చలించిందంటే (ఆ సంగతి ఇప్పుడు తెలియటం అతి బాధాకరం!) ఆశ్చర్యం కాదు. ఆమె భర్త వారానికి ఐదు రోజులు ఊళ్ళోనే ఉండడు; అది అతని ఉద్యోగ ధర్మం. అదీకాక, వాళ్ళిద్దరిదీ అనుకూల దాంపత్యం అనేందుకు కూడా వీల్లేదు. అతను అందగాడు కాదు. సున్నితమైన సుందరి—ఆ ఎద్దు మొద్దు స్వరూపాన్ని చూసి ఏవగించుకునేది. ఇక అతను-చెడు తిరుగుళ్ళకు అలవాటుపడి సుందరిని లెక్క చేసేవాడు కాదు. అతను ఊళ్ళో ఉండకపోవటమూ, ఉన్నా ఇంటి గోల అతనికి పట్టకపోవటమూ సుందరి మనశ్శాంతికి కొంతవరకూ సహాయపడినయ్. ప్రతికూల దాంపత్యాన్ని అనుభవించటం కన్నా, అసలు దాంపత్యమే లేకుండా వుండటం కొంత నయం! వారిది చాలా గౌరవమైన ధనిక కుటుంబం కనుక, ఈ రహస్యం యింటి గుట్టుగానే వుండిపోయింది.

కోడలి నాగరికత చూసి మొదట్లో అత్తగారు అదిరిపడ్డది. కొడుకు వ్యవహారం ఆమెకు నచ్చక పోవటంవల్లా, కొడుకును తనేమీ అనలేక పోవటంవల్లా (అనేందుకు అసలతను ఇంట్లో ఉంటేగా?) కోడల్ని కూడా చాలావరకు భరించాల్సి వొచ్చేది...అనుభవశాలి ఐన అత్తగారు కోడలి మనశ్శాంతికి కొత్తమార్గాల్ని అన్వేషించింది. రోజుకు పది పన్నెండు గంటలు సాగే పురాణ పఠనానికి కోడల్ని ఆహ్వానించేది. మొదట్లో ఆమె ఇదేదో కాలక్షేపానికి అనుకుంది కానీ, తన యీడుకూ, అభిరుచులకూ ఇదేమీ రుచించలేదు. మా ఇద్దరి మధ్యా స్నేహం యీ బుల్లి పాఠశాలలోనే మొదలైంది. ఈ బాధ పడలేక ఆమె తన గదిలో ఒంటరిగా కూర్చొని ఏమన్నా చదువుకునేది.

నాకు వీళ్ళ పురాణం అసలేమీ అర్థమయ్యేదికాదు కనుక-
ఏ తలకాయ నెప్పి వొచ్చేదీ కాదు. ఇవికూడా ఏవో పాతా
లనీ, ఇంకా ముందుక్లాసుల్లో నేనూ చదువుతానేమోననీ
ఇలాటి పెద్దపెద్ద బైండు పుస్తకాలు కొనాలి కాబోలుననీ
అనుకునేవాణ్ణి.

సుందరి ఎప్పుడైతే పురాణం మానిందో అప్పుడే నాకూ
ఆ పురాణంమీద అసహ్యం కలిగింది. యీ ముసలి 'పాత
స్నేహితుల' మీద నాకు కోత పుట్టింది. ఇక సుందరికి
మాత్రం స్నేహితులు ఎవరున్నారు కనుక? మెల్లిగా మా ఇద్దరి
మధ్యా స్నేహం ప్రబలసాగింది.

మొదట్లో ఆమెను ఎలా పిలవాలో నాకు అర్థం కాలేదు.
'ఏమండీ,' అని పిలిచే మర్యాద నాకింకా అబ్బలేదు. అదీ
కాక ఆడవాళ్ళను 'ఏమండీ!' అని మొగాళ్ళు అనటంకూడా
నే నెప్పుడూ వినలేదు. ఆమెతో చనువుగా ఉండదల్చు
కున్నాక 'ఏమండీ' అని ఎలా పిలవటం? ఇంకో మార్గమేమీ
కనపడక మెల్లిగా ఆమెనే అడిగాను: "నువ్వు నాకు ఏమౌ
తావ్?" అని. మా యిద్దరిమధ్యా ఏదో బంధుత్వం వుండి
వుంటుందనే నా నమ్మకం; ఒకవేళ ఇదివరకు లేకపోతే,
ఇప్పుడు అది వొస్తేమాత్రమేం?

"ఆయన నీకు ఏమౌతారు?" అందామె.

"అన్నయ్య."

"ఇంకేం-నన్ను 'వొదినా!' అని పిలు."

"వొదిన!" బాగానే వుంది; కాని సుందరి అంత మధు
రంగా లేదు.

"సుందరి అని పిలుస్తేనేం?"

"పోనీ పిలు-నీ ఇష్టం."

# 4

త్వరగానే నేను ఆమె అపేక్షకు పాత్రుణ్ణయ్యాను. నన్ను ఏమన్నాడేది; నేను చాలా బాగున్నాననేది. దాంతో నాకు స్కూల్లో నా క్రాపు బాగుండలేదనీ, నా చొక్కా చిరిగిందనీ; పాఠాలు రాక మాస్టరిచేత దెబ్బలు తిన్నాననీ ఏడిపించే కుర్రాళ్ళందరికీ 'సుందరి'ని చూపి-వాళ్ళ మొహాల్లో నవ్వా లనిపించేది. సుందరి మాట్లాడుతూంటే నామీద నాకు విపరీతమైన అభిమానం కలిగేది. గొప్పవాళ్ళంతా ఇలాగే తయారౌతారేమో ననిపించేది.

సుందరంటే పడి చచ్చేందుకు ఇంకో కారణం కూడా వుంది; ఆమె నాకు అనేక ఫలహారాల్ని పెట్టేది: ఇతర ఆట లన్నింటికన్నా, ఏ ఆటా లేకుండానే సుందరితో గడపటం నాకు చాలా యిష్టంగా వుండేది.

ఒకనాడు-తను సగం కొరికిన అరటిపండును నా నోటికి అందిచ్చింది.

"ఛీ-ఎంగిలి!!" అన్నాను.

"ఎవరన్నారూ?" అంది.

"నాకు తెలుసు. తప్పు" అన్నాను. నాకు తెలిసినంత కొద్ది తప్పుల్లోనూ ఇదొకటిగా సూచిస్తా.

"కాదు...తిను...బాగుంటుంది."

"ఊహుం ఇంకోటి, మంచిది ఇవ్వు."

ఆమె నవ్వి యింకోటి యిచ్చింది. నేను సగం కొరుక్కోగానే, మిగతా సగాన్నీ తను లాక్కొని తింది.

"ఛీ-నా ఎంగిలి తిన్నావ్ లే-చెప్తా నుండు..." అని ఎగిరాను; తప్పుచేసిన వాళ్ళను చూసి, అది బైటపెట్టే ధీరత్వాన్ని సంపాయించాననే కొత్త ఉత్సాహంతో.

ఆమె కోపాన్ని నటిస్తూ, నా బుగ్గలు నలిపి అంది:
"జాగర్త—మళ్ళీ ఎప్పుడూ రానీను, నీకు ఇంకేమీ పెట్టను.
ఎవరితోనూ చెప్పకూడదు-తెలిసిందా?"

ఆమె కళ్ళల్లోని ఎరుపు చూసేప్పటికి నాకు భయంవేసింది.
ఇక నా జీవితంలో అరటిపళ్ళే దొరక నిపించింది. ఆమె
చేతిమీదుగా తినే ఎన్ని తినుబండారాలు పోతయ్యోనని
దిగులు వేసింది. వీటిని మించి, ఆమెకు కష్టం కలిగించాననే
బాధ అధికమైంది...కాని ఏం చెయ్యాలో తెలియక తెల్ల
మొగం వేశాను.

"చెప్తావా?" అంది గద్దమాయిస్తూ.

"చెప్పను."

"ఐతే ఇది తిను—" తను సగం కొరికి దాచిన ముక్కను
అందించింది.

"ఎంగిలి" అన్నాను, అస్పష్టంగా.

"మరి-నీ ఎంగిలి నేను తినలా?"

నిజమే...మునుపు ఆమె మార్గదర్శకురాలైంది! ఈ పని
తప్పయితే ఆమె ఎందుకు చేస్తుంది? మనంచేస్తే మాత్రమేం?
ఇది నాకు మంచి కారణంగా తోచింది; కిక్కురు మనకుండా
తిన్నాను. కాని దాని మాధుర్యం ఏమీ తగ్గలేదు; మామూలు
గానే వుంది. 'ఎంగిలి' అంటే అసలు వస్తువులోని సుగుణం
ఏమన్నా పోతుందేమోననే అభిప్రాయం పోయింది; అందు
లోనూ 'సుందరి' ఎంగిలి కిక నా అడ్డేమీ ఉండదనే విశ్వాసం
కూడా కలిగింది. ఆమె కిది చాలా తృప్తినిచ్చిందనే చెప్పాలి.

రోజూ ఆటలకు పోవటం మానెయ్యటంవల్ల నా యీడు
కుర్రాళ్ళకు నామీద యీర్ష్య పుట్టింది. కాని సుందరి వెన
కాల దాక్కోగలిగిన నన్ను వాళ్లేం చెయ్యగలరు? నూటి
పోటీ మాటలు అనేవాళ్ళు కాని. వాటి అర్థాల్ని తీసిం

దుకూ. వాటిని గూర్చి ఆలోచించేందుకూ నే నెప్పుడూ తావివ్వలేను.

కాని ఆ వీధి కుర్రాళ్ళల్లో బాగా యీడు వొచ్చినవాళ్లు ముగ్గురు నా వెంట పడ్డారు. సుందరి భర్త పోకడను చూసి, సుందరి మనస్తత్వాన్ని గ్రహించి (వాళ్ళ అభిప్రాయం సరైన దని వాళ్ళకు గట్టి నమ్మకం!) ఆమెను పొందటానికి ఎత్తులు వేసే అభిప్రాయంతో వాళ్ళు నన్ను ఉపయోగించు కునేం దుకుగాను, నన్ను చేరదియ్యటం, స్తుతించటం, నాకు తినుబండారా లివ్వటం మొదలైనవి జరగసాగినై. నా పని వాటంగానే వుంది. తన్నుకు గారెలబుట్టలో పడ్డట్టు—అటు సుందరి, యిటు ఈ యువక బృందమూకూడా నన్ను మేప సాగారు. మొదట్లో వాళ్ళు చాలా పిచ్చిప్రశ్నలు వేసే వాళ్ళు...

"సుందరి ఏం చేస్తోంది?" ఇది వాళ్ళ కొక గొప్ప రహస్య మన్నట్లూ, ఈ ప్రశ్న కొచ్చే జవాబుతో తాము తరిస్తా మన్నట్లూ అడిగేవాళ్ళు. నేనుమాత్రం వెంటనే జవాబు చెప్పేవాణ్ని కాను. నేను తినే వస్తువు పూర్తయ్యేదాకా ఆలోచనలో వున్నట్టు నటించేవాణ్ని. ఈ ఒక్క తినుబండారంతోనే ఈ సాయంత్రం ఆఖరవుతుందని నా ఏడుపు!

"చూసి వొస్తాను ఆగు—"

"ఊఁ...త్వరగా రా!" అనేవాళ్ళు.

నా దృష్టంతా తినుబండారాలమీద వుండగా నేను ఆలస్యం చేస్తానని భయపడే మూర్ఖుల్ని లోలోపలే ఏవగించు కునేవాణ్ని.

మెల్లిగా లోపలికి దూరి, ఆమె నన్ను చూడకుండా (చూస్తే మరిపోనీను! వెళ్ళకపోతే వాళ్ళ ఖర్చుమీద కడుపు నిండదు) చప్పుడు కాకుండా చూసేవాణ్ని. వొకొక్కసారి కాస్సేపు కూర్చొని అసలు చూడకుండానే వొచ్చేవాణ్ని.

నేను ఏ జవాబిచ్చినా రైటుగానే చలామణీ ఐ తీరుతుంది! ఈ అనుకూలమైన పద్ధతి స్కూల్లోకూడా నా ఒక్కడికీ వుంటే—మా క్లాసులో నాకన్న తెలివిగలవాడేడీ?

నే నాగానే బతిమాలుతూన్నట్టు, "ఏరా బాబూ?" అనేవాళ్ళు.

"అగండి...నా కేమన్నా తినేందుకు వుందా? లేదా?" అజీర్ణానికి భయపడే జ్ఞానం నాకు ఇంకా కలగకపోవటం వాళ్ళకు కష్టంగానే వుందేమో?

"...ముందు చెప్పరా, తర్వాత చూద్దాం..."

"చూద్దామంటే కాదు—భలే ఆకలవుతోంది. యింట్లో కన్నాపోయి ఏమన్నా తిని వొస్తా" యింట్లో ఖాళీ గిన్నె లున్నయ్యని వాళ్ళకు తెలియదు; తెలిసినా నేను వెళ్ళటం ఇష్టం లేదు!

తప్పనిసరిగా కోపాన్ని అణిచిపెట్టుకుంటూ, "ఇదుగో, తినరా బాబూ!" అని బుజ్జగించి ఆరగింపులు సమర్పించేవాళ్లు.

"చెప్పు...ఏం చేస్తోంది?"

"స్నానం చేస్తోంది!"

వెయ్యిసార్లకు ఎన్నాళ్ళు చెప్పినా ఒకే సమాధానం! కాని వాళ్ళకు అదే తృప్తి. దానికోసమే మిఠాయి కొనటం కూడాను! నిన్నటి సూర్యుడే ఇవ్వాళా ఉదయించాడనే జ్ఞాన మన్నా లేదు.

"ఎంత అదృష్టవంతుడివిరా!" అని నిట్టూర్చేవాళ్ళు.

వీళ్ళు నా మీదపడి ఏడవటం చూస్తే లోలోపలే గర్వం కలిగేది. నాకు తెలియని నా అదృష్టం-ఇతర్లు చెప్పగా విని, గ్రహించుకున్న నా అదృష్టం-అది కాస్తా బైటపడితే పోతుం దేమోనని దిగులుతో-రాత్రి పడుకున్నాక, కళ్ళు మూసుకొని వీళ్ళందరూ నాకు పులిమే ఆ అదృష్టాన్ని గూర్చి ఆలోచించు కునేందుకే-దాన్ని భద్రంగా దాచుకునేవాణ్ణి.

"ఒరేయ్-మాకో సహాయం చెయ్యాలిరా" అన్నారు ఒక వారం గడిచాక.

వీళ్లు ఎద్దుల్లాగు ఒకరికి ముగ్గురున్నారు; వీళ్ళల్లో వీళ్ళు సహాయం చేసుకోలేక, పన్నెండేళ్ళ కుర్రాణ్ని—వీళ్ళకు నే నేదో సహాయం చెయ్యాలట! వీళ్ళకన్న నేనే బలవంతుణ్ణని పించింది!

"సరే చెప్పండి..." అన్నాను. లేకపోతే మిఠాయి రాదు. ఇంత పెద్దవాళ్ళకు మస్కా వెయ్యటం (అది మస్కా అని వీళ్ళ జన్మలో గ్రహించలేరు!) ఎంత తేలికో ననిపించింది.

"ఒక ఉత్తరం ఇస్తాం; సుందరికి ఇస్తావూ?"

"ఊహుఁ. మీరే ఇవ్వండి."

"కాదురా నువ్వే ఇవ్వాలి."

"వాళ్ళ అత్త చూస్తే?" ఇదేదో తప్పుడు వ్యవహారమని తోస్తోంది. లేకపోతే వీళ్లే ఇవ్వరాదూ? పోనీ మాట్లాడ రాదూ—ఒకటికి మూడు నోళ్లున్నయ్ గా! ఎలాగైనా తప్పు కోవటమే మేలుగా తోచింది.

"చూడకుండా ఇవ్వు."

"నా చేతకాదు బాబూ!"

"నువ్వు మంచివాడివిరా! నువ్విస్తేనే కాని పనికాదు—"

"పని?...ఏం పని?"

"చెప్తాంగా"

"చెప్పండి"

వాళ్ళ గొంతుల్లో వెలకా్కయ పడ్డట్టయింది!

"తర్వాత చెప్తాంగా" అన్నారు.

"నేనూ తర్వాతే చేస్తాను"

నన్ను సమాధాన పరచటం వాళ్ళకు చేతకాలేదు. చేత కాని తనాన్ని పళ్ళు కొరకటంతో సూచిస్తున్నారు. కాని ముగ్గురూ కలిసినా నన్నేమీ చెయ్యలేరనే గట్టినమ్మకం వుంది.

నన్ను బతిమాలి పనులు చేయించుకోవాల్సిందే కాని దబా యించి లాభంలేదనే సంగతి నాలో బాగా నాటుకునేట్టు చేశారు.

వాళ్ళు కాసేపు ఆలోచించి తెలివిగా తప్పుకున్నారు. "మేం చెప్పలేం, సుందరినే అడుగు."

"పోయి అడిగొస్తాను ఆగు" అని లేచాను.

వాళ్ళందరి కాళ్ళూ ఒణికినై; నన్ను గట్టిగా పట్టు కున్నారు.

"మా బాబుగా—పోవోక"

"మరి అడుగమంటిరిగా?"

"ఏమని?"

"పని...ఆ పని"

"బతిమాలుతాం కాని, ఒద్దులే, ఇదుగో మిఠాయి తిను ముందు"

మిఠాయి తింటూనే..."ఐతే పని ఏమిటి?" అని సాగ దీశాను. ఒక్కళ్ళూ జవాబుచెప్పలేక తెల్ల మొగాలు వేశారు. ఇక ఆ నాటికి లాభం లే దనుకొని నన్ను వొదిలిపెట్టారు.

మర్నాడు సాయంత్రం మళ్ళీ తెగిన కొనను అందు కున్నారు.

"ఏరా వాసూ! మరి ఇవ్వాళన్నా పని చెయ్యాలి."

"ఏం పనీ?"

"అదే...ఉత్తరం ఇవ్వటం"

"నాకు భయం"

"నీకేం భయంలేదు...ఎవ్వరూ చూడకుండా ఇచ్చేయ్... నీ ప్రాణానికి మా ప్రాణాలు అడ్డం."

ఇదేదో ప్రాణంతో సంబంధించిందనే కొత్త అభిప్రాయం కలిగింది. అసలు వీళ్ళకే ప్రాణాలంటూ ఉంటే—మధ్య నా బుల్లి ప్రాణాన్ని అడ్డంవేసుకోవటం దేనికీ?

"—ఎవరిచ్చారంటే?" అన్నాను; కాస్సేపు మంత్రోతు పని చేసినా చేద్దాం లెమ్మనే నిశ్చయంతో.

"దాసు అని చెప్పు"

"ఆఁ, ఆఁ, నేను కాదు రోయ్—సుబ్రమణ్యం అని చెప్పు"

"చంపావ్...ప్రకాశరావని చెప్పు"

"ఏడ్పినట్లే వుంది...ముగ్గురూ కలిసి ఇచ్చారని చెప్తాను!"

దాళ్ళలో వాళ్ళు కాస్సేపు కీచులాడుకున్నారు. 'నీకు ధైర్యంలేదు' అంటే—'నీకు ధైర్యంలేదు' అనుకున్నారు.

"ఒట్టి పిరికివెధవలు...ఆమె అంగీకరిస్తే మాత్రం తయారౌతారూ?" అన్నాడు దాసు.

"మరి ఎగరు తిరుగుతేనో?" అన్నాడు సుబ్రహ్మణ్యం.

"మరి దీనికేనా ఉత్తరం అంటూ పెట్టారు?" అన్నాడు ప్రకాశరావ్.

వాళ్ళల్లో వాళ్ళకు ఏ ఒడ్డూ తేలటం లేదు; చాలా మథన పడ్డారు. ఈ ఆలస్యంలో నా పొట్ట బాగా నిండింది.

"నాకు పని వుంది" అంటూ లేచాను.

"ఆగరా బాబూ! మేమిక్కడ ఛస్తూంటే—" అన్నాడు దాసు.

"ఊఁ, త్వరగా తేల్చండి" అన్నాను.

ఒకడికి మించిన పిరికి ఇంకోడు కావటంవల్ల త్వరగా తేలకుండా వుంది.

"ఎవ్వరూ ఇవ్వలేదను—" అన్నాడు సుబ్రహ్మణ్యం ఇదో పెద్ద తెలివైన జవాబనుకొని.

"నన్ను బుగ్గలు మెలేస్తే?"

"బుగ్గలు మెలేస్తుందా ఏరా?"

"ఆఁ" అన్నాను. అన్నాక, ఎందుకన్నానా అని నొచ్చు

కున్నాను. కాని వాళ్ళందరూ నన్ను మెచ్చుకున్నారు—బుగ్గలు మెలేస్తే వాళ్ళకేమీ నెప్పి లేనట్టు!

"చెప్పవోయ్"

మెలేసేవి నా బుగ్గలు కనుక 'చెప్పవోయ్' అన్నారు. వీళ్ళ శరీరాలు అతిభద్రంగా చెక్కు-చెదరకుండా ఉండాలి: వీళ్ళ మిఠాయితో పెరిగే నా శరీరం ఏమైనా ఫర్వాలేదన్న మాట!

"ఈ గొడవంతా నాకు అర్థం కావటంలేదు. నేను పోతున్నాను" అన్నాను.

"ఆగరా బాబూ!" అని మళ్ళీ బతిమాలారు.

ఇది ఆగుతే తేలే వ్యవహారంగా నాకు తోచలేదు. అదీ కాక మిఠాయి ఐపోయింది.

చివరకు దాసే తెగించాడు;..."సరే నేనని చెప్పు"

దాసు ధైర్యానికి మిగతా ఇద్దరూ తలలు వాల్చారు.

"సరే...తే...ఆ ఉత్తరాన్ని—"

మెల్లిగా తీసి వోణికే చేతుల్తో నాకు ఇస్తూ దాసు అన్నాడు. "చూడు...ఎవ్వరూ చూడకుండా, ఇవ్వాలి... జాగర్త, ఇవ్వగానే వొచ్చెయ్యవోయ్, కాస్త ఆగి ఏం జరుగుతుందో చూడు...బహుశా మళ్ళీ జవాబుగా ఉత్తరం రాసి ఇస్తుందిలే! జాగర్తగా తీసుకొచ్చి నాకు ఇచ్చావంటే... బోలెడంత మిఠాయి. తెలిసిందా?"

ముందు జరిగేది వీడి కట్లా తెలుసో ననిపించింది. ఆ మాటలకు తలూపి లేచాను.

"ఏం జరిగిందో చెప్పు-ఇక్కడే ఉంటాం..." అన్నాడు.

మళ్ళీ వాళ్ళకూడా ఏదో అనుమానంగానే వుందన్న మాట! 'సరే,' నని బయలుదేరాను.

నాకు చాలా ఆలోచనలు వొచ్చినయ్. దీనికి ఏదన్నా తిరుగుడు ఆలోచించా లనుకున్నాను. ఆలోచించి మెల్లిగా బైటపడ్డాను.

నన్ను చూడగానే వాళ్లకు కొత్తప్రాణం వొచ్చినట్టుగా వుంది.

"ఏరా?" అన్నాడు దాసు ఎంతో ఆత్రంతో. మిగతా యిద్దరికీ అంత ఆదుర్దా లేదు.

"ఇవ్వాలని తీశాను...కాని-"

"కాని?...త్వరగా చెప్పు!"

"ఇంతలోకే మునిల్ది వొచ్చింది."

"ఆc తరువాత ఏమైందీ? త్వరగా చెప్పరా."

"ఇచ్చావా ఏరా ఖర్మ?" అన్నాడు సుబ్రహ్మణ్యం.

వాళ్ళిద్దరూ దాసు ముఖంలోకి నవ్వుతున్నారు. దాసు ముఖంలోమాత్రం కళ లేదు. నన్ను ఊపుతూ తడి ఆరిన కంఠంతో, "ఏరా ఇచ్చావా? నిజం చెప్పు-" అంటున్నాడు.

నా మహిమ నాకు ఇప్పుడిప్పుడే అర్థమౌతోంది.

"లేదు...ఎవ్వరూ చూస్తూండగా ఇవ్వొద్దన్నావ్ గా."

"భలేవాడివిరా! అదరగొట్టావ్...నీ అంత తెలివైన వాడి వల్ల పని కావాలి కాని—" ఆ 'పని' ఏమిటో అర్థంకాక ఛస్తున్న నా బాధను వాళెవ్వరూ గమనించరేం!

"మునిల్ది 'అదేమిట్రా చేతులో?' అని అడిగింది."

మళ్ళీ దాసు వెలవెలబోతూ, "ఆc" అన్నాడు.

"చచ్చావ్ రా దాసూ! మునిల్ది ఆవలిస్తే పేగులు లెక్క పెడుతుంది. నాకు తెలిసే ఊరుకున్నాను," అన్నాడు సుబ్రహ్మణ్యం, తన తెలివికి తనే గర్వపడుతూ.

"ఏదీ గతీ నాకూ—పాడరా" అన్నాడు ప్రకాశరావు.

దాసుకు దెబ్బ తగలటం వీ ళ్ళిద్దరికీ సరదాలా వుంది.

"ఉండండిరా-మీ గోలేమిటి? ఏమైందో త్వరగా చెప్పరా ...మునిల్ది లాక్కుందా ఏరా?" అన్నాడు దాసు.

"లేదులే...'అదేమిటి?' అనేప్పటికి నాకు భయం వేసింది. 'ఊ త్తరం' అన్నాను...'ఏం ఊ త్తరం?' అంది...'ఏదోలే'

అన్నాను. 'ఇట్లా యివ్వు' అని చెయ్యి జాపింది... నేను ఇవ్వకుండా వెనక్కు వచ్చేప్పటికి మీదపడి లాక్కోబోయింది... నేను పరుగెత్తుకుంటూ వొచ్చేశాను."

ఇంతలోనే ముసిల్ది ఎందుకో బైటికి వొచ్చి, వీళ్ళను కొరకొరా చూసి వెళ్ళిపోయింది. దాసు ప్రాణాలు పై పైనే పోయినై. మిగతా ఇద్దరూ ఆమెను చూసే ధైర్యంలేక వేరొక దిక్కు చూశారు. ఇదంతా నిజ మనుకుంటూన్న వీళ్ళ అవస్థ చూసి విషయం అర్థంకాకపోయినా వీళ్ళను ఇంత తేలిగ్గా ఆడించగలుగుతున్నానని నాలో నాకే ఆనందం కలిగింది.

"ఏదీ ఉత్తరం?" అన్నాడు దాసు.

జేబులో చెయ్యి పెట్టాను..."ఏదీ?" అన్నాను.

"ఎక్కడ పారేశావ్ రా? ముసిలిదానికి ఇచ్చావా ఏరా? కొంపతీసావ్ రా, బాబూ!" అంటున్నాడు దాసు.

"దాసూ! నీ కిక దేహశుద్ధేరా" అంటున్నాడు సుబ్రహ్మణ్యం.

"మరి మనలో వీడే మొగాడు!" అంటున్నాడు ప్రకాశరావ్ ఎగతాళిగా.

దాసు దీనంగా నావైపు చూడసాగాడు; కాస్సేపు వెతికి "ఇదిగో!" అన్నాను, ఉత్తరాన్ని బైటికి లాగుతూ.

"అమ్మయ్య!" అని దాసు అన్నాడు: "నాకు తెలుసురా నీ సంగతి; రవ్వ!...రవ్వ!...సరేకాని జాగ్రత్తగా అందివ్వు ...మళ్ళీ ఆ ముసలిదాని కంట పడనీవోక; తెలిసిందా? ఈ రాత్రికే ఇచ్చెయ్"

తరువాత ఎవరి తోవను వాళ్ళు వెళ్ళారు.

# 5

ఇది ఇవ్వటమా, మానటమా అనే ముఖ్య సమస్య నన్ను వేధించసాగింది. అసలు ఇందులో ఏం రాశాడో చదవాలని కుతూహలం కలిగింది. చాటుగా కూర్చొని చదవసాగాను.

వాడేమిటో ప్రేమించాడట! తనమీద దయ చూపాలట! ఎక్కడ కలుసుకోవాలో చెప్పమంటాడు.

నాకేం అర్థం కావటంలేదు...కలుసుకున్నాక ఏమౌతుందో ననిపించింది. ఇంతకూ యీ ఉత్తరాన్ని ఏం చేసేట్టూ?

మాట్లాడకుండా జేబులో పెట్టాను. మా ముసలమ్మతో పాటే పురాణానికివెళ్ళి, కాస్సేపు వాళ్ళ మామూలు గోల విని, సుందరి గదిలోకి వెళ్ళాను. ఆమె పడుకొని ఏమిటో చదువుకుంటోంది: నన్ను గమనించే స్థితిలో కూడా లేదు. నా రాకను తెలియపరుచుకునేందుకు తలుపు చప్పుడు చేశాడు.

"చూశాన్లే...రావోయ్" అంది పుస్తకంమీది దృష్టి మరల్చకుండానే; పోయి మంచం పక్కనే నిలబడ్డాను.

"పైకి రావొచ్చు" అంది

మెల్లగా మంచం ఎక్కాను. ఆమె చదువుతూన్న పుస్తకం ఎంత గొప్పది కాకపోతే, నన్ను ఇంకా ముద్దుపెట్టుకోకుండా ఉండగలదు? మెల్లిగా అట్టమీది పేరు చూశాను. 'ప్రేమ లేఖలు' అని వుంది.

"లేఖ లంటే?" అన్నాను.

"ఉత్తరాలు"

"ప్రేమ అంటే?"

పుస్తకాన్ని రొమ్ముమీద వాల్చి నా ముఖంలోకి తనకు చెప్పటం చేతకానట్టు, సూటిగా చూసింది. నా అమాయకపు ముఖంలో ఆమె కేమీ అర్థమై ఉండదు. చప్పున మీదికి లాక్కొని ముద్దుపెట్టుకుంది.

"ఇదే ప్రేమ!" అంది రహస్యంగా.

ఇదా ప్రేమ! ఇదే ప్రేమైతే ఆ దాసుగాడు ఇదే కోరు కున్నా డన్నమాట! అంటే వీడు నాకు పోటీగా ఉన్నా డన్నమాట! కనుక వాడి ఉత్తరాన్ని ఇవ్వటం నాకు ప్రమా దమే ననిపించింది... ముగ్గురు మొగాళ్ళూ కలిసి నాకు అర్థం చెప్పలేని విషయాన్ని-ఒక ఆడది, ఒక్క పదం కూడా వ్యయ పరచకుండా నాకు ఆ అర్థాన్ని స్పష్టంగా విప్పిచెప్పింది.

"నీకు ఉత్తరాలంటే ఇష్టమా?" అన్నాను.

"ఊఁ, ఇవ్వి బాగుంటై" అని మళ్ళీ ముద్దుపెట్టుకుంది.

"ఏమిటీ? ఉత్తరాలా? ముద్దులా?"

"ఉత్తరాలు...ప్రేమ ఉత్తరాలు!"

ఆమెకు ఇష్టమైంది ఇవ్వకుండా ఎలా ఉండగలను? 'ఇదుగో' అని నా జేబులోని ఉత్తరాన్ని దూకిద్దామను కున్నాను. కాని 'ఇవ్వి బాగుంటై' అంది...మరి ఆ పుస్తకం లోవే బాగుంటయ్యేమో? ఈ దాసుగాడిది బాగుంటుందో? లేదో? అవి ఎవరు రాశారో? ఐనా యీ దాసుగాడు ఇది నా మెడలో వెయ్యటం దేనికంట?

"ఏమిటీ ఆలోచిస్తున్నావ్?"

"ఏం లేదు—"

ఆమె నిట్టూర్చింది. జేబుల్లో డబ్బుల్లేకుండా మిఠాయి కొట్టును ఆకలితో చూస్తూ పోతున్నప్పుడు, ఆ మిఠాయి కలి గించే బాధలాంటిది ఆమె ముఖంలో కనిపించింది.

"సరే-పడుకో-" అని పక్కకు తోసింది...ఎప్పుడు నిద్ర పట్టిందో తెలియదు. ఒక రాత్రివేళ మెలకువవొస్తే ఆమె కౌగిట్లో ఉన్నాను. చలికాలమేమో మంచిరకం రగ్గు కప్పి నంత వెచ్చగా, హాయిగా వుంది; కదుల్తే యీ కాస్తా పోతుం దేమోనని భయంవేసి అలాగే పడుకున్నాను.

తెల్లారి లేచేప్పటికి సుందరి నా కోసం ఎదురుచూస్తోంది.

ఇంకా పూర్తిగా మెలకువ రాక పూర్వమే నా బుగ్గ మీటేస్తూ అంది: "ఇది ఎక్కడిది?"

"ఏదీ?"

"ఇది—యీ ఉత్తరం..."

అది బాసుగాడి ఉత్తరం! ఐనా నా జేబులోనే అక్కడే ఉండక, నా జేబులోంచి బైటికి ఎందుకు ఊరికింది?

"ప్రేమ లేఖా?...అవంటే నీకు ఇష్టమేగా?" అన్నాను.

"ఎవరన్నారూ?"

"రాత్రి నువ్వే అన్నావ్‌గా?"

"ఏడ్చావ్...ఎవరిచ్చారో చెప్పు...చంపేస్తాను—"

ముందు ఇది నా చావుకు వొచ్చినట్టుంది. సమాధానం తోచక గుడ్లు మిటకరిస్తున్నాను.

"రాస్తావా! చెప్తావా?"

"బా-సు" అన్నాను, విధిలేక.

"నువ్వు ఎందుకు తీసుకున్నావ్? ఆ వెధవలకు బుద్ధి లేక పోతే. నీకన్నా బుద్ధి ఉండొద్దూ?"

వాళ్ళకు బుద్ధిలేదని నాకు ఇదివరకే తెలుసు. నాకు బుద్ధి లేదని సుందరి చెప్తుంటే ఇప్పుడే తెలుసుకుంటున్నాను. నేను అనుకున్నట్టు ఇది అటు తిరిగీ, ఇటు తిరిగీ నా మెడకే చుట్టుకుంది!

"ఉండు...వాళ్ళ పని పడతాను...ప్రేమ లేఖలట! తెగ బలిసి-వెధవలు! వీళ్ళ బొంద!"

వాళ్ళ పని పడితే నాకేమీ దిగులు లేదు కాని, నాకేం శిక్షో ఇంకా చెప్పక పోవటం వల్ల, ఆతృతగా వుంది. "నన్నేం చేస్తావ్?" అని అడుగుదామా అని చూస్తున్నాను.

"ఇక ముందు ఇలాటి వెధవ పని చెయ్యనని లెంపలు వేసుకో" అంది.

బతికాను! ఈ కొద్ది శిక్షతోనూ ఇది వదిలించుకుంటే

అదృష్టవంతుణ్ణే! రోజూ స్కూల్లో చెంపలు వేసుకోవటం అలవాటవటంవల్ల ఇందులో సిగ్గుపడాలనే జ్ఞానం కూడా పోయింది. చప్పున చెంపలు వేసుకున్నాను.

"ఊఁ! ఇంకెప్పుడన్నా ఇలాటి పని చేస్తావా?"

"చెయ్యను"

"వాళ్ళతో ఇంకెప్పుడూ మాట్లాడవోక...వాళ్ళు మంచి వాళ్ళు కాదు"

"నాకు రోజూ మిఠాయి పెడుతున్నారు" ఆ మిఠాయి రుచి ఆమెకు తెలియక పోవటంవల్ల వాళ్ళ మంచితనం ఆమెకు అర్థం కాలేదేమో నని నా దిగులు!

ఆమె నవ్వి అంది: "వెర్రి వెధవా! మిఠాయిలు పెట్టే వాళ్ళందరూ మంచి వాళ్ళనుకుంటున్నావా? నేను మాత్రం రోజూ నీకు మిఠాయి పెట్టటంలా? అసలు నేను దయవల్చి వొదిలిపెడుతున్నాను కాని, లేకపోతే నా అసలు యీ ఇంటి ఛాయలకే రానిచ్చేదాన్ని కాను. మీ నాన్నతో చెప్పి వీపు తాషామరబా చేయించేదాన్ని...ఏదో తెలియదు లెమ్మని ఊరుకుంటున్నా"

నాకు ఎంత శిక్ష తప్పించింది! నిజంగా సుందరి మంచి తనమంతా నా కిప్పుడు అర్థమౌతోంది!

"పోనీ వాళ్ళనుకూడా యీ సారికి వొదిలెయ్యరాదూ?" అన్నాను; అసలు విషయమే రూపుమాసిపోతే నా కింకా రక్షణంగా ఉంటుందనే కాని, వాళ్ళమీద సానుభూతితో మాత్రం కాదు.

"వాళ్ళనా? డొక్కలు చీలిపిస్తాను...వెధవ మొగాళ్ళు! పెద్ద ఎద్దులల్లే ఉన్నారు...ఆ మాత్రం తెలియనక్కర్లా!"

నయమే! పెద్దవాణ్ని కాకపోవటంవల్ల చీవాట్లూ, ఆపైన డొక్కచీల్చబడడమూ తప్పినయ్! ఇంకెప్పుడూ ఇలాగే

చిన్నగా ఉంటే, యీ తప్పులన్నీ నా మీద పడకుండా హాయిగా బతకొచ్చు!

"పోనీ కాని... నేను ఇచ్చానని చెప్తావా?" ముఖం దీనంగా పెట్టాను; సుందరి అభిమానాన్ని సంపాయించేందుకు ఇదొక ఎత్తు.

"చెప్పనులే...నువు మాత్రం వాళ్ళతో మాట్లాడావంటే మాత్రం ఊరుకోను."

బాగా నమ్మకం కుదిరింది; తలూపి బైటపడ్డాను.

నేను వీధిలోకి రాగానే త్రిమూర్తుల్లాగు వీళ్ళు నా కోసం తయారుగా కూర్చున్నారు.

"ఏరా ఏమైంది!" అంటున్నాడు దాసు.

నేను సమాధానం చెప్పకుండా సుందరి ఆజ్ఞను తలుచుకుంటూ నా దారిన పోబోతున్నాను. దాసు దారికి అడ్డం నిలిచి అన్నాడు: "ఆగరా బాబూ! మళ్ళా ఏమన్నా రాసి ఇచ్చిందా?"

వీళ్ళ బొంద! అంతా వీళ్ళు ఊహించినట్టు జరిగేందుకు ఇదేం కథ కాదు!

"మీతో మాట్లాడను."

"మిఠాయి కావాలా?"

"ఊహుం. నాకు సుందరి బోలెడంత మిఠాయి పెడుతుంది; ఆమె మీతో మాట్లాడ వొద్దంది-"

"ఆమెకు ఉత్తరం అసలు ఇచ్చావట్రా?"

"ఊహు ఇవ్వాలా...నా జేబులోది లాక్కుంది..." ఆగాను! యిక వీళ్ళను వొదిలించుకొని వెళ్ళిపోదామని.

"తర్వాత ఏమైందీ!"

"కోప్పడ్డది...మీ పని పడతానంది...మీ డొక్కలు చీలిపిస్తానంది" ఇంకా ఆమె చెప్పిన శిక్షలు జ్ఞాపకం చేసుకుంటున్నాను.

"ఆఁ! వ్యవహారం ఎదురుతిరిగిందే?" అంటున్నాడు దాసు.

మిగతా యిద్దరికీ ఇది గొప్ప సువార్తగా వుంది. వాళ్లు తమ సంతోషాన్ని భుజాలు ఎగరెయ్యటంతో సూచిస్తున్నారు. తమకు మంచేమీ కలగకపోయినా, యితర్లకు కలిగే హానే ఆనందాన్ని ఇస్తుందికాబోలు!

"సారా—సుందరి పిలుస్తోంది."

"ఎవర్ని?" అన్నాను, నేను.

"నిన్నుకాదు...దాసును-"

"ఎందుకూ?"

"డొక్క చీలిపించేందుకు-"

దాసు నోటివెంట మాట లేదు; ముఖం మాడిపోయింది.

"ఎట్లాగురా?" అంటున్నాడు ఒణికే కంఠంతో.

"ఎవరి వీపులు వాళ్ళవేనని పరా వుంది..." అంటున్నాడు సుబ్రహ్మణ్యం.

"నేను పోతున్నాను...నాతో మాట్లాడొద్దు-"

"మాట—మాట...ఉత్తరం ఎక్కడ వుంది?"

"ఆమె దగ్గరే వుంది."

"మెల్లిగా లాగలేవూ?"

"నాకు చేతకాదు-"

నేను వెళ్ళిపొయ్యాను. ఐదు నిమిషాలు గడవకముందే వాళ్ళు మాయమయ్యారు. ఆ సాయంత్రం ఎదురు అరుగుమీది మిఠాయి దుకాణంకూడా మాయమైంది.

"చూశావా-వీపులు మోగుతున్నాయ్-" అంది సుందరి.

చప్పున నా వీపు జ్ఞాపకం వొచ్చి, ఏమైందోనని తడుముకున్నాను. అది సురక్షితంగా ఉన్నంతవరకూ ఏం మోగినా ఫర్వాలేదని నా అభిప్రాయం!

"ఎవరివీ?"

"వాళ్ళ ముగ్గురివీను-"

"పాపం!" అన్నాను సానుభూతిగా.

"పాపమేంటి? జ్ఞానం ఉండొద్దూ? ఈ సారి నా కంట పడనీ-చెప్తాను..నువ్వు మళ్ళీ వాళ్ల దగ్గరకు వెళుతున్నావా?"

"ఉహు, వెళ్ళొద్దన్నావ్ గా."

"నేను చెప్పినట్లల్లా విను—తెలిసిందా?"

"సరే..."

# 6

గదిలో మేము నవ్వుతూ మాట్లాడుకోటమూ, తమ పురాణాన్ని ధిక్కరించటమూ చూస్తే ముసలమ్మల మనస్సులు కలవరపడ్డట్టున్నయ్.

"ఎప్పుడూ ఆ గదిలో చావకపోతే ఇక్కడ వుండరాదూ?" అంది మా ముసలమ్మ ఒకనాడు.

"ఇక్కడ నాకు బాగుండదు."

"పోనీ యింట్లో పడుకో."

"నువ్వుకూడా రా."

ముసలమ్మకు యింటికన్న పురాణంమీద ఎక్కువ ఆపేక్ష. సుందరి అత్తగారివంటి శిష్యురాలూ, శ్రోతా ఆమెకు మరెక్కడా దొరకదని నాకు బాగా తెలుసు. అందుకనే నేను ఆమెనే పట్టుకు వేళ్లాడటం!

"నువ్వు పో—నేను వొస్తాను..." అంది.

"ఉహుం, నువ్వూ రా..."

"పోనీ అక్కయ్యా! ఏదో చిన్న వెధవ...ఎక్కడ వుంటే నేంలే...దానికేమీ తోచదాయె..." అంది శిష్యురాలు.

'వెధవ' అన్నా 'ముండ' అన్నా నాకేమీ కష్టంలేదు—ఎందుకంటే ఆ 'వెధవరికం' తోనూ 'ముండరికం' తోనూ నేను సుందరితో కలిసి కాలం గడిపే అవకాశాన్ని సంపాయించగలుగుతున్నానుగా?

"పోనీ అక్కడున్నా చదువుకోరాదూ!" అంది మా ముసలిది.

"ఇది బాగుంది!" అంది వాళ్ళ ముసిలిది. గురువు చెప్పిం దాన్నల్లా గొప్పగా భావించటం ఆమెలో ఈ మధ్య పెరిగిన ఒక సుగుణం!

"సుందరీ!" అని పిలిచి, "ఎప్పుడూ ఆ పాడు పుస్తకాలు చదవకపోతే రామాయణమో, భారతమో, భాగవతమో చదు వుకోరావటే?" అన్నది, అత్తగారి పెత్తనాన్ని చెలాయిస్తూ.

ఈ జన్మకు ఇంత సాహిత్యంలోనూ ఆమెకు కనిపించినవి మూడే పుస్తకాలు! అవి ప్రసాదించే ఆ పాతకాలపు విజ్ఞా నమే చాలు! అంతకన్న పైకి పోవటమంటే భయం. ఎందు కంటే, ఈ ముసలమ్మలకు ఆ మూడు పుస్తకాల విజ్ఞానంకన్న ఎక్కువలేదు; ఇతర్లు-అందులోనూ తనకన్న తక్కువది కోడలు లాటిది-చిన్నది-తనకన్న ఎక్కువ విజ్ఞానాన్ని సంపాయించ టానికి ప్రయత్నించటం ధిక్కారం! అదీకాక, అంతకన్న ఎక్కువ విజ్ఞానమైతే ప్రమాదం ఏదైనా సంభవించొచ్చు! అది ఎలాటి విజ్ఞానమోకూడా తెలియ నవసరం లేదు. ఎందు కంటే-తెలియటమూ, ఆ ప్రమాదం సంభవించటమూ ఒకే సారి జరుగుతయ్ కనక!

కోడలు చదివేవి పాడు పుస్తకాలట! ఇప్పటి కొందరు విమర్శకుల్లాగే చదవకుండానే తేల్చెయ్య గలిగింది! చదు వుతే-మోసపోతానన్న భయం! అంటే ఆమె అనే ఆ పాడు పుస్తకాల్లో ఎంత గొప్ప శక్తి ఉండి వుండాలో ఆమె ఆలో చించటం లేదు!

"చదివాను" అంది, సుందరి; ఎదిరించి మాట్లాడటమూ, అనవసరంగా సంభాషణను పెంచి రసాభాస చెయ్యటమూ ఆమెకు చాతకాదు. సకారణమైన వాదన నిష్ప్రయోజనమని తెలిసినప్పుడు తన శక్తిని వృధా చేసుకోవటం దేనికీ!

"మళ్ళీ చదువు" అంది ముసలమ్మ.

ఆమె దృష్టిలో అందరి అభిరుచులూ ఒకటే! ఇదే నిజమైతే ఇన్నిరకాల వ్యక్తులకు భూలోకంలో తావు లేదు. అసలు రామాయణమూ, భారతమూ, భాగవతమూ అనే మూడు పుస్తకాలకు, ఐదుగురు రచయితలకు బదులు, ఒక్కడే ఉండి వుండాల్సింది!

"ఊఁ" అని మూలిగింది సుందరి.

"పోనీ వాసుకు చదువు చెప్పరాదూ?"

"సరే—" అని ఆమె వెళ్ళిపోయింది.

"పోయి చదువుకోరా" అంది మా ముసిలిది.

నాకు మా మాష్టరి పాడుముఖం చూస్తే, కొత్త పుస్తకమైనా చదువుకుందామనే సరదా ఉండేదికాదు కాని, సుందరి గురూత్వం తయారవగానే నాకు చదువుమీద ఆపేక్ష కలిగింది.

"పోయి పుస్తకాలు తెచ్చుకో-" అంది సుందరి.

నలగని పుస్తకాలతో తయారయ్యాను. ఆమె వాటిని అటూ యిటూ తిరగేసి చూసింది. "ఇంకా ఈ పుస్తకాలేనా?" అంది.

ఆ నివరకువి ఏమిటో తెలియక, "ఊఁ" అన్నాను.

"తగలెయ్...ఇంకా ఈ రుక్మిణీ కల్యాణాలూ, ఈ ఆవు వ్యాసమూ యివేనా?" అందామె.

"ఇవి మంచివికావా?" అన్నాను.

"పాడు...ఎందుకవ్వి?"

"మరి మంచివి ఏవి?"

సమాధానంగా తన బీరువాను చూపింది; ఆ పుస్తకాలన్నీ చిన్నవే! వాటికి బైండుకూడా లేదు; పెద్ద పుస్తకాలు కాంది, అవి ఎలా గొప్పవైనయో నా బుల్లి బుర్రకు అర్థమవలేదు.

"ఇవా? మరి మన ముసలమ్మలు చదివే పెద్దపుస్తకాలో?"

"అవ్వి తలగడాలు!"

"ఐతే ఇవ్వి ఏ క్లాసులో చెప్తారూ?"

"ఇవ్వి ఎక్కడా చెప్పరు; తెలుసుకోవాలి."

"పోనీ ఒకటి నా కివ్వు...చదువుతాను."

"నీకు అర్థంకాదు."

"నువ్వు చెప్పుదుకానివి-"

"చెప్పినా ఇప్పుడు తెలియదు."

"మరి ఎప్పుడు తెలుస్తుంది?"

"నువ్వు పెద్దవాడివైతే—మీ అన్నయ్యంత ఐతే!"

ఇప్పుడే పెద్దవాణ్ణయి ఆమె మెచ్చుకునే పుస్తకాల్ని చదివి, చప్పున అర్థంచేసుకోవా లనిపించింది. అసలు 'అన్నయ్య'ను తెలుచుకోని ఎప్పటికైనా నేను అంతపెద్ద వాణ్ణవుతానా (శరీర పరిమాణంలోనన్నా?) అనే అనుమానం కూడా కలిగింది...మరి పెద్ద వాణ్ణయితే 'చిన్న వెధవ' తప్పులన్నీ చచ్చినట్టు భరించాల్సిందా? ఎట్లా కావాలంటే అట్లా అయ్యేట్టుంటే కాని ఉపాయంగా వుండదు.

"సరే...నా క్లాసు పుస్తకాల మాటేమిటీ!"

"ఇవ్వంటే నీకు ఇష్టమా?" అని అడిగింది.

పుస్తకాలంటే ఇష్టంలేదు కాని, ఆమెచేత చెప్పించుకోవటమంటే ఇష్టం.

"ఉహుఁ" అన్నాను.

"మరి చదవటం దేనికి? అవ్వి అవతలపారేసి, లేస్తుంటే, ఆ పొట్లాంలో మిఠాయి వుంది...తిను..."

"ముసలమ్మ చూస్తే?"

"ఏడిసిందిలే...ఏం చేస్తుందీ?" అంది.

ఆమె అంతధైర్యంతో చెప్పాక, పుస్తకాలకన్న అతి మధురమైన మిఠాయిమీద దాడి సాగించక తప్పిందికాదు. ఇక

ముందుకూడా రోజా ఇలాటి పాఠాలే నేర్పుతూంటే బాగుండు ననిపించింది.

# 7

"వొదినా! 'సుందరి' అంటే, ఏమిటి?"

నవ్వింది; "వాసు అంటే ఏమిటి?"

"వాసేంటి? వాసుదేవరావు—"

"నేను...రావు...లెక్కలు రావు, పాఠాలు రావు, ఏమీ రావు..."

"ఛా...అందుకే కోపం వొస్తుంది..."

"సరే; వాసుదేవరావంటే ఏమిటి?"

"ముందు సుందరి అంటే ఏమిటో చెప్పు"

"నువ్వు చెప్పు...నాకు తెలియదు"

"ఐతే విను: సుందరి అంటే—అందమైనది—"

"ఎవరు చెప్పారూ?"

"మాస్టరు చెప్పాడు; అప్పుడు నువ్వు జ్ఞాపకం వొచ్చావు"

"నేను అందమైనదాన్నా?"

ఆమె అమాయకత్వానికి నాకు నవ్వొచ్చింది, "లేకపోతే నీపేరు 'సుందరి' అని ఉండేది కాదు. సుందరి అంటే మా వొదినే అందా మనుకొన్నాను."

తల ఆడించి నవ్వి ఊరుకుంది.

ఒకనాడు తోటలో మామిడి మొక్క గాలికి ఒరిగి పోయింది. అదిచూచి ఆమె నొచ్చుకుని, "కర్ర తీసుకురా, ఆధారం కడదాం..." అంది.

నేను కర్ర తెచ్చాను. ఆమె కడుతోంది.

"ఈ మొక్కకు కాయలూ లేవు! పూలూ లేవు. దీన్ని పెంచటం దేనికి?" అన్నాను.

నే నేదో మహాగొప్ప తెలివైన ప్రశ్న వేసినట్టుగా నా ముఖంలోకి చూసి, చప్పున నన్ను దగ్గరకు లాక్కొని ముఖంలో ముఖముంచి, కళ్ళుమూసుకొని ముద్దుపెట్టుకుంది. నేను ఆమెకు కష్టం కలిగించానేమోనని బాధపడ్డాను. నా బుగ్గ మెలెయ్యక పోవటంవల్ల, ఇది పెద్ద తప్పు కా దేమో ననిపించింది. పరిస్థితి అర్థంకాక ఆందోళన పడసాగాను.

ఆమె కాస్త ఆలోచించి అంది: "కాని కొన్నాళ్ళకు కాపు కాస్తుంది; మరి కొన్నాళ్ళకైనా కాపు కాయక పోతుందా?"

"కాయకపోతే?"

"—కొంత శ్రమ నష్టం! ఐనా జాగ్రత్తగా నీళ్ళుపోసి పెంచుతే సామాన్యంగా కాయకపోదు"

ఇద్దరమూ-కాస్తుందో కాయదో ఊహించలేని మానవ మాత్రులమే కావటంవల్ల అంతతో ఆ విషయం మాట్లాడకుండా ఊరుకున్నాం.

మధ్యాహ్నం సుందరి గదిలోకి చప్పుడు చెయ్యకుండా వెళ్ళాను-ఆమెను ఆశ్చర్యపెట్టాలని. కాని ఆమె నిద్రపోతోంది. మధ్యాహ్నం నిద్రపొయ్యే అలవాటు ఆమె కెప్పుడూ లేకపోవటంవల్ల నాకది కొత్తగానే వుంది. ఆమె దగ్గర నాకున్న స్వాతంత్ర్యంతో మెల్లిగా దగ్గరకు వెళ్ళాను. ఆమె ముఖాన్ని పరీక్షగా చూశాను...ఆమె పెద్దకళ్ళు మూతపడి వున్నా ఆ ముఖంలో కొత్తరకం అందం కనిపించింది. కను రెప్పల చివరి వెంట్రుకలు తీర్చి దిద్దినట్టున్నయ్. కాస్త చెమ్మగిలిన కను కొలకులు-పుష్పం మీది హిమబిందువుల్ని జ్ఞాపకం చేసినయ్.

ఆమె ముఖం చూస్తే నాకు ముద్దు పెట్టుకోవా లనిపించింది. ఎప్పుడూ ఆమె నన్ను ముద్దు పెట్టుకునేది; తనకు ఆ ముద్దుల మీద ఇష్టం కలిగినప్పుడే నాకు ఇష్టమని ఆమె భావిం

చేది కాబోలు! నాకు అప్పుడప్పుడు ముద్దు పెట్టుకోవాలని ఉన్నా ఆమెను అడిగే ధైర్యంలేక ఊరుకునేవాణ్ణి. కాని ఇప్పుడు ఆ పని చెయ్యాలనుకున్నాను. ఆమె అనుజ్ఞ తీసుకోవల్సిలేదు...ఎందుకంటే-ఇన్నిసార్లూ ఆమె నా అనుజ్ఞకోసం ఎన్నడూ ఆగలేదు గనుక. అదీకాక-ఆమె నిద్రపోతోంది కనుక, నేను చేసే పని ఆమెకు తెలియదు. దొరతనంగా సంపాయించే సౌఖ్యంకన్న దొంగతనంగా సంపాయించిన దానికే ఎక్కువ విలువను ఇవ్వటం, అప్పటికే నాలో ప్రవేశించింది.

ఈ నిశ్చయంతో మెల్లిగా ముద్దు పెట్టుకున్నాను. ఆమె ఇన్ని సార్లు నన్ను ముద్దు పెట్టుకున్నప్పుడు కలగని కొత్త ఆనందం కలిగింది. నన్ను ముద్దుపెట్టుకున్నప్పుడల్లా ఆమె కూడా ఇంత బాగుంటుంది కాబోలు! ఆ తన్మయత్వంలో నాకు తెలియకుండానే బలంగా ముద్దుపెట్టుకున్నానేమో-ఆమె మెల్లిగా గాబరా పడకుండానే కళ్ళు విప్పుతూ, "నువ్వా?" అంది నవ్వుతూ. నాకు భయివేసి చప్పున వెనక్కు తగ్గాలని చూశాను కాని ఆమె నా తలకాయను తన రెండుచేతుల మధ్య నొక్కిపట్టి నాకు ఊపిరి తిరక్కుండా ముద్దుల వర్షాన్ని కురిపించింది.

"-ఐతే ఇంత అల్లరి పిల్లాడివి అవుతున్నావేం?" అంది తన పక్కనే పడుకోపెట్టుకుంటూ.

అల్లరి చేస్తున్నప్పుడు ఆ మాట అనక ఇప్పుడు అంటుందేమా అనిపించింది. ఇదొక రకం అల్లరేమో నాకు తెలియదు; ఒకవేళ దీన్నికూడా అల్లరి కిందనే జమకడితే, రోజా తను చేసే అల్లరిమాటేమిటి? ముందు తను అల్లరి పిల్లయి—అల్లరి చెయ్యటాన్ని నాకు నేర్పిందన్నమాట!

"రోజా నువ్వు చేసే అల్లరో?" అన్నాను.

నవ్వింది—నా తెలివికి కాబోలు! ఆమె నన్ను చూసి హాయిగా నవ్వితే—నాకు యీ ప్రపంచానికే రాజు

నైనంత గర్వం కలిగేది!

"అల్లరి చేస్తే చేశావ్ కాని-దీన్నిగూర్చి ఎవరితోనైనా చెప్తున్నావా?"

ఇంత మంచి అనుభవాన్ని ఎవరితోనూ చెప్పకుండా ఎలా వుండేది? కాని చెప్పేందుకు భయం. అసలు అంతబాగా ఎదుటి వాడికి అర్థమయేట్టు చెప్పే భాషాజ్ఞానమూ లేదు; నా అనుభవాల్ని తెలుసుకోవాలని కుతూహలం చూపే శ్రోతా దొరకలేదు.

"ఉహుఁ" అన్నాను.

"చెప్పవోక."

"చెప్తేనేం?" అన్నాను—ఏనాటికైనా మనసు ఉండబట్టక, ఎవరితోనైనా చెప్తే వొచ్చే ప్రమాదాన్ని ముందుగానే తెలుసుకోవటమూ. ఆ ప్రమాదానికి ఏదైనా విరుగుడు ఇప్పుడే ఆలోచించి పెట్టుకోవటమూ ఎందుకన్నా మంచిదని.

ఆమె కళ్ళు ఎర్రజేసి, బుగ్గలు మెలేసి, "చెప్తావూ? నాకు తెలుసు: ఏనాడో అంతపనీ చేస్తావని! పైన 'చెప్తేనేం?' అని వెధవ ప్రశ్నలు...నీకు మిఠాయి పెడితే, అది తిని ఊరుకోక—దీన్ని ఎవరు వొండారు? ఇందులో ఏమేం కలిసినయ్? అని కుంటి, గుడ్డి ప్రశ్నలు వేసేవాడిగా తయారౌతున్నావ్? అసలు ఈ పాడు మగజాతిని నమ్మి ఏమాత్రం సళ్ళిచ్చినా ఇంతే! పైన వెధవ ప్రశ్నలు!" అని ఒక మొట్టికాయ మొట్టి చెప్పింది. నాకు కళ్ళనీళ్ళ పర్యంతమైంది.

"చెప్పకూడదు—తెలిసిందా?"

"ఆఁ" అన్నాను రెండో మొట్టికాయన్నా తప్పించుకునేందుకు.

"ఏం తెలిసింది?"

"చెప్పకూడదు—నువ్వు మొట్టావని."

"కాదురా మొద్దూ!...ఇదంతా—ఈ నాలుగు గోడల

మధ్యా జరిగేది ఎవరితోనూ ఎప్పుడూ చెప్పకూడదు. అలా చెప్పావంటే యికముందు నువ్వు యిక్కడికి వొచ్చేందుకు వీల్లేదు. అంటే-నీకు మిఠాయి వుండదు: ప ళ్ళుండవు..."

"ముద్దు లుండవు—"

ఫక్కున నవ్వింది!

"అన్నీ తెలుసు వెధవకి...తెలియనట్టు నటన! సరే... ఎవరితోనన్నా చెప్తే నీ వీపుకూడా మోగుతుంది!"

ఆమె అంటే నాకుండే 'ప్రేమ' వల్లనైనా యీ విష యాన్ని జీవిత రహస్యంగా దాయాలని నిశ్చయించుకున్నా. అదీకాక దాసుగాడి వీపు జ్ఞాపకం వున్నన్నాళ్ళూ సుందరి లోని భీకర రూపం మరిచి పోవటంకూడా కష్టమే!

'సరే' నన్నట్టు తల తిప్పాను. తను కష్టపడి నాకు నచ్చ చెప్పగలిగినందుకు,చాలా సేపట్నుంచీ బిగపట్టుకున్న ఊపిరిని చప్పుడయేట్టు వొదిలిం దామె.

# 8

రోజూ ఆమె నాకు తినుబండారాలు పెడుతోంది. కాని నేను ఆమెకు కృతజ్ఞత చూపటంతోనే సరిపోతూ వొచ్చింది. ఒకనాడు ఆమెకు వస్తురూపాన ఏదైనా ముట్టజెప్పాలని ఆలో చించాను. మర్నాడు స్కూలునుంచి వొచ్చేప్పుడు ఏదన్నా కొనుక్కొద్దా మనుకున్నాను. ఆమె లడ్లూ, జిలేబీలూ రుచి చూసి వుంటుంది కాని, చలమయ్య చేగోడీల్ని మాత్రం ఎరిగి వుండదు; ఎందుకంటే-అవ్వి మా స్కూలు దగ్గర తప్ప ఇంకె క్కడా దొరకవు.

మర్నాడు మధ్యాహ్నం ఫలహారానికి గాను నాన్న యిచ్చిన అణాను జాగ్రత్తగా దాచి, మధ్యాహ్నపు ఆకలిని ఎలాగో అణిచిపెట్టి, సాయింత్రం వొచ్చేప్పుడు చేగోడీలు కొన్నాను.

అవి తెచ్చానన్న మాటేకాని, అంత గొప్ప సుందరికి యీ అణా చేగోడీలూ యివ్వటమంటే చాలా హీనంగా తోచి సిగ్గసింది. కాని తెచ్చాక ఇవ్వకుండా వుండటం ఎట్లా?...సిగ్గుపడుతూనే పొట్లాం చొక్కా చాటున పెట్టుకొని వెళ్లాను.

“ఏమిట్రా అవి?” అంది నా వాలకం చూసి ఆమె చేత ప్రశ్న వేయించుకొని కాని బైట పెట్టకూడదనుకున్న నాకు త్వరలోనే మోక్షం కలిగింది...ఈ కరంకరం చేగోడీల వాసన అప్పుడే ఆమెకు తగిలిందని, వాటి గొప్పతనానికీ, వాటిని తయారుచేసే చలమయ్య గొప్పతనానికీ, వాటిని అణా పొట్లాంగా సుందరికోసం మోసుకొచ్చిన నా గొప్పతనానికీ నేనే గర్వపడ్డాను.

“చేగోడీలు” అన్నాను, పొట్లాం బైటికి తీస్తూ.

“ఏవీ ఇట్లా తీసుకురా” అంది.

కాసేపు ఏడిపిద్దా మనుకున్నాను కాని, ఆమె ఆతృత చూసేప్పటికి ఇవ్వకుండా వుండ బుద్ధిపుట్టలేదు. అసలు నేను ఇవ్వక ముందే నా చేతులోని పొట్లాం లాక్కొని, ఒకటి తీసి వాసన చూసి, మొహం చిట్లిస్తూ “ఛీ-ఈ కిరసనాయిలువా?” అంది.

రోజూ తినే నాకు వాటిల్లోని కిరసనాయిలు వాసన ఎందుకు తగల్లేదా అనే అనుమానం కలిగింది. ఇంత కష్టపడి తెచ్చిన చేగోడీల్ని ఇలా తృణీకరించేప్పటికి నా మనస్సు చివుక్కుమంది.

“కిరసనాయిలా?” అన్నాను, సగం ఉత్సాహంచచ్చి.

“కాక? వెన్న కాచిన నేతివా?...సరే...తిను” అని నా ముందుకు తోసింది.

“నీ కోసమే తెచ్చాను.”

"నా కోసమా?" అని నా ముఖంలోకి సంతోషంతో చూసింది.

"నీ కోసమే! బాగుంటై...కరకరలాడుతో..." నా పొగడ్త పూర్తి కాకపూర్వమే టాకీల్లోలాగు ఆమె అప్పుడే కరకరలాడిస్తోంది.

"రా—నువ్వుకూడా తిను."

"నేను రోజూ తింటూనే వుంటా...నువ్వు తిను—"

"ఇన్నా?"

"అన్నేగా?...అణావి!" అణా అంటే నాలుగు కానులనే అభిప్రాయమూ, ఆమెకు ఆ నాణెంయొక్క గొప్పతనమూ బాగా అర్థమయ్యేందుకు అగానూ.

నవ్వింది. "అణావేనా?" అంది.

అణా అంటే ఏమనుకుంటోందో నాకు అర్థంకాలేదు.

"ఊఁ, అణాకు ఎన్నో చూడు..." అన్నాను. బేరం చేసి ఒకటో నెంబరు సరుకు ఎంత ఎక్కువ తెచ్చానో చూసి, నా తెలివిని అర్థంచేసుకో మన్నట్టు ఆమె ముఖంలోకి గర్వంతో చూశాను.

"అందుకే...ఇన్ని నేనేం తినేది?"

"నేను అవన్నీ ఒక్కసారే ఊదేస్తాను"

"నువ్వు మొగాడివిరా!"

నా మొగతనాన్ని లోలోనే మెచ్చుకున్నాను. తినటంలో ఆమె నాకన్నా తక్కువ దనే విషయం ఇప్పుడే గ్రహించి, ఆమెను తక్కువ చూపు చూశాను.

"రా...ఇంక నా కొద్దు—తిను"

"నువ్వూ తిను"

ఇద్దరమూ పొట్లాం మాయం చేసి, కాగితాన్ని మాత్రం మిగిల్చాం.

మర్నాడుకూడా పొట్లాం తీసుకొని వెళ్ళాను.

"ఏమిటవి?" అంది.

"కిరసనాయిల్ చేగోడీలు!"

చేగోడీలు కిరసనాయిల్‌తో చేసి ఆ వాసన్నూ తగలనీకుండా చేస్తారేమో; నే కొత్త అభిప్రాయం నిన్న ఆమే కలగజేసింది; 'కిరసనాయిల్ చేగోడీలు' అని మొదట అని, తరువాత ఇష్టంతో తినటంవల్ల నేను ఇలాటి అభిప్రాయానికి వొచ్చాను. అందుకని 'చేగోడీలకు' ముందు 'కిరసనాయిల్' కూడా తగిలించి ఆమె నోట్లో ఊట లూరిద్దా మనుకున్నాను.

"రోజూ ఇవ్వేస్త్రూ?" అంది.

ఇంతకన్న మంచి రుచికరమైన సరుకు యీ ప్రపంచంలోనే లేదని నాకు గట్టి నమ్మకం; ఆమెకు ఆ చిన్న విషయం తెలియకపోవటం నాకు నవ్వు తెప్పించింది.

"ఇవి ఎంత బాగుంటయ్యో తెలుసా?" అన్నాను. ఒకసారి రుచిచూసికూడా మజా తెలుసుకోలేని సుందరిని ఎలా అర్థంచేసుకోవాలా అని ఆలోచిస్తూ.

"సరే-తీసుకురా" అంది. ఇద్దరమూ వొంతులు వేసుకొని తిన్నాం.

సుందరికోసం చేగోడీలు తీసుకువెళ్ళాలంటే-రోజూ నేను మధ్యాహ్నం ఫలహారాన్ని మానుకోవలసి వొస్తుంది; ఇది చాలా ఇబ్బందిగా తోచింది. సుందరికోసం ఇది త్యాగం చెయ్యవొచ్చు కాని, ఆకలి ఆకరే! నాన్నను ఇంకో అణా అడుగుదామంటే—ఇవ్వడని గట్టిగా తెలుసు. దీనికి ఏదన్నా ఉపాయం ఆలోచించక తప్పిందికాదు. నాన్న భోంచేసేప్పుడు మెల్లిగా కోటుజేబు సర్దటం చాలా తేలిగ్గా కనిపించింది. ఆ పనే సాగించాను...వెధవ అణా చేగోడీల్లో మళ్ళీ భాగం అనేప్పటికి, డోసు చాలక మర్నాటినుంచీ బేడవి తేవటం మొదలెట్టాను.

"ఇన్నా?" అందామె.

"ఇవ్వేగా...చెరి అణావీను!"

"నీకు డబ్బులు ఎక్కడివిరా?" అందామె.

"తెచ్చాలే."

"ఎక్కణుంచీ?" ఎక్కడన్నా దొరుకుతయ్ అను కుంటూంది కాబోలు!

జేబులు తడువుకుంటున్నా నంటే ముందు ఇక్కడ నా అంతట నేనే బైటపడాలిని వొస్తుందని. "నాన్నను అడిగి-"అన్నాను.

ఆమె తృప్తిపడి ఊరుకుంది.

రెండు వారాలు గడిచేప్పటికి నాన్నకు అనుమానం వేసి నట్టుంది.

"డబ్బులేమన్నా తీస్తున్నావట్రా?" అన్నారు.

నేను ఒప్పుకుంటానా? "లేదు" అన్నాను.

అంతతో ఆయన ఊరుకున్నాడు; తప్పించుకోవటం ఎంత తేలికో కనిపించింది!

ఆనాడు కూడా డబ్బులు మామూలు స్థానంలోనే ఉండ టంవల్ల-ఆయన తను లెక్క పెట్టుకోవటం పొరపాటని అను కొని ఉంటాడనేది స్పష్టమైంది. మామూలుగా స్టూలు వేసు కొని, జేబులో చెయ్యిపెట్టి బేడబిళ్ళకోసం తడుముతున్నాను. వెనక వీపుమీద టపాకాయ పేలింది. అదిరి, ఎగిరి గంతేసి చూసేప్పటికి నాన్న నిలబడి వున్నాడు. బైటికి దూకి పరదేశాం తర మన్నా పోదామనే పద్ధులో ఉండగానే ఆయన నన్ను పట్టుకొని దభీదభీ ఒక డజనుసార్లు వీపు మోగించి, "దొంగ వెధవా! రోజూ ఇట్లాగే తీస్తున్నావా? చీలుస్తాను-జాగ్రత్త!" అన్నాడు.

నాకు ఏడుపొచ్చింది; కాని చీలుస్తానని చీల్చకపోవడం గుడ్డిలో మెల్లగా కనిపించింది. సుందరి వినిపోతుందేమోననే భయంతో బిగ్గరగా ఏడుపురాకుండా గుడ్డ నోట్లో కుక్కు కున్నాను...ఆ నాటికి మామూలు అణా కూడా లేదు.

సాయంత్రానికి నన్ను నేనే సముదాయించుకొని, రిక్త హస్తాల్తోనే సుందరిని దర్శించా.

"ఏవిరా చేగోడీలు?" అంది. మరిచిపోయి అడక్కుండా ఊరుకుంటుందేమో ననుకున్నాను. ఒకసారి రుచి మరిగాక చెలమయ్య చేగోడీల్ని తేలిగ్గా ఎవ్వరూ మరచిపోలేరు కాబోలు!

"లే—వు."

"మధ్యాహ్నం—నీ వీపుమీది బూర్లి మూకుడులో చిట్ పట్ మన్నయ్యే కిరసనాయిల్ చేగోడీలు...?"

నా వీపుమీద చేగోడీలు పడ్డట్టు యీ మెకు ఎలా తెలిసిం దనే మీమాంస బయలుదేరింది. ఇంక దొంగ ఎత్తు లాభం లేదని తేలింది.

"డబ్బులు—మీ నాన్నను అడుగు తున్నానని చెప్పావ్ కదా—మరి జేబుల్లో చేతులు పెట్టడం దేనికిరా?" అంది.

"నాన్న ఇవ్వడు...మరి మన ఇద్దరికీ కావాలంటే..."

"వెధవా! 'మనం' అని నన్నుకూడా కలుపుతావేం! నేను నిన్ను చేగోడీలు తెమ్మన్నానా? తెమ్మన్నా, జేబులు సర్ద మన్నానా?"

"లేదులే...నీ కోసమూ, నా కోసమూ ఆ పని చేశాను... వినా నా వీపేగా—" అన్నాను. 'నీ కోసం బాధలుపడే నేనూ నా వీపూ వున్నాంగా?' అన్నట్టు చూస్తూ.

"నీదైతేమాత్రం...దొంగతనం చెయ్యొచ్చా?"

"దొంగతనము చేయరాదు...సత్యము పలుకుము..."

"తెలుసూ? ఇకనుంచీ దొంగతనం చేస్తావా?"

ఇంకా చేసి నా వీపు పాడుచేసుకుంటూనాయేం?

"చెయ్యను."

"డబ్బు లెట్లా?"

అదే నా ఏడుపూను.

"నువ్వు చెప్పు—" అన్నాను; ఏదో చెడని ఉపాయమూ, మంత్రమూ బోధిస్తుందనే ఆశతో.

"నేను ఇస్తాలే...ఏం?"

బతికాను! నాకు శాంతలాంటి సుందరి ఉంటే—అసలు చెలమయ్యగాణ్ణి రేపీపాటికే ఈ యింట్లో దింపి, చేగోడీల కార్ఖానా పెట్టనూ?

"నువ్వు మంచిదానివి, వొదినా?"

'ఔ' నన్నట్లు తల ఆడించి నవ్వింది.

# 9

నేను వెళ్ళేప్పటికి సుందరి పడుకొని వుంది... మెల్లిగా దగ్గరికి వెళ్లాను. ఆమె పక్కగా తిరిగి కళ్లు మూసుకొని లోలోనే వెక్కి వెక్కి ఏడుస్తోంది. తలగడామీద పడ్డ కన్నీటిచుక్కలు వేసిన ముద్ర ఇంకా ఆరలేదు. అసలు ఏడ్చేవాళ్ళను చూస్తే నాకు భయం; వాళ్ళ బాధ ఏమిటో అది ఎలా ఉంటుందో తెలియక పోవటంవల్ల-మనం ఆ సందర్భంలో ఏ విధంగా ప్రవర్తించాలో, ఎలా మాట్లాడాలో తెలియక బాధపడాలి! ఆ మాట్లాడటంలో మళ్ళీ హెచ్చుతగ్గు లుండ కూడదు; ఊహించటంవల్ల పొరపాటు పడేందుకు ఎక్కువ అవకాశం కూడా వుంటుంది. ఇదంతా నా కింకా అలవా టవలేదు.

ఆమె గమనించకముందే బైటికి పోదామని వెనక్కు తిరిగాను. ఆమె నన్ను చూసిపోతుందేమోననే భయంతో దృష్టి నంతటినీ ఆమె ముఖంమీదనే వుంచి రెండడుగులు వెనక్కు వేశాను. కాలు ఖాళీ డబ్బామీద పడటంవల్ల జారి పడ్డాను. ఆమె చప్పున కళ్ళు తెరచి చూసింది...నా దొంగ వేషం కనిపెట్టిందనే కొత్త భయానికి గురయ్యాను.

తనను నేను చూశాననే దిగులుతో కాబోలు చప్పున

ముఖం అవతలకి తిప్పేసి కళ్లు తుడుచుకుంది. ఇద్దరు దొంగలు-ఒకళ్ళకు తెలియకుండా ఒకళ్లు ఒకే యింట్లో ప్రవేశించి-ఒకే చోట తటస్థ పడ్డట్టయింది—మా స్థితి!

"ఇప్పుడే వొచ్చావా?" అంది. ఆ కంఠంలో దుఃఖం స్పష్టంగా తెలుస్తోంది. అది తనుకూడా కనిపెట్టి కాబోలు, స్వరాన్ని సరిచేసుకునే ప్రయత్నంలో వుంది.

"ఊఁ" అన్నాను మెల్లిగా లేస్తూ.

"వెళ్ళిపోతున్నట్టున్నావే?"అంది, నా జవాబు నమ్మనట్టు.

"ఊఁ"

"ఎందుకనీ?"

"నువ్వు ఏడుస్తున్నావని...కాదు...నువ్వు నిద్రపోతున్నావని-"

నేను మాట్లాడిన పొరపాటును సర్దుకునే సమయం దాటిపోయింది; అంతతో ఊరుకున్నా బాగుండేది...ఆ తప్పును దిద్దుకోబోయి ఇంకో పెద్ద తప్పు చెయ్యాల్సి వొచ్చింది. మనకు తెలియకుండానే నిజం దానంతట అదే బైట పడుతూంటుంది కాబోలు!

"ఏమిటీ? నేను ఏడుస్తున్నానని ఎవరు చెప్పారూ?"

"కాదు...నిద్రపోతున్నావ్ కదూ?"

"ఏడుస్తున్నానని ముందు అన్నావే...ముందు ఇట్లారా" అని దగ్గరకు లాక్కుంది. కొడుతుందేమోనని భయంవేసింది; కాని ఆ సూచనలేమీ కనిపించలేదు.

దబాయించి లాభం లేదని కాబోలు బుజ్జగించి అడిగింది: "అది కాదు-నేను ఏడుస్తున్నానని ఎవరు చెప్పారూ?"

అన్నీ ఎవరు దగ్గరుండి చెప్తున్నారు? చూసి తెలుసుకోవటంలా? ఆమెకు ఇంత స్వల్ప సందేహం ఎందుకు కలిగినట్టూ?

అన్నాను: "నేను చూశాను"

"ఏం చూశావు?" ప్లీడరు లాగు అడ్డ ప్రశ్నలు వేసి, ఆ

ప్రశ్ననే ఇంకో విధంగా విసిరీ, నాకు టోపీ వెయ్యాలని చూస్తున్నట్టుంది!

"నువ్వు ఏడవటం చూశాను."

"ఛా- నేను ఏడవటంలేదు" అంది.

ఇప్పటికి ముఖంలోకి సంతోషాన్ని తెగలిగింది; గొంతు కూడా మామూలు స్థాయికి వొచ్చింది. కాని కృత్రిమమైన నవ్వు తెచ్చుకుంటోందని మాత్రం నాకు అర్థ మౌతూనే వుంది; ఏమైనా దొంగ దొంగే కదా!

"అబద్ధం... నేను కళ్ళారా చూశాను...యీ తలగడ చూడు; తడిసి వుంది...నువ్వు ఏడవటం నేను విన్నాను... నన్ను చూసి కళ్లు తుడుచుకున్నావ్..." ఇంకా కారణాల్ని వెతుక్కుంటున్నాను.

ఇక లాభం లే దనుకున్నట్టుంది.

అంది: "పోనీలే...ఎవరితోనూ చెప్పవోక"

ఈ నాలుగుగోడల మధ్య జరిగేవాటన్నిటికీ ఒక్కటే మామూలు 'రూల్' ఉన్నట్టుంది. ఎవ్వరికీ చెప్పకూడదు. ఎందుకు చెప్పకూడదో, ఆ యీడులో నాకు అర్థం కాలేదు. అసలు యీ విషయాల్ని ఎవ్వరూ చూడకుండా ఉండేందుకే యీ గోడలూ, తెరలూ కట్టారేమో? పోనీ కారణాన్ని అడుగుదామంటే - జవాబు రాదు సరికదా, పైపెచ్చు యీ గదిలోకి ప్రవేశార్హత కూడా ఉండదు,

"చెప్పన్లే...నువ్వు ఎందుకు ఏడ్చావ్?"

"ఊరికనే—"

ఎంత చిన్న సమాధానం! నేనూ యీ సమాధానాన్నే చాలాసార్లు ఇచ్చి చూశాను కాని, దానికి విలువా, అర్థమూ ఉన్నట్లు తోచదు; దీన్ని నమ్మే వ్యక్తి నా కింతవరకూ దొరక లేదు. కనుకనే నేను కూడా దీన్ని నమ్మేందుకు వీల్లేదు...

అసలు సరైన జవాబు దొరకనప్పుడు ఇది ఊతపదం లాంటి దేమో?

"ఊరికనే ఏడుస్తారాయేం? ... కొగులే — ఎవరన్నా కొట్టారా? తిట్టారా?"

"నే నసలు ఏడ్వలేదు..." అని నా తలమీద గడ్డం ఆనించి రెండు కన్నీటిబొట్లు రాల్చింది.

"ఇప్పుడుకూడా ఏడుస్తున్నావ్!" అని నేను జ్ఞాపకంచేసే దాకా, తను చేస్తున్నపని కానీ, తను చెప్పిన సమాధానాన్ని ఇప్పటికిప్పుడే ఖండించుకుంటూన్నట్లు కానీ ఆమెకు తోచలేదు!

నిట్టూర్చి అంది: "ఔను...ఏడవక ఏంచెయ్యనూ?"

ఏడవటంతప్ప ఇక చేసేందుకే పనులు దొరకలేదా?

అన్నాను: "ఎందుకూ ఏడవటం? ఎవరన్నాకొట్టారా? చెప్పు"

కొట్టిన ఆ కాల్పనిక వ్యక్తిమీద నా కోపం పెరిగి పోతోంది; నా అసమర్థత ఇందుకేమీ అడ్డు రాలేదు. కొడితే, తిడితే తప్ప ఎవ్వరూ-పసిపిల్లలు తప్ప—ఇంకెందుకూ ఏడవ రని నా ఊహ.

"ఎవ్వరూ కొట్టలేదులే" అంది.

"మరి ఏడవటం దేనికి?"

"ఏం లేదు...మరి నువ్వు ఆలస్యంగా వొచ్చావెందుకనీ?"

నా ప్రశ్నను తప్పించుకుంటోందనే అభిప్రాయం నాకు కలగకపోలేదు.

"తర్వాత చెప్తాను...ముందు నేను అడిగినదానికి జవాబు చెప్పు."

"పోనిస్తూ ఆ గోల...నేను చెప్పినా నీకు అర్థం కాదు"

"అన్నయ్య కొట్టాడు-అవునా?" అన్నాను; ముసలమ్మ

ముసలమ్మే కనుక, అన్నయ్య మీదికే నా అనుమానం పోయింది.

"ఎవరన్నారు?"

"నేనే అంటున్నాను."

"లేదులే...ఊరుకుందూ"

"నాకు చెప్పవ్?...ఐతే నీతో మాట్లాడను."

"నీకు అర్థమవదనటంలా?" అంది; ఈసారి ఆమె కంఠ ధ్వనిలో 'విసుగు' కనిపించడం నన్ను నిరుత్సాహపరిచింది.

"అర్థమయ్యేట్టు చెప్పు" అన్నాను; ఇంతకన్న కష్టమైన భాషను టీకా తాత్పర్యసహితంగా చెప్పి మాస్టరు అర్థ మయ్యేట్టు చెయ్యటంలా?

ఆమె మాట్లాడకుండా, నా పట్టుదలకూ, అమాయకత్వా నికీ కాబోలు నా ముఖంలోకి చూసింది. నాకు చెప్పాల్సిన విధానాన్ని ఆలోచించుకొని అంది: "ఆయన ఎప్పుడూ ఇంట్లో ఉండరు-"

"పోనీ...ఉండకపోతే మరీ మంచిది...నీకేం భయమా? నేను ఉన్నానుగా!"

"నా మాటకు అడ్డురాకు...అందుకనే నీకు అర్థంకా దన్నాను. అలా ఇంటికి రాకుండా ఉండటం తప్పు... తెలిసిందా?"

'తెలియలేదు' అనేందుకు భయం కనుక, ఇకముందుకు పోయినా ఇంతకన్న అర్థమయ్యేది కూడా వున్నట్టు తోచలేదు కనుక, తల ఊపటమే శరణ్యమైంది.

"ఇక ఊరుకుంటావా?" అంది.

"ఊఁ" అనక తప్పిందికాదు.

బాధ్యత తీరినట్టుగా చూసి, వీపుమీద తట్టింది.

# 10

నాన్న పింఛను పుచ్చుకున్నాక—మేము ఆ ఊరు వొదిలి పెట్టాల్సి వొచ్చింది. ఆ విడిపొయ్యేనాడు - 'విరహం' అంటే ఏమిటో తెలియకుండానే నేను దుఃఖపడ్డాను. చాలా 'ఫీలింగ్స్' అవ్వి 'ఫీలింగ్స్' అని మనం కనిపెట్టకుండానే అనుభవంలోకి వొస్తుంటయ్ కాబోలు! తనకు మరి యీ ప్రపంచంలో స్నేహితులే కరువైనంతగా ఆమె బాధపడ్డట్టు తోచింది.

తన జ్ఞాపకార్థం ఆమె ఒక లాగూ, ఒక చొక్కా కుట్టించింది... నా జ్ఞాపకార్థం ఆమెకు నేను ఏం ఇవ్వాలో చాలా సేపు ఆలోచించాను. నా దృష్టిలో కనిపించిన వస్తువులు- ఆ అందాలరాణికి ఏ విధంగానూ తగినవిగా తోచలేదు. హీనంగా సత్కరించటంకన్న, అసలు సత్కరించకుండా ఉండటమే మంచి దనిపించింది... కాని ఆమె ఇచ్చిన బహుమానం చూసేప్పటికి, ప్రతిఫలం ఇవ్వకుండా ఉండలేని మనస్సు ఆందోళన చెయ్యసాగింది.

ఆమెనే అడిగాను: "నీ కేం కావాలి?"

నవ్వి అంది: "నాకు కావాల్సింది నువ్వేం ఇవ్వగలవ్?"

"ఎందుకు ఇవ్వలేనూ?" అన్నాను; నా అసమర్థతను గమనించకుండానే.

"చిన్నవాడివి...నీకేమీ తెలియదు...నువ్వు నా అంత అయ్యాక ఏమైనా ఇద్దువుగాని-"

"కాదు; అప్పటి సంగతి చూసుకోవొచ్చు, ఇప్పుడు ఏం కావాలో చెప్పు."

నా అమాయకత్వానికి కాబోలు నవ్వి, నన్ను ముద్దుపెట్టుకుంది. ఆమెకు కావాల్సింది ఇదేనా? ఇది కాదేమో? ఎందుకంటే, ఇది రోజూ ఇచ్చి పుచ్చుకునేదే కనుక, దీనికి 'బహు

మాసం' అనే మాటను అంటగట్టటం చాలా అన్యాయ మని పించింది.

“చెప్పవూ?” అన్నాను, బతిమాలుతూన్నట్టు.

“నా కేమీ అక్కర్లేదు” అంది.

ఇక ఆమెను అడిగి లాభం లే దనిపించింది. రోజూ రోజూ కూడబెట్టిన కష్టార్జితం రెండు రూపాయిలూ జేబులో వేసు కొని బజారున పడ్డాను. నాకు బాగా నచ్చినవీ, సుందరికి తగినవని అభిప్రాయపడ్డవీ, నాకు మించిన వెలలలో ఉన్నయ్ ...చివరకు చక్కటి ఫ్రేంలో బిగించబడిన అందమైన అద్దం కనిపించింది. అదెంత ఖరీ దవుతుందోనని భయపడుతూనే అడిగాను. షాపువాడు 'నువ్వేం కొంటావోయ్?' అన్నట్టు చూస్తూనే తమాషాకు చెప్పినట్టు “రెండు రూపాయిలు!” అన్నాడు, నా జేబులో ఉన్న డబ్బును సరిగ్గా అంచనా వేయగలిగిన విధంగా!

నా సంతోషానికి మితి లేదు. బేరంకూడా చెయ్యబుద్ధి పుట్టలేదు. ఆలస్యంచేస్తే ఖరీదు పెరుగుతుందేమోనని భయ పడి, చప్పున రెండు రూపాయిలూ వాడి మొహాన పారేసి, అద్దం తీసుకొని చకచకా నడుచుకుంటూ సరాసరి సుందరి దగ్గరకు వొచ్చాను.

“ఏమిటది?” అంది నా ఆత్రుత చూసి.

“నీకోసం” అని కాగితం విప్పి చూపాను.

“అద్దమా?...బాగుంది...ఓల్లే...ఇక నా మొహం చూసే వా ళ్ళెవరుంటారూ? నాకు నేనే చూసుకోవాల్సి వుంటుంది కనుక, బాగా ఆలోచించి భలే వస్తువు తెచ్చావు... ఎంత?”

నాకు కనిపించదు కాని...ఆమెను చూసే వాళ్ళే కరు వయ్యారా?

“రెండు రూపాయిలు”

"అంత ఖరీదు పెట్టి తేవటం దేనికి...డబ్బు ఎక్కడిది?" అంది అనుమానంతో చూస్తూ.

"సంపాయించుకున్నాను......రోజూ కూడబెట్టాను—నిజం!" అన్నాను. అదేమీ దొంగ సొత్తు కాదనీ, నా సర్వ దాస్తీ అదేననీ, నేను ఇవ్వగలిగిన యీ చిన్న బహుమానాన్ని స్వీకరించమనీ అర్థాలు స్ఫురించేట్టు.

"ఉహుఁ...రెండు రూపాయిలు...సరేలే!" అంది.

ఇదేనా అని సిగ్గుతో సగం ఛస్తూన్న నాకు అదే గోరం తలు కొండంతలుగా కనిపించింది.

"నన్ను మరిచిపోతావా?" అంది తలవొంచి దీనంగా.

అంత పెద్ద మాట వినేసరికి నా బుల్లి గుండె చెరువంత యింది. ఏడుద్దా మనిపించింది; కాని ఏడుపు వొచ్చేందుకు దగ్గర్లో ఉన్నాను.

"ఉహుఁ, ఎందుకు మరిచిపోతానూ? అక్కడ ఇంకో వొదిన లేదు" ఇంకో వొదిన ఉందని ఆమెకు దిగులని నా అభిప్రాయం!

"ఇక్కడా ఇంకో వాను లేదు—"

మరీ మంచి దనుకున్నాను. నేను వెళ్ళాక ఏర్పడే ఖాళీలో ఇంకోడు ఎవడైనా ఇరుకు తాడేమోననే ఊహాకూ, ఆ ఊహ ఇచ్చే బాధకూ ఇక తావు లేదు.

విడిపోయ్యాక—ఆమె సంగతేమీ నాకు తెలియలేదు. కాని నేనుమాత్రం ఆమెను మరిచిపోలేకపోయ్యాను. స్నేహానికి యీడూ, అభిరుచులూ, విజ్ఞానమూ—ఇవ్వేవీ అడ్డు రావని స్పష్టమైంది; అవ్వే అడ్డంపడేట్టయితే, అసలు యీ లోకంలో ఎవ్వరికీ స్నేహితులుండే వాళ్ళే కాదు!

నేను ఒక్క దొంగపని మాత్రం చేశాను. ఆమె గదిలో వుండే ఫొటోను మెల్లిగా జేబులో వేసుకొచ్చేశాను. అది ఆమెను అడగాలంటే 'నువ్వే నాకు కావాలి కనుక నాతోనే

వుండిపో!' అని అడిగేటంత కష్ట మనిపించింది...కాని ఆ ఫొటోను నేను ఎక్కడా వేళ్ళాడగట్టలేదు. పువ్వులతో పూజించి, మంగళహారతులు కూడా ఇవ్వలేదు. ఉద్యానంలో పూరిపాక వేసి, రోజూ అదంతా జాగ్రత్తగా ఊడుస్తూ, నీళ్ళు చల్లి శుభ్రంగా వుంచుతూ, దానిముందు నిలబడి ఏడుస్తూ గీతాలేమీ పాడలేదు. ఒకవేళ ఆమె చచ్చినా, ఆమె జ్ఞాపకార్థం ముందు చెప్పిన పనుల్లో ఒక్కటన్నా చేసి-వైజాగ్ వెళ్ళి తీరాల్సిన వ్యక్తిగా, మారలేనని గారంటీగా చెప్పగలను!

ఆ ఫొటోను బట్టలపెట్టెలో - మెత్తటి బట్టల మధ్యగా దాచాను. అప్పుడప్పుడు ఎవ్వరూ చూడకుండా-చూస్తే, నా ఆనందంలో భాగాన్ని పంచుకుంటారేమోనన్నట్టు - ఏకాంతంగా చూసి-ఒకప్పుడు నాకు ఇంత అందమైన స్నేహితురాలు వుండేది కదానని గర్వపడేవాణ్ణి.

వియోగంలోని బాధ మధురంగానే తోచింది. ఎందుకంటే-మనిషి నిజంగా ఎదురుగుండా వుంటే, ఆమె ఎలా వుందో, ఏది చేస్తోందో అదే తెలుస్తుంది. కాని ఇక్కడ ఆసలు ఊహకే చాలా దూరంలో వుంది. అదీకాక ఆ స్నేహం రోజురోజుకూ పెరిగేందుకు ఎంత అవకాశం వుందో, క్షీణించేందుకూ కూడా అంత అవకాశమూ వుంది. రోజూ చూసే మనిషిమీద దినదినాభివృద్ధయే 'చనువు' ఆ వ్యక్తిపట్ల విలువనుకూడా తగ్గించేందుకు చాలా అవకాశం వుంది...కాని వియోగంలో ఇది జరుగదు. కవిత్వంలోలాగు యీ భూమిమీది అవకాశాలతోనూ, సౌభాగ్యాలతోనూ తృప్తిపడాలనే నియమ మేమీ లేదు. హాయిగా ఆకాశంలోనూ, స్వర్గంలోనూ—ఇంకా మన పూర్వులు గ్రంథాలు రాసేప్పటికి తోచని సుఖమయ ప్రదేశాల్లోనూ స్వేచ్ఛగా విహరించేందుకు ఎంతైనా అవకాశం వుంటుంది. అంతా ఊహే కనుక, అది

అసంభవమైనదైనా, అందులో ఆనందం వుంది. కలలోవొచ్చే అసంభవాలతో మనం తన్మయం అవటంలా? మన భావాల్ని పట్టీ, ఊహాల్నిపట్టీ అవతలి వ్యక్తిమీద గౌరవమూ, విలువా కూడా అధికమౌతూంటై...ఇంతకూ 'విరహం' అనే బాధ లోనే అనుభవించలేనంత ఆనందంకూడా వుంది-సముద్రంలోని దావానలం లాగు...శాశ్వత వియోగం విషయంలో యిది అబద్ధం కావొచ్చేమో?

రోజూ అందమైన స్త్రీలను చూస్తూనే వున్నాను. కాని వారి అందానికి కొలతబద్ద 'సుందరి' కావటంవల్ల, వా శ్చెవ్వరూ నన్ను ఆకర్షించలేరు.

ఆమె కుట్టించిన లాగూ చొక్కాల్ని పండుగ రోజుల్లో మాత్రమే ధరిస్తూండేవాణ్ణి. అవి నాకు బొత్తిగా చాలక, అంత విహీనంగావుండే స్థితికి వొచ్చేవరకూ వాటిని వొదలలేక పొయ్యాను. అవి నాకు నిరుపయోగమైన స్థితికి వొచ్చినా, నా దృష్టిలో గొప్ప విలువగల హస్తాలమీంచి వొచ్చిన 'బహుమతి' కావటంవల్ల, వాటిని పెట్టెఅడుగున భద్రపరిచాను.

రోజులు, వారాలు, నెలలు సంవత్సరాలు గడిచిపోయినై. ఇంతకాలం ఎలా సాగిపోయిందో ఆశ్చర్యంగానే వుంది; కాని అది సాగకపోతే ఇంకెంత బాధో!

నాకు ఇప్పుడిప్పుడు సుందరి తత్వం వేరొక రూపంలో అర్థమవసాగింది. విజ్ఞానంతోపాటు దృక్కోణమూ—దాంతో పాటు విమర్శనా జ్ఞానమూ మారి వస్తువు అసలు రంగూ, రూపమూ మొదలైనవి మారుతూంటై కాబోలు...ఇంకొంత కాలం సాగుతే యీ రూపమూ, రంగూ మళ్ళీ మారవొచ్చు. ఈ విధంగా అసలు రూపం అనేది జీవితమంతా ఆలోచించినా తేలని గడ్డు సమస్య! కాని ఎప్పటికప్పుడు మనం ఆలోచించేది 'రైట్' అనుకోకపోతే ముందుకు సాగటం అసంభవం.

సుందరి అసలు నన్నెందుకు అంత 'ప్రేమ'గా చూసేది?

'ప్రేమ' అన్నది అప్పుడు వున్నదే కాని, దాన్ని 'ప్రేమ' అంటారని యిప్పుడే తెలుస్తోంది...ఆమెకు పురుషుడు కావాలి కనుకనా?...ఊహుఁ ఇది నిజమైతే దాసుగాడి బృందానికి వీపు లెందుకు చెడతయ్?...ఆమెకు పురుషుడు అంటే యేదో భయంలాగుంది; లేక ఇష్టం లేకనా? నేను అప్పటికి అసలు పురుషుల్లో లెక్కే కాదు...కాని ఆమె నన్ను పురుషుడిలాగే వుపయోగించుకునేందుకు చేసిన ప్రయత్నాలు యిప్పుడు అర్థమాతున్నయ్. పండబారొయ్యే కాయ మీది ఆశ చేత రోజుకు వదారుసార్లు దానిదర్శనం చేసినట్టు, దాన్ని తాకి ఆనందించినట్టు ఆమె నా విషయంలో ప్రవర్తించేది. ఏమైనా మగజాతి మగజాతే కనుక, ఆమె నన్ను ఎందుకు ఏవగించుకునేది కాదు? ఈ జాతి కంతకూ నే నొక్కణ్ణే మంచివాణ్ణా! కాదు...ఆమె రహస్యాలు బైటికి పోకూడదు. ఆ సంగతి ఆమె నాకు అనేక సార్లు నూరిపోసేది. అసలు విషయమే నాకు అర్థమయ్యేది కాదు కనుక, నే నసలు బైటపెట్టేందుకే ప్రయత్నించననీ, అదేదో అతి సామాన్య విషయంకింద పరిగణిస్తాననీ ఆమె ధీమా!

కాని ఇతర్లు—తనకు ఇష్టమై, తనను నాకన్నా బాగా ప్రేమించగలవాళ్ళు మాత్రం రహస్యాల్ని ఎందుకు బైటపెడతారు? వాళ్ళకోసం ఆమె ఎందుకు ప్రయత్నించ లేదు? ప్రయత్నం చేసిన వాళ్ళకు దేహశుద్ధి చేయించి, వాళ్ళనూ, వాళ్ళ తరువాత వాళ్ళనూ కూడా ఎందుకు నిరుత్సాహపరిచింది? వీళ్ళెవరూ బైటపెట్టకపోయినా, బైటపడుతుందేమోనని భయమేమో? అదీకాక ఇంకా ఎన్ని అవస్థలులేవు? ఇదైతే ఇంట్లో వ్యవహారం, ఇతరులు అనుమానించకుండా గుట్టుచప్పుడుగా సాగిపోతుందని ఆలోచించి వుంటుంది...అసలు సౌఖ్యం కోసం ప్రయత్నించి అవస్థపడటంకన్న, దాని ఛాయతోనే కొంత తృప్తిని కల్పించుకునేందుకే ప్రయత్నించి వుంటుంది.

—కాని, నేనుకూడా యిప్పుడు ఆమెకు కరువయ్యాను కదా! యిప్పుడు ఆమె ఎలా మారి వుంటుంది?...దీని జవాబు తలుచుకునేప్పటికి నాకు కంపరం ఎత్తింది. నిజంగా ఆమె ఇంకోణ్ణి ఆశ్రయించి వుంటుందా? ఆమె అత్తా, భర్తా దుర్మార్గులనీ, ఇలాటివేమీ సాగే అవకాశాలు ఇవ్వరనీ గుర్తొచ్చి మనస్సు కాస్త కుదుటపడ్డది. దుర్మార్గులవల్ల లోకానికి ఎంత మేలో కూడా అర్థమైంది...కాని వాళ్ళ దుర్మార్గమే నాకూడా ఏకు మేకైతే, దాన్ని ఏమనాలో ఆలోచించలేదు.

నాకు ఇంకో పెద్ద అనుమానంకూడా కలిగింది; ఒకవేళ మేము ఆ వూరు వొదిలిరాకుండా వున్నట్టయితే, రోజూ ఆమెతో గడుపుతూనే యీ ఎనిమిదేళ్ళూ సాగినట్టయితే, ఆమె మామూలుగానే వుండేదా? లేక ఆమె గమనించకుండానే రోజులు కొంతవరకూ సాగాక, ఏదో వొక రోజున హఠాత్తుగా నా యీడు పెరిగిందనీ, నేనూ దాసుగాడి సైజుకు వొచ్చాననీ గ్రహించి, నన్ను కూడా పురుషుల్లోకి లాగి ఆ గదిని జనానాగా మార్పించేదా? 'చిన్నవెధవ' కింద నన్ను లెక్కచెయ్యని అత్తగారుకూడా యీ పెద్దవాణ్నవటం చూసి 'పెద్దవెధవ' గా నన్ను జమకట్టి, ఇంట్లోంచి తరిమేదా?...దీనికి జవాబు దొరకలేదు.

ఇప్పుడు ఆమె చేష్టలు తలుచుకుంటే, అప్పుడు ఎంత ఆనందాన్ని వృథా చేశానో గ్రహించి నన్ను నేను తిట్టుకునేవాణ్ణి. ఎన్ని అవకాశాల్ని జారవిడిచాను! 'అవకాశాలు' ఏర్పడ్డప్పుడు, అవి అవకాశాలని తెలుసుకుంటూ వాటిని ఎవడు జారవిడుచుకొని, ఆ తరువాత వెనక్కి తిరిగి చూసుకొని, వాటినిగూర్చి బాధపడి ఏడుస్తాడు? ఇప్పుడైతేనా అనిపించేది...కాని అప్పుడే యింత వయస్సయితే, దాసుగాడికి జరిగిన సన్మానం లాటిదే నాకూ శరమయ్యేదేమో?

రేపే ఆ వూరు వెళ్తాననే మాట జ్ఞాపకం చేసుకుంటూ ఆ రాత్రల్లా నిద్రలేకుండానే గడిపాను. నిద్రపోతే, ఇవన్నీ జ్ఞాపకం చేసుకుంటూ పొందే ఆనందం పోతుందేమోననీ, లేక తెల్లవారుజాము బండీ మనను కానీ, మన ఆనందాన్ని కానీ లెక్కచెయ్యకుండా గడియారాన్ని మాత్రమే గురిగా పెట్టుకొని పారిపోతుందేమోననీ, భయం వేసింది.

ఇన్నాళ్ళూ జరిగిన దాన్నిగూర్చి ఆనందించాను; అదంతా పాతదైపోయింది...ఇప్పుడు జరగబొయ్యేదాన్ని గూర్చి ఆలోచించసాగాను. సరిగ్గా ఇలా జరుగుతుందని కాదు; జరక్కపోయినా ఇబ్బందిలేదు కాని-ఊహాతో శ్రమ లేకుండా పొందే ఆనందాన్ని ఎందుకు పాడుచేసుకోవాలని.

...వెళ్తే అసలు గుర్తుపడుతుందా? లేక ఆ పాతపురాణమంతా తిరగెయ్యాలా? ముందు కొత్త గుర్తుపట్టి ఆహ్వానిస్తే, తరువాత తీరిగ్గా కూర్చొని చిన్ననాటి పెద్దపనుల్ని జ్ఞాపకం చేస్తూ, వాటి ప్రతిబింబాల్ని ఆమె ముఖంలో చూడొచ్చు! నేను ఇప్పుడే యీ భూలోకంలోకి దిగా నన్నట్టు నన్ను సరికొత్తవాణ్ణిగా చూసీ చూడనట్టుగా ప్రవర్తించదు కద? లేక ఆ పాత స్నేహితమంతా, బాంకు ఎకౌంటులాగో, మార్వాడీ దగ్గరి 'చక్ర' వడ్డీలాగో పెరిగి కూర్చొని, మరింత చనువును సూచిస్తుందా? ఎలావుంటే బాగుంటుందో తనకు తెలిసి, అలాగే వుంటుందా?

ఎలాగైనా ఆ బాదరాయణ సంబంధాన్ని తిరగేసి—ముసలమ్మకు వినయ విధేయతల్ని చూపి (ఆమెదగ్గర వినయంగా పోజు వేసిన వాళ్ళు—ఆమె దృష్టిలో మంచివాళ్ళు; వీరైతే సాష్టాంగా దండప్రణామం చేసినా పొయ్యేదేమీలేదు; మరింత గౌరవమైన స్థానాన్ని తేలిగ్గా సంపాయించొచ్చు) టోపీ. వెయ్యాలి. ఇంతా ఏడుస్తే సుందరి పుట్టింటిదగ్గర వుంటే? లేక చనిపోయివుంటే?...నాగుండె ఆగినట్టయింది...వెధవ

ఊహాలకు ఒక దారీ తెన్నూ వుండదు. అవి అన్ని వైపులకూ మన అనుమతి లేకుండానే సాగటంవల్ల, వాటి బాధకూడా ఒకొకప్పుడు భరించరానిదే నేమో? ఏమైనా ఆరు గంటలు ప్రయాణంతో ఆమె యిల్లు చేరుతాను...మిగతావి అప్పుడే ఆలోచించ వొచ్చునిపించింది.

# 11

సుందరి యిల్లు సమీపిస్తూండగా నాలోని ఉత్సాహమంతా పోయి ఒకవిధమైన 'నరాల బలహీనత' ప్రవేశించింది. ఏ కాస్త ఆపదైనా సంభవించగల అవకాశం ఎంతో దగ్గర్లో వుందనీ, ఇక జరగ బొయ్యేదానికీ నా ఊహాలకూ-ఊహించ లేనంత వ్యత్యాసం వుంటుందనీ నాలో ఆందోళన బయలు దేరింది. ఆ వీధిన ఏ ఒకటో రెండో తప్ప మరి ఎరిగిన మొహాలే లేవు. వాళ్ళుకూడా నన్ను 'అపరిచితుణ్ణి' చూసినట్టుగా చూశారు. ఎంత మారిపోయానో అనిపించింది. ఇలాగే సుందరి కూడా నన్ను గుర్తు పట్టలేకపోతే? ఆ విషయం తలుచుకు నేందుకే అతిభయంకర మైందిగా తోచింది.

గుర్రబ్బండీ చప్పుడు తన యింటిముందు ఆగిందని కాబోలు —ఆమె బైటికివొచ్చి నిలబడ్డది. నేను ఒణికే శరీరాన్ని మెల్లిగా బండిలోంచి దింపి ఆమెను చూశాను. ఎంత మారి పోయింది! ఆ శరీరాకృతిలోనే ఎంతో వ్యత్యాసం వుంది. ఏవో బాధలతో ఆమె రోజు రోజూ నలిగిపోయి వుంటుందని ఆ ముఖమే చెప్తోంది: ఆరోగ్యం సరిగ్గా లేక, చిక్కిపోయింది కాబోలు! కళ్ళల్లో పూర్వపు చిలిపితనం కనిపించటం లేదు. దానికి మారుగా జీవితాన్ని తనివితీరా అనుభవించో, లేక జీవితంలోని సౌఖ్యంమీద పూర్తి నిరాశకలిగో 'యిక యీ జీవితం ఏమంత జీవించ దగ్గది?' అని హేళనచేసే గొప్ప వేదాంతి కళ్ళల్లోకి మల్లే—ఆమె కళ్ళల్లో అగాధాలు కనిపి

స్తున్నయ్. వాటి మెరుపుతో ఎదటివారి గుండెల్లో బండలు దొర్లినట్లవుతుంది!...కాని ఆమె గులాబీ పెదవుల్లోని కోమలత్వం కానీ, ఆమె చిరునవ్వులోని వెన్నెల కానీ మారలేదు.

ఒక నిమిషంసేపు అలాగే ఒకర్నొకరు చూసుకుంటూ శిలాప్రతిమలలాగు నిలబడిపోయ్యాం. ఆ నిమిషంలోనే ఏళ్ళ తరబడి జరిగిపోయిన గాథ తిరిగి పోయిం దనుకుంటాను... నాలోని మార్పుల్ని యిప్పుడే అర్థం చేసుకున్నట్టుంది.

చిరునవ్వుతో ఆహ్వానించింది: ''నువ్వా-రా-వాసూ!''

నా చిన్నతనంలో 'ఏరా' అని పిలిచేది. ఇప్పుడు 'నువ్వ' అంది. ఆమె దృష్టిలో నామీది గౌరవం పెరిగింది. నాకన్న యీడులో పెద్దది; అసలు 'నువ్వ' అన్నందుకు నాకు కష్ట మనిపించలేదు. ఎందుకంటే—పూర్వ పరిచయాన్ని మరిచి పోకుండా, ఆ చనువును ముందుగా ఆమే బైటపెట్టటం నన్ను చాలా శ్రమనుంచి తప్పించింది.

సామాను లోపల పెట్టించాను. ఆమెతో మాట్లాడ దలచిన అనేక విషయాల్లో ఏ ఒక్కటీ జ్ఞాపకం రావటంలేదు. ఈ భాష కొత్తగా నేర్చుకొని, భాష బాగా తెలిసిన వాడితో మాట్లాడేందుకు భయపడుతూన్నట్టుగా తోచింది.

ఆమె చూపిన కుర్చీలో కూర్చున్నాక—

''మంచినీళ్ళు కావాలా?'' అంది.

ఎంత దయగా అడిగింది! ఈ బాంధవ్యాలనేవి అసలు మొదట ఏమీ లేనివే! కొత్త వ్యక్తుల మధ్య ప్రారంభమైన పరిచయం స్నేహంగా మారి క్రమేపీ పెరిగేవే! కాని వీటిల్లో చాలాభాగం సంఘం ఒత్తిడి కారణంగా జరిగేవి. కాని మా ఇద్దరి మధ్యా ఏర్పడ్డ 'బాంధవ్యం' దిక్కులేని రెండు హృదయాల ఒత్తిడివల్ల ఏర్పడ్డదని నాకు గట్టి నమ్మకం. ఇందులో ఎంత మాధుర్యం వుంది!

తలూపాను...ఆమె చేతిమీదుగా యిచ్చిన మంచినీళ్ళతో కాని మళ్ళీ నాలో పూర్వపు ఉత్సాహం ప్రవేశించలేదు.

ఆమె కింద చాపమీద కూర్చుంది. అతిథిని సత్కరించాల్సిన విధానం కాబోలు! లేక తనను తానే హీన పరుచుకుంటోందా?

"చాలా మారిపొయ్యావే...బాగా ఎదిగావు! మొదట ఎవరో-ఏ ఆఫీసరో అనుకున్నాను...కళ్ళజోడు పెట్టుకుంటే అసలే గుర్తుపట్టలేకపొయ్యాను. చత్వారం వొచ్చిందాయేం?"

ఇంత పరిచయ కంఠంతో మాట్లాడుతుం దనుకోలేదు. ఆమెకు యీమాత్రం జ్ఞాపకముంటే అదే పదివేలు. ఈ సహజమైన హాస్యంతో నాకు మైమరపైంది. తనింత చనువుగా మాట్లాడుతూంటే—నే నసలు సందివ్వటలేదని అనుకుంటోందేమో? యింత ఆనందం నన్ను మూగవాణ్ణిగా చేసిందని చెప్పేదా?

"...లేదు. ఇది చలవజోడు" అన్నాను.

"అంత వేడి చేసిందా?"

"ఇంట్లో కూర్చుంటే ఎలా తెలుస్తుంది?"

నవ్వి ఊరుకుంది. ఆమెలోని మార్పుల్ని పరీక్షగా గమనిస్తున్నాను. జీవితంలో ఎనిమిదేళ్ళు గడిచినా, ఆమెలో ఆ కాలపరిమితి సరైన కొలతను చూపటంలేదు. కొందరు యీడు వస్తూంటే ముసలివాళ్ళవుతారు. కొందరు యీడు వస్తూన్న కొద్దీ—కొన్నాళ్ళవరకూ పడుచుతనాన్ని యింకా కూడబెడతారు. సుందరిలో యీ రెండో రకం మార్పు స్పష్టంగా కనిపించింది.

ఆమెను ఎలా సంబోధించాలో మొదట అర్థమవలేదు. కాని ఆమె తీసిన దారినిబట్టి మామూలుగానే మాట్లాడదామనిపించింది.

"నువ్వూ మారిపొయ్యావ్-" అన్నాను.

"అట్లాగా?" అంది ముఖంలోకి దీనంగా చూస్తూ.

"శరీరం సలిగినట్టుగా కనిపిస్తోంది కాని...అసలు యీడే వొచ్చినట్టు కనపట్టంలేదు."

"ఇంకా ముసలిదాన్నవటం లేదంటావా?"

"అప్పుడే ముసలితనం వొస్తుందనే భయమా?"

"ఎందుకురాదూ? ఈడొస్తేనే ముసలితనం వొస్తుందనుకుంటున్నావా? కొంతమంది మానసికంగా ముసలి వాళ్ళవుతారు!"

నే నిప్పుడు సుందరి జీవితాన్ని బాగా అర్థం చేసుకోగలుగుతున్నాను. ఆమె మాట్లాడిన మాటల్లోని అఘాతాల లోతులు తెలుస్తున్నయ్. 'నేను జీవచ్ఛవాన్ని!' అని ఘాటైన మాటల్లో చెప్పటాన్ని ఎంతో సున్నితంగా తన సహజ సౌమ్యతను కాపాడుకుంటూ చెప్పింది. పరిస్థితులే అనుకూలించినట్టయితే ఆమె 'కవయిత్రి' ఐవుండేదని నాకు గట్టి నమ్మకం వుంది...ఆమె చెప్పినదాన్ని యింకా విశదంగా చెప్పమని అడిగేందుకు నాకు భయంవేసింది. ఎందుకంటే— 'విషాదగాధ'ను చెప్పే మనిషి బాధను నేను తేలిగ్గా ఊహించగలను; ఆ క్షోభను ఇప్పుడు సుందరిలో నాకు నేనై ఎందుకు తెచ్చిపెట్టాలి? అందుకని సంభాషణను మార్చాను.

"మీ అత్తగారు యింట్లో లేదా?"

"రోజురోజుకూ పురాణాలమీది భక్తి పెరుగుతోంది—"

"వీధిలో ఎరిగినవాళ్ళే లేరు...దానూ బృందం—"

"ఇంకా ఆ వెధవల మా టెందుకులే, నీ కింకా ఎంత జ్ఞాపకం వుంది!"

"నిన్ననో మొన్ననో జరిగినట్టుగా వుంది. ప్రతి చిన్న విషయమూ నాకు బాగా జ్ఞాపకం వుంది—" ఈ జ్ఞాపకం అనేది యీ వొక్క సందర్భంలోనే; ఇదే చదువులో ఐతేనా!

ఆమె ముఖం వెలవెలబోవటం స్పష్టంగా కనిపిస్తూనే

వుంది. నాకు జ్ఞాపకం లే దనుకుంది కాబోలు! ఆమె మాత్రం
మరిచిపోగలిగిందా? లేక మరిచిపోయినట్టు నటించాలని
చూస్తోందా? నేనుకూడా కనీసం మరిచిపోయినట్టు ఎందుకు
నటించలేదని బాధపడుతోందా? నాకు సరైన కారణం
తెలియలేదు.

రెండుమూడు నిమిషాలకు కాని ఆమెలో మార్పు రాలేదు.
మాటల ధోరణి మార్చటానికి ప్రయత్నిస్తూ అంది: "ఉద్యో
గస్తుడి వయ్యావల్లే వుంది...జీతం ఎంత?"

నా సూటు చూసి నే నేదో కలెక్టరు హోదా ఉద్యోగం
చేస్తున్నానని భ్రమపడుతోంది కాబోలు! అంత గొప్పగా
నన్ను చూసినా, నా ఉద్యోగపు విలువ నా దృష్టిలో పెరగ
లేదు కాని, ఆమె ఊహించే ఆ గొప్పతనానికి భంగం వాటిల్ల
కుండా జవాబు చెప్పాను: "—ఏదోలే—గవర్నమెంటు
ఉద్యోగం కాకపోయినా...నెలకో వంద!"

"మంచి జీతమే!" అంది. జీతాన్ని రెండింతలు చేశానని
పాపం ఆమె ఊహించనైనా లేదు!

ఇంతలో నే ముసలిది వొచ్చింది. నన్ను చూసేప్పటికి—
ఆమెకు బహుశా తన గురువును...మా ముసలిదాన్నే చూసిన
ట్టనిపించిం దనుకుంటాను.

"ఏరోయ్! ఎప్పుడూ రావటం? అందరూ కులాసా? ముస
లమ్మ సరిగ్గా తిరుగుతోందా?"

"మిమ్మల్ని అడిగానని చెప్పమంది."

సంతోషంతో నవ్వింది. ఆమె వేసే వివిధ వెధవ ప్రశ్న
లకు ఎంతో అణకువతో జవాబులు చెప్పాను. అవన్నీ నాకు
అసహ్యమైన ప్రశ్నలుగా కనిపించినా-ముసలిదానికి మస్కా
కొట్టే ప్రయత్నంలో వున్నాను!

పరిస్థితులు యింతబాగా అనుకూలించటంవల్ల యికముందు
యెలా ప్రవర్తించాలో అర్థంకాలేదు. ముందు ఎక్కడనన్నా

ఏకాంతంగా కూర్చుంటేనే కాని తోచేట్టులేదు. 'బజారులో పని వుంది-' అని మెల్లిగా బైటపడ్డాను.

నిజంగా వున్న బజారు పనికి స్వస్తి చెప్పాను. పార్క్‌లో మనుషులు లేనిచోట చేరి యీ సమస్యనుగూర్చి తీవ్రంగా ఆలోచించసాగాను.

'సుందరిని పొందటం ఎలా?' అన్న సమస్యమీద నాకు కలిగిన ఊహాల్తో ఒక భారతం రాయొచ్చు. నాకు అయాచితంగా చిన్నప్పుడు లభించిన అనేక అవకాశాల్ని అసమర్థతవల్లా, అజ్ఞానంవల్లా ఉపయోగించుకో లేకపొయ్యాను. ఇప్పుడు యిన్నాళ్లూ సంపాయించిన జ్ఞానమూ, కాలం గడిచినకొద్దీ నాలో వృద్ధిపొందిన ఉద్రేకమూ, దాంతోపాటు ఏర్పడే తొందరా వీటితో సమర్థతను సంపాయించాను. కాని—యిప్పుడు అవకాశం దొరకటంలేదు. అవకాశాలు వాటంతట అవే రావాలి కాని మన ప్రయోజకత్వంతో సంపాయించేవి కావేమో ననిపించింది. అసలు అప్పుడు నేను ఏ పానినీ చెయ్యలేని అసమర్థుణ్ణి కనుకనే నాకు ఆమె ఆ అవకాశాల్ని యిచ్చిందేమో? ఐనా మన ఆలోచనలకు దారి లేనన్నా వుండదు; అవ్వి సకారణంగాకూడా వుండవేమో? ఒకవేళ వున్నా అలా జరిగి తీరుతుందనే గారంటీ యెక్కడ? ...చాలా సేపు బుర్రచెడగొట్టుకున్నాక-అప్పటి పరిస్థితుల్ని బట్టి ప్రవర్తించటమే చాలా ఉచితంగా తోచింది.

ఆ రాత్రి భోజనాలయ్యాక మాట్లాడుకో సాగాం. మామూలుగానే సుందరి భర్త ఆ నాడూ 'నాగా' పెట్టాడు. పరిస్థితి యింత బాగా అనుకూలిస్తూంటే నాకు చాలా ఉత్సాహంగా వుంది. మా మాటల్లో వైరాగ్యమూ, దైవభక్తీ, వేదాంతమూ తగిన డోసుల్లో లేకపోవటంవల్ల ముసలి దానికి రుచించటం లేదనుకుంటాను.

"హరికథకు పోదాం వొస్తావటే?" అని అడిగింది కోడల్ని.

'వొస్తాను' అంటుందేమోనని నా గుండెల్లో రాయి పడ్డది.

"ఊహు, నాకు తలనొప్పిగా వుంది, రాను—" అంది సుందరి.

ఇది నిజమైనా, అబద్ధమైనా పరీక్షించే శక్తి ఎవరికీ-చివరికి డాక్టర్లకూ-డా లేదు. ఒకరి బాధా, ఆనందమూ యింకోరికి సరిగ్గా తెలియకపోవటంవల్లనే-వాటిని అనుభవించే వ్యక్తులు పూర్తిగా, తృప్తిగా వాటిని అనుభవించ గలుగుతున్నారేమో?

"ఇప్పుడే వొచ్చేద్దాం" అంది ముసలిది.

నా సంగతి ముసలిదానికి పట్టలేదు. ఎందుకంటే ఆమె సంపాయించబోయ్యే ముక్తిమీద నేను గురిచూపటంలేదు; నా యీడులో ఎవ్వరూ చూపలేరేమో? అదీకాక నేను ఏమైపోయినా—పాప కూపాన పడ్డా, ఆమెకు అనవసరం. నామీద అధికారం ఆమె కేమీలేదు కూడాను. పోతే సుందరి-సాక్షాత్తూ తన కోడలవటంవల్ల ఆమెకూ-డా ఆ ముక్తిని యిప్పించి—యింత మంచి కోడలి స్నేహాన్ని ఆ స్వర్గంలో కూడా వొదల కూడదని ఆమె పట్టుదల. సుందరి యీడులో తను ఏం చేసేదో, తన ఊహాలు యెలా వుండేవో, తన అభిరుచులు ఏ మార్గాన నడిచేవో యిప్పుడు ఆమె ఆలోచించదు. బహుశా యిన్నాళ్ళదాకా యింకా జ్ఞాపకముండి వుండదు. ఒకవేళ వున్నా, తన కోడలు మాత్రం అలా వుండేందుకు వీల్లేదని ఆమె వాదమై వుంటుంది. ఎందుకంటే తను అనుభవించిన సౌఖ్యాలూ, అనుభవాలూ, మనుషుల్ని పాడుచేస్తయ్యని ఆమె భయం...తను పాడై యీ ముక్తి మార్గాన్ని అన్వేషిస్తోందేమోనని నా అనుమానం. ఒకసారి దిగందే లోతు తెలియటం చాలా కష్టం—అసంభవం కూడా నేమో?

"ఇప్పుడే వొచ్చేదానికి అసలు వెళ్ళటం దేనికి?" అంది సుందరి నవ్వుతూ. ఆమె తెలివి తేటలను మెచ్చుకున్నాను; కాని ముసలిది చూసిపోతుందనే భయంతో పైకేమీ తెలియ

కుండా తొక్కిపట్టాను. ఇంత తెలివైనదాంతో నేనేం నెగ్గ గలననే భయంకూడా వేసింది.

"ఏమోనమ్మా! యీ నవనాగరికుల్తో వాదించలేం...సరే ...తలుపులు జాగర్త. నేను పోతున్నాను" అని ముసలిది వెళ్ళింది.

పాపం ముసలిదాని కేమీ అనుమానాలు లే వనుకుంటాను. నన్నింకా ఆనాటి 'బుల్లివాసు' గానే చూస్తోంది. అదేనాకు పదివేలు...కాని సుందరికూడా అలాగే భావిస్తే!

ముసలిదాని భక్తికి నాకు పరమానందమైంది. ఇలాటి భక్తి మనదేశంలో యింకా పెరగాల్సిన అవసరం ఎంతైనా వుం దనిపించింది.

"ఏం హరికథా?" అన్నాను.

"ఏదో కథ—పాడు కథ! నా యెనిమిదో ఏట ఏం విన్నానో, యిప్పుడూ అదే...అది ఏదైతే నేంలే...మనకు యిష్టం లేనప్పుడు."

నాకూడా యిష్టంలేదని ఆమె యిట్టే కనిపెట్టింది. ఇంకా నాకుయిష్టమైనవి ఏమిటోకూడా నేను శ్రమపడి కని పెట్టి, నోరారా చెప్పకముందే తెలుసుకుంటే యెంత బాగుండును!

"దొడ్లో మామిడిచెట్టు కాయలు కాస్తోం దనుకుంటాను."

"ఏచెట్టూ?" అంది అర్థంకాక.

"నా చిన్నతనంలో ఇద్దరమూ నీళ్ళుపోసి పెంచాం... పడమర వైపున గోడదగ్గర."

"అదా?"

"అదే! 'కొన్నాళ్ళకైనా కాయకుండా పోతుందిట్లే?' అన్నావే"

"అబ్బ! నీకెంత జ్ఞాపకం...ఆఁ, అది కాస్తూనే వుంది"

బైట పిండారబోసినట్టు వెన్నెల. ఇంటి దగ్గర యిలాటి

వెన్నెట్లో బైటపడుకొని చంద్రుడిలోకి చూస్తూ, అక్కడేముందో ఊహిస్తూండేవాణ్ణి. అక్కడఏమున్నదనే సమస్యయీ జన్మకు తీరందని తెలిసినా ఇంత కాంతిని ఇచ్చే ఏ విద్యుచ్ఛక్తి అక్కడ ప్రకృతి అమర్చిందో కాని, చంద్రుడి చల్లదనాన్నీ, అయాచితంగా యిచ్చే ఆహ్లాదాన్నీ అనుభవించేవాణ్ణి. ఇలాటి వెన్నెలే సుందరికూడా అదే సమయానికి చూస్తూంటుందని తెలుసు; కాని ఆమె మీద అది ఎలాటి మార్పు తెస్తుందో తెలియక బాధపడేవాణ్ణి! ఈ వెన్నెల మామూలుగా ఇచ్చే ఆహ్లాదంకన్న యింకేదో గొప్పతనాన్ని తనలో యిముడ్చుకుం దనే భావం కలగకపోలేదు. ఆ రుచిచూడని ఆనందంకోసం వేచి కూర్చున్నాను.

"చిన్నతనంలో ఎంతో ఆనందంగా వుండేది. హాయిగా ఇద్దరమూ ఆగదిలో గడిపిన కొద్ది కాలమూ జన్మాంతరం మరువలేనిది"

ఆమె ముఖకళ మారింది. తన కేదో యిష్టంలేనివాన్ని వింటున్నట్టుగా వికారంగాచూసి, "ఆఁ" అంది, అస్పష్టంగా.

"నాకేమీ అర్థంకాని పుస్తకాల్ని ఎన్నింటినో చదివే దానివి. వాటిల్లోని విశేషాల్ని నాకు ఒక్కనాడుకూడా చెప్ప లేదు. నీకు బాగా గుర్తుం దనుకుంటాను...ఒకనాడు 'ప్రేమ' అంటే ఏమిటని నేను అడుగుతే, నీకు చెప్పటం చేతకాక నన్ను మరి మాట్లాడనీకుండా గట్టిగా ముద్దుపెట్టుకున్నావ్."

ఇంకా ఏమేం చెప్పి ఆమెను ఉద్రేకపరుద్దామా అని ఆలో చిస్తున్నాను. ఆ ముసిలిది యిప్పుడే వొస్తుందేమోననే భయం ఒకవైపున పనిచేస్తోంది. ఇంతా ఏడుస్తే ఇక్కడ శృంగ భంగం అవుతుందేమోననే దిగు లొకవైపు బాధిస్తోంది. ఆరి తేరి, అనుభవంవున్న వ్యక్తిదగ్గర గట్టిగా మాట్లాడబోతే— హనుమంతుడి ముందు కుప్పిగంతు లౌతయ్యేమోననే నిరు త్సాహం కూడా కలుగుతోంది. వినా పట్టు వీడ దలచలేదు.

"పోనిద్దూ, పాడు!...ఐనా నీకు..."

"అదికాదు నాకో ధర్మసందేహం కలిగింది—"

'ఏమిటీ?' అన్నట్టు చూసింది.

"అలాగే నేను యిక్కడ వుండిపోయినట్టయితే, యిప్పటికి నాకు అర్థంకాని ఆ ఉద్గ్రంథాల్లోని సారాంశాన్ని బోధించేదాని వనుకుంటాను?"

"ఏమిటీ చిత్రంగా మాట్లాడుతున్నావ్?"అంది కోపంతో.

ఇక యీ డొంకతిరుగుడు వ్యవహారం చాలా కష్టంగా తోచింది.

అన్నాను: "ఏమీ లేదు...చిన్నతనంలో నాలో ఒక బీజాన్ని నాటి దాన్ని జాగ్రత్తగా కొంతకాలం పెంచి, మళ్ళీ దాని వైపు చూడకుండా ఊరుకున్నావ్. అది కాలక్రమేణా ప్రకృతి భిక్షతోనే పెరిగి పెద్దదై కూర్చునేప్పటికి ఇప్పుడు ఆశ్చర్యపడుతున్నావ్..."

ఆమె మాట్లాడలేదు. మాట్లాడాలని ప్రయత్నించి, మాట్లాడలేక పోయినట్టుంది. తప్పు తనదనే అభిప్రాయాన్ని జీర్ణించుకొని ·కాబోలు, వాదనకు దిగలేదు.

ముసలమ్మ తలుపు కొడుతోంది. హరికథ యింత త్వరగా ఐపోయినందుకు తిట్టుకున్నాను. కనీసం తెల్లవారేవరకన్నా ఉండకపోతే భక్తిరసం ఏం ఎక్కుతుంది కనక? నాలాగే హరిదాసుడుకూడా తొందరపడో, వెన్నెల్ని చూసి భార్య జ్ఞాపకానికి వొచ్చో, కథను అడ్డదోవకు లాగి కొంప జేరుకున్నాడేమో?

నా పక్క దొడ్లో వేశారు. నాకు కొంత దూరాన ఉన్న పూలచెల్లెలు నాకు తోడు. సిద్ధాన్నం పాడైనందుకు మనస్సు ఆందోళన పడసాగింది. ఎన్నాళ్ళ, ఎన్నేళ్ళ ఆశలు వృథా ఐనవి! వ్యవహారం 'దాసు'గాడి పద్ధతికి దిగనందుకు కొంత భయమేమో?

ఇదివరకులాగే చంద్రుణ్ని చూస్తూ పడుకున్నాను. కాని యీనాడు చంద్రుడిలో చల్లదనం లేదు. విపరీతమైన వేడిని పుట్టించే గుణంకూడా వాడిలో వున్నట్టుంది. దొంగతనంలో నన్నా ఆరితేరి వుంటే సుందరిని ఎత్తుకుపోయి ఏ నిర్జన ప్రదేశంలోనో కొన్నాళ్ళు గడిపేవాణ్ణి కదా!

ఎటు తిరిగి పడుకున్నా నిద్రపట్టటం లేదు. లేచి తోటలో అటూ యిటూ తిరిగాను. చేతికి అందిన పూలను తుంచి కోపం కొద్దీ నేలమీద విసిరిపారేసి తొక్కాను. సుందరి గది కిటికీ వొకటి తోటలోకి వుంది. మెల్లిగావెళ్ళి దాని పక్కనే చాలసేపు శిలాప్రతిమలా నిలబడ్డాను. గోడకు అవతలి పక్కన దొడ్లో దారికి కటకటాల తలుపుకూడా వుంది...అటుపోయి అక్కడ చీకట్లో మెట్లమీద కూర్చున్నాను. నిందించేందుకు ఎవ్వరూ దొరక్కపోవటంచేత, కనీసం నా బాధను వెళ్ళబుచ్చుకునేందుకు మూడో చెవన్నా లేకపోవటంవల్ల నాలోనేనే మధన పడసాగాను.

ఒకగంట గడిచి వుంటుంది. యింట్లో కాళ్ళచప్పుడు వినబడ్డది. తొంగిచూద్దా మనుకున్నాను. కాని ధైర్యం చాల లేదు. నాలాగే యింకోడు ఎవడైనా యింట్లోకి ప్రవేశించే ప్రయత్నంలో వుండి, నాకన్న ముందుగా; తెలివిగా ఆ పని చేశాడా?

నా పక్కనే తలుపు తెరుచుకుంది. లేచి నిలబడదా మనుకున్నాను. అప్పటి కప్పుడే సుందరి ద్వారం మధ్యలో నిలబడి వుంది. ఆమె ముఖం వెన్నెల్లో స్నానం చేస్తోంది. ఎంత బాగుంది! ఎందుకు వొచ్చింది? నేను కదలకుండా, గట్టిగా ఊపిరి పీలుస్తే చప్పుడైతే నన్ను చూస్తుందేమోనన్న భయంతో కదలక, మెదలక ఆమెనే చూస్తున్నాను.

ఐదారు నిమిషాలు గడిచాక, ఆమె తలుపు దగ్గరకు వేసింది. ఐదారు అడుగులు ముందుకు వెళ్ళి, మళ్ళీ ఏం ఆలో

చించుకుందో-వెనక్కు వొచ్చి మెట్లమీదనే కూలబడి, అర చేతుల్లో గడ్డం ఆనించి ముందుకు చూడ సాగింది. అంత దగ్గర్లో కూర్చొని వున్న నాకు ఆమె ముఖకళ స్పష్టంగా కని పిస్తోంది...ఎవరికోసం ఆమె నిరీక్షిస్తోందోననే నా ఆతృతకు జవాబు చెప్పుకోలేకుండా వున్నాను.

మరి పదినిమిషాలు గడిచివుంటయ్. ఆమె కంటి వెంట నీరు కార నారంభించింది. ఆమె దేన్నిగూర్చి విచారిస్తోందో కనీసం ఊహించే స్థితిలో కూడా లేను. పమిట చెరగుతో కన్నీ ళ్ళద్దుకుంది. లేచి నిలబడి తప్పటడుగులు వేసుకుంటూ మూల తిరిగింది...నాకోసం వెళ్తోందా? నేనేం చేస్తున్నానో నని కనిపెట్టేందుకా?

నీడలో కదుల్తూ ఆమె వెనకనే బయలుదేరాను. ఆమె దేన్నిగూర్చి ఆలోచిస్తోందో కాని, చిన్న చప్పుళ్ళను లెక్క చేసే స్థితిలో మాత్రం లేదు. మెల్లిగా వెళ్ళి, నా మంచానికి సమీపంలో నిలబడి, తన నెవరో పెద్దగా భయపెట్టినట్టు—చప్పున వెనక్కు తిరిగి పరిగెత్తే స్థితిలో వుంది. వెనకనే నేను నిలబడి వుండటం చూసి, తన దొంగతనం బైటపడిపోయి నట్టూ, తరువాత ఏం చెయ్యాలో తనకు తోచనట్టూ అలాగే తలవొంచుకు నిలబడిపోయింది.

"—ఒకనాడు నేనూ యిల్లానే వెనక్కు తిరిగిపోతూంటే నన్ను పట్టుకున్నావ్, నువ్వు ఇంత దొంగ వనుకోలేదు—"

"నేనేం చేశానూ?"

"నా కోసం వొచ్చావ్. నేను నీడలో కూర్చొని అంతా కనిపెడుతూనే వున్నాను"

వాదనకు దిగుతుందేమోననీ, విలువైన కాలం కాస్తా పాడైపోతుందేమోననీ దిగులేసి, చప్పున ఆమె చేతిని పట్టు కున్నాను. ఆమె విదిలించేందుకు ప్రయత్నం చెయ్యలేదు; చెయ్యలేకపోయిందేమో? మెల్లిగా నడిపించుకు వెళ్ళి పక్క

మీద కూర్చోపెట్టును. నన్ను ఆజ్ఞాపించే సుందరి యీలా నాకు లోబడిపోతుందని కల్లోకూడా తలచలేదు.

“నువ్వా, నేనా దొంగ?” అంది.

“నేను కాదు...నువ్వే”

“మా యింటికి వొచ్చావ్...మనుషుల్నే దొంగతనం చేసేందుకు!”

“అదంతా నీ తప్పే...ఎనిమిదేళ్ళుగా నీమీద ఆశల్ని భరించలేనంతగా పెంచుకున్నాను.”

“నిజమే! చిన్నప్పుడు నిన్ను లొంగతియ్యాలని ప్రయత్నం చేశాను-స్వంతం చేసుకునేందుకు; కాని యీ నాడు నీకే లొంగిపోవాల్సి వొచ్చింది.”

చిరునవ్వు నవ్వింది. భయపడి ఆశలు చంపుకున్న సుందరిగా నాకు తోచలేదు. కొన్ని సంవత్సరాలపాటు బలవంతాన తొక్కిపట్టిన శక్తులన్నీ యీనాడు ఆమెలో విజృంభించిన వనిపించింది. ఇన్నాళ్ళూ నేను యీ సుందరిని వెతుక్కుంటూ జీవితాన్ని గడిపాను కాబోలు! ఇక, యీ స్వర్గ సౌఖ్యం అనుభవించాక ప్రాణం పోతేమాత్రం ఎంత తృప్తి! చాలా ఇష్టమైన ఒక అనాఘ్రాత పుష్పం చేతుల్లోకి వొచ్చాక, అది ఏ స్థితికి వొస్తుందోకూడా తెలియకుండా దాన్ని అనుభవించేందుకు చేసే పనులకూ నే చేసే పనులకూ భేదం లేకపోయింది.

# 12

సుందరి నాదైపోయిందనీ, ఇక నా చెప్పు చేతుల్లోనే మెలుగుతుందనీ, నా కనుసన్నలకు తలవాలుస్తుందనే అభిప్రాయం పూర్తిగా నాలో నాటుకుపోయింది. పదారురోజుల దాకా నేను ఇల్లు కదలలేదు. పాపం ముసలమ్మమాత్రం మాకి

కథలకు వెళ్తూనే వుంది. ఆమెను తేలిగ్గా మోసగించ గలుగు తున్నాననే సంతోషంతో గుండె నిండిపోయింది.

వారం గడవకముందే సుందరి అంది; "ఇక యీ వ్యాపారం లాభంలేదు. ఇలా చాటుగా యింకెన్నాళ్ళు సాగేట్టూ?"

"ప్రాప్తమున్నంత వరకే!"

"నీకేం నువ్వు మొగాడివి. ఇవ్వాళ ఉండి, యీ దుకాణం బైటపడగానే తోక ఝాడిస్తావ్."

నా మనస్సు చివుక్కుమంది. అసలు నిజానికి నా ధీమా అదే కాని, దాన్ని ఆమె గ్రహించి బైటపెట్టినందుకు బాధ పడ్డాను.

అన్నాను: "మరేం ఫర్వాలేదు"

"నీకేమీ ప్రమాదం లేదు. నా గతి చూడు: నేను అటు పుట్టింటికీ, ఇటు అత్తవారింటికీ కాకుండా పోతాను."

"అంత ప్రమాదంవొస్తే నాతో తీసుకు పోతాను."

నవ్వి అంది: "స్త్రీని; అందులోనూ వివాహితను. పరువు మర్యాదల్తో బతికే రెండు కుటుంబాల్ని బజార్న పెట్టేటంత నీచాభిప్రాయం నాలో లేదు. అందులోనూ యీ కాలంలో నీలాటి నవనాగరికుణ్ని నమ్మి గుమ్మం దాటితే నా గతి కుక్కలకూ, నక్కలకూ ఎరుక—"

"నన్నుకూడా నమ్మవా?" అన్నాను.

"అసంభవం! ఐనా నిన్ను ఎందుకు నమ్మాలీ! నమ్మకపోయి నందువల్ల నష్టంలేదు కాని, నమ్మి చెడటానికి తా విక్వటం దేనికీ?"

నేను మాట్లాడలేకపొయ్యాను. నా హృదయంలోకి జొర బడి నేను చెప్పదల్చుకొన్న వాటిని గ్రహించి, ఆమె మాట్లా డుతూంటే నేనేం మాట్లాడేదీ?

"ఐతే ఇప్పుడు ఏం చెయ్యమంటావ్?" అన్నాను.

"ఏదో బుద్ధి గడ్డి తిన్న దనుకో, పరిస్థితుల వొత్తిడివల్ల యెంతమంచి బుద్ధయినా చెడొచ్చు కాని..."

"నువ్వేంచెడ్డావ్? యిదే నిజంగా గొప్ప తప్పయితే" అని సాగించాను-ఎలాగైనా దీనికి ఆమె బాధపడకుండా చూస్తే కాని నాకు మంచి అవకాశం దొరకదు!

"సారీ నువ్వు యింతదూరం చూడగలిగా వనుకున్నా, లోకం యింకా అంత ముందుకు సాగలేదు. ఇది ఇండియా; అందులోనూ నేను హిందూ స్త్రీని!"

"నిజమే లే...మరేం చేద్దాం?"

"చేసేందుకు ఏముంది? రేపు నువ్వు ఇంటిముఖం పడితే!"

"నిన్నువొదిలా? నాతరం కాదు...ఈజన్మకు వొదల్లేను."

"పిచ్చిగా మాట్లాడవోక. నీమీద యింకా మోజు తీర లేదు అను, అంతే! ఐనా నేను దానికి బాధ్యురాల్ని కాదు. అదీకాక మనం అనుకున్నదంతా జరుగుతే లోకం సాగుతుందా? నా క్షేమాన్ని కోరైనా నువ్వు వెళ్ళిపోవాలి."

"ఊహుఁ, నేను వెళ్ళను..."

"—వెళ్ళవ్? ఔను. ఎందుకు వెళ్తావ్? చీమ దూరే సందిస్తే నెత్తికెక్కి కూరున్నాక చెప్పినట్టు వినేందుకు నువ్వు మొగాడివాయె! నేను లొంగాను. ఒకసారి స్త్రీ లొంగిందంటే, తరువాత అంతకన్న యింకా లొంగటం కన్న ఇంకో దారి లేదు..."

"ఒక్కటి ఆలోచించు: నేను ఈ వూళ్ళో రెండు రోజుల కన్నా ఎక్కువ వుండకూడదు; అలాటిది వారం రోజుల

దాకా కంపెనీ పని ఏమీ చెయ్యకుండా వున్నానంటే, నా ఉద్యోగం ఊడిందనే దాని అర్థం. నీ కోసం ఉద్యోగాన్ని కూడా త్యాగం చేశాను!"

"వెధవపని చేశావ్! చేసిందికాక చెప్పుకోవొచ్చావా? నేను నిన్ను ఏమన్నా త్యాగం చెయ్యమన్నానా? నీ స్వార్థం కోసం, ఉద్యోగంకన్న ఎక్కువ సౌఖ్యం నాలో వుందని ఉద్యోగాన్ని వొదులుకున్నావ్. నాకోసం త్యాగం చేశానని చెప్పావే...పోనీ ఇప్పుడు నా కోసం నన్నువొదిలి ఎందుకు వెళ్ళకూడదూ? నీ కోసం నేనూ త్యాగం చేశాను. నా పరువునూ, మర్యాదనూ ఒదులుకొని యీ 'రిస్కు' చేశాను. భయమనేదాన్ని జాగ్రత్తగా తొక్కిపట్టుకున్నాను. నా త్యాగానికి ప్రతిఫలం లేదని నేను ఏడవను. ఎందుకంటే, ప్రతిఫలం లేకపోతే అసలు త్యాగానికే సిద్ధురాల్ని అవలేను కనుక...ఐనా ఉద్యోగం అంటే నీకంత అలు సెంగుకూ?"

"ఉద్యోగంపోతే యింకో ఉద్యోగం దొరుకుతుంది. కాని సుందరి పోతే...?"

"అందమైన ఆడదంటే ఇంత వ్యామోహం వున్నవాడివి, ఇలాటి దొంగ ఎంగిలి కూటికి చెయ్యి జాపకపోత్నే పెళ్ళి చేసుకోరాదూ?"

నా వివాహంమాట ఇప్పుడే ఎవరో నాకు బాగా జ్ఞాపకం చేసినట్టయింది. నేను వొప్పుకోక పోవటంవల్ల యిన్నాళ్ళూ సంబంధాలు వొచ్చి తిరిగిపోయినై. ఇప్పుడు పెళ్ళిచేసుకో కుండా ఇరవై యేళ్లు ఎందుకు గడిపానా అనే దిగులు పట్టుకుంది. యింకా నయం...యిలాగే నాకు తెలియకుండా ఇంకెన్నాళ్లు గడిచిపొయ్యేవో? నిజంగా మనకు ఏది సమస్యో కూడా తెలియకుండానే బతికగలుగు తున్నాం కాబోలు!...

కాని నేను పెళ్ళిచేసుకోకపోవడానికి పెద్ద కారణంకూడా వుంది.

అన్నాను: "నా దృష్టిలో సౌందర్యానికి కొలబద్దవు నువ్వు. అందుకని నాకు నచ్చింది, యింతవరకూ కనిపించ లేదు..."

"మరి సరిగ్గా నా లాటిదే కావాలంటే ఎలా దొరుకు తుంది?"

"దొరక్కపోతే ఇలాగే వుంటాను."

ఆమె క్షణం ఆలోచించి అంది: "దొరుకుతే—?"

"పెళ్ళి చేసుకుంటాను—"

"సరే నేనో పిల్లను చూపిస్తాను, చేసుకుంటావా?"

వ్యవహారం చప్పున యిలా అపాయంలోకి పడుతుం దనుకో లేదు. ఐనా నాకు చూపించాక కదా విషయం తేలేది. అప్పుడు ఏదో వొక ఉపాయంతో అపాయాన్ని దాటవొచ్చు.

"—తప్పకుండా" అనక తప్పలేదు.

మర్నాడు మధ్యాహ్నం నిద్రపోతూండగా సుందరి వొచ్చి లేపింది.

"ఏమిటీ?" అన్నాను, నిద్రమత్తు యింకా వొదలలేదు.

"రాత్రి నీతో చెప్పలా—ఆ అమ్మాయి వొచ్చింది."

"దేనికీ?"

"ఇంత మరుపైతే ఎల్లా? పెళ్లి చూపులకు."

నా గుండె గుభేలుమంది. పెళ్లి అంటే ఇంతకు పూర్వం వున్న ద్వేషమంతా మళ్లీ మనస్సులో ప్రజ్వరిల్ల సాగింది.

ఆదెలాటిదో తెలియకుండానే ఒక్కసారిగా ఆ అగాధంలోకి దూకుతూన్న ట్టనిపించింది. అదీకాక జీవితాంతంవరకూ నిర్ణయించబడ్డ ఒక గడ్డు సమస్యను, కొన్ని క్షణాల్లోనే పరిష్కరించుకోవాలనే భావం కలగగానే, యిది నాకు సాధ్యమా అనే అనుమానంకూడా వొచ్చింది. బజారుకుపోయి నాలుగు రూపాయిల విలువగల వస్తువును కొనేందుకు - బాగా ఎరిగిన స్నేహితుణ్ణి వెంటతీసుకుపోతాం; అలాటిది యింత విలువైన వస్తువు—డబ్బు రూపాన విలువకట్టలేని 'సరుకు'ను సరిగ్గా తూచి కొట్టినట్టు చెప్పటమంటే ఎవరి తరం? ఇంకా అండగా ఎవరైనావున్నా చేసే దేమీ వుండదు; కాని అది కొంత తృప్తి! ఒకవేళ మోసపోతే, అంగులో కొంత భాగాన్ని భరించేందుకన్నా పక్కవాడు ఉపయోగిస్తాడు కదా! ఏం సమాధానం చెప్పి తప్పించుకోనా అని చూస్తున్నా.

"ఏం, నువ్వు సిద్ధమేనా?" అంది ఆమె.

రాత్రి ఏదో సంభాషణ ఒత్తిడివల్ల సరే నన్నాను కాని. అది ఇంత త్వరగా 'చేత'గా మారుతుం దనుకోలేదు.

"...సరే; కాని నాకు యీ ఉన్న ఉద్యోగం కూడా వూడే సూచనలు కనిపిస్తున్నాయ్. మరి నన్నెవరు పెళ్ళి చేసుకుంటారూ?"

"అదంతా వేరే సంగతి. ఐనా ఆ పిల్ల వూరికే రాదులే! నలభై యాభై వేల రూపాయలతోసహా వొస్తుంది. ఆమే నిన్ను పోషిస్తుంది. ఆ దిగులు నీకేం అక్కర్లేదు."

బలికా ననిపించింది. డబ్బుసంగతి వినగానే అసలు పిల్లను చూడటం లేని కనిపించింది! ఒక్కసారిగా నాలోని శక్తులన్నీ విజృంభించినయ్. సుందరి ఇంత మంచిదనీ, ఇంత

గొప్ప అదృష్టాన్ని నాకు తెచ్చి పెడుతుందనీ అనుకోలేదు... ఆ చూడబోయ్యే పిల్లను అర అణా విలువగల దృష్టితో చూడాలనే అభిప్రాయం కలగగానే భయం వేసింది. అంత గొప్పదానికి-విలువలేని నేనే దొరికానా?

"ఏం!" అంది సుందరి నా జవాబుకు ఎదురుచూస్తూ.

ఆ ఊహాప్రపంచంలో కలిగిన భావాలతో కలిసిపోయి వెంటనే జవాబు చెప్పలేక, కొంత తడుముకొని 'చూడనక్కర్లేదు - ఒప్పుకున్నట్లే' అనేందుకు, ఆ జవాబు చాలా మోటుగా అసహ్యంగా కనిపించటంవల్లా, 'ఐనా చూస్తే మాత్రం పొయ్యేదేముంటుందిలే?' అనే వుద్దేశంతోనూ, "సరే" అన్నాను.

"లే... నాతో రా" అంది.

ఆమెను అనుసరించాను; పడక గదిలోకి తీసుకుపోయింది.

"ఈ కుర్చీలో కూర్చో...ఆమెను పిలుస్తాను...ఏమన్నా తయారవ్వాలా?"

"ఒద్దులే" అన్నాను.

సుందరి వెళ్ళిపోయింది. గిర్రున తిరిగే చక్రం నిమిషానికి యెన్నిసార్లు తిరుగుతుందో లెక్క పెట్టేందుకు చేసే వ్యర్థ ప్రయత్నంలాగే, అనేక ఆలోచనలు నాలో చెలరేగుతూ, అంతలోనే చెల్లా చదరవుతూంటే, నేను సరిగ్గా దేన్నిగూర్చి ఆలోచిస్తున్నానో నాకే తెలియటం లేదు.

సుందరి క్షణంలో తిరిగి వొచ్చింది.

"రావే...ఇంకా సిగ్గుపడుతూ ఆ మూల నక్కకపోతే... ఆ కాఫీ కాస్తా వొలకపోస్తావ్...రా...నేను బతిమాల లేనమ్మా!"

గదిబైట ఎవరున్నారోననే ఆతృత నాలో హెచ్చు యింది. కాని ఇంతసేపూ ఓపికపట్టి యీ కాస్తలోనూ తొందరపడటం దేని కనిపించింది... రెండు నిమిషాలు గడి చాక ఒక పదిహేనేళ్ళమ్మాయి లోపలికి వొచ్చింది. ఆమెను చూశాక వర్ణనకు తగిన పదజాలమే నాకు దొరకలేదు. ఇంత కాలమూ నేను యీమె కోసమే కనిపెట్టుకు కూర్చున్నా నని పించింది. ఇరవై సంవత్సరాల తపఃఫలం అనుభవించ బోయే ముందు కలిగే సంతోషమంతా నాలో రేకెత్తిం దనేందుకు సందేహం లేదు. ఇంత మంచిపిల్లకు నేనెలా తగిన వరుణ్నని సుందరి అభిప్రాయపడ్డదో నాకు ఆశ్చర్యంగానే వుంది. కాని ఆ ఆలోచన కలిగినప్పుడు-నాకు యీ లోకమంతా శూన్యం గానూ, అంధకార బంధురంగానూ తోచింది. ఇదే నాకు కాకుండాపోతే-వేదాంతుల మాటల్లోలాగు జీవితమే నిరాశా మయ మనిపించింది. వీళ్ళందరూ నాకు అన్యాయం చేసి, నన్ను ఒక్కణ్ణే ఏ సహారా ఎడారిలోని మండుటెండకో బలిగా పంపించాలని చూస్తున్నారేమో ననిపించింది. ఈమె చిన్న సుందరనేందుకు సందేహం లేదు. ఇంక ఏ ఇతర భయమూ లేకుండా యిప్పుడే—యీ క్షణంలోనే ఆమె నా భార్యయి కూర్చుంటే యెంత బాగుండును!...యింతా ఏడుస్తే నన్ను ఏడిపించేందుకు సుందరి యీ యెత్తు వెయ్య లేదు కదా?

ఏమీ పాలుపోక సుందరి ముఖంలోకి చూశాను. ఇంత గొప్ప అదృష్టం పోతుందేమోననే భయమూ, త్వరగా ఫలితం తెలియ లేదనే ఆతృతా, ఆకలైనవాడికి రుచికరమైన ఆహారం పెట్టే ఆశా, అది మనచేతుల్లోకి రావటం ఎలాగనే దిగులూ-యింకా నాకు తెలియని, తెలిసినా కలానికి లొంగని అనేక భావాలు నన్ను ముంచెత్తినయ్. నా చూపులు ఒక పిచ్చి వాడి చూపులకు పోల్చేందుకు చాలా దగ్గర్లో వుండి వుంటై.

సుందరి కొంటెగా నవ్వి అంది: "నా ముఖంలోకి చూస్తే ఏ ముందీ! నన్ను కాదు పెళ్ళి చేసుకునేది...ఆ బంగారమ్మను;"

ఆమె అనే 'బంగారమ్మ' నిజంగా బంగారానికి ఏ విధం గానూ ఎందులోనూ తీసిపోదు...ఆ పిల్ల సిగ్గుపడుతూ, ఒకటి రెండు సార్లు ముఖమెత్తి నన్ను చూసి, నేను తననే చూస్తున్నానని మరీ సిగ్గుపడి, తల వొంచేసి. కాఫీ అక్కడ పెట్టి, పారిపోయింది.

"ఏం...నచ్చిందా?" అంది సుందరి.

"ఓ. నాకు ఎలాటివాళ్ళు నచ్చుతారో, నాకన్న నీకే బాగా తెలుసు. నువ్వు ఏరి తెచ్చాక-యింకా తిరుగేముందీ?"

"అను, అప్పుడే ఏమైందీ? ఆమె నీకు నచ్చంగానే సరి పోయిందా? మరి నువ్వు ఆమెకు నచ్చావో లేదో కనుక్కోవొద్దూ?"

మళ్ళీ ఎక్కడలేని దిగులూ నన్ను ఆవరించిరిగి. నా జీవిత సౌఖ్యమంతా యింత చిన్న జవాబు మీదనే ఆధారపడి వుంటుందనే మాటను తలుచుకునేందుకే భయం వేసింది.

ఐదారు నిమిషాలదాకా నా గుండె అతివేగంగా కొట్టుకోవటాన్ని నేనే వినసాగాను. ఆ కాస్సేపూ ఆ గదిలో పట్టపగలు వొంటరిపాటు భయంకరంగా తోచింది. సుందరి మళ్ళీ నవ్వుతూ తిరిగి వొచ్చింది. ఆమె ముఖ భావాన్ని కానీ, నవ్వును కానీ నేను అర్థంచేసుకోలేక తికమక పడ సాగాను.

ఆమె అంది: "నీ దురదృష్టం! నువ్వు ఆమెకేమీ నచ్చ

లేదట! నువ్వు నలుపట! నీ గుడ్లు పెద్ద రాకాసిగుడ్ల లాగున్నా యట! నీ ముక్కు సపోటాకాయలా గుందట..."

నాలోని లోపాలన్నీ నన్నింత నిరాశకు తోలుత య్యను కోలేదు. ఇన్నాళ్లూ నా లోపాల్ని నేను దూషించుకోలేదు- వాటిని వొదిలించుకునే మార్గం లేదు కనుక! కాని యీనాడు అవ్వి యిరవై సంవత్సరాలుగా నాకోసం దాచివుంచిన బాధ నంతట్నీ వెళ్ళ గక్కినయ్.

"పోనీ నువ్వు చెప్పి సరిచెయ్యలేక పొయ్యావా?" అన్నాను; మనలో మరి దమ్ములేకపొయ్యాక, రికమన్ డేష నన్నా పని చెయ్యకపోతుందా అని.

"నేనేం చెప్పేది? నీ దగ్గర సుగుణాలు ఏమున్నయ్యని కీర్తించేది?"

పకాలున నవ్వింది. ఆమెకు యెంత యెగతాళిగావుంది! పిల్లికి చెలగాటమూ, ఎలక్కు ప్రాణసంకటంగా వుంది.

"నా దగ్గర సుగుణాలే వుంటే నీ సహాయం దేనికి?"

"మరి లేనప్పుడు నేను అబద్ధమాడేదా?"

"—అదే నువ్వుచేసే సహాయం!"

"నాకు చేతకాదు బాబూ! ఏమన్నా చెప్పదల్చుకుంటే నువ్వే ఆమెకు చెప్పుకో."

కాగితం మీద రాసి ఇద్దా మనుకున్నాను; కాని నాకు రాతలో చాకచక్యం నున్నా. మాట్లాడటంలో మాత్రం ఏముంది కనుక-మన మాటల ప్రయోజకత్వంతోనే లోకంలో పనులు చేసుకుంటున్నామని భ్రమపడుతున్నాం కాని! ఐనా నా గొప్పను నేను ఎలా పొగడుకునేది? అసలు యిక్కడ

వున్న గొప్పతనం ఏముందని ఆమె త్రాసులో తూచేందుకు పంపేది?

సుందరి కొంటెనవ్వులో అనేక అర్థాలు ఇమిడి వుంట య్యని మొదటినుంచీ నాకు అనుమానమే!

"నీ అంత గొప్పదానికి యిదొక లెక్కా?" అన్నాను.

తన గొప్పతనమంతా బైటపడేట్టు యింటి కప్పు కేసి చూడసాగింది. ఆమెను ఆకాశానికి ఎత్తుతే పనికాక తప్పదు!

"కీలకం నీ చేతుల్లోనే వుంది!"

"నేనేం చేసేది!...ఐనా కొన్ని షరతులకు ఒప్పుకుం టావా?"

"ఊఁ"

"ఆ పాడు ఉద్యోగం—ఊళ్ళవెంట తిరగటం వొది లెయ్యాలి."

చాలా రోజులునుంచీ ఈ ఉద్యోగంలోని 'పాడు' నా నసాళానికి అంటి వుంది.

"నేను వొదిలేందుకేముంది! ఆ ఉద్యోగమే నన్ను వారం రోజులక్రితమే వొదిలేసింది—"

"ఆమెను సరిగ్గా చూస్తావా—లేక మళ్ళీ నాలాటి దాని కోసం చెయిజాపుతూ—"

"ఉహూ, అలాటిది యెప్పుడూ జరగదు"

"సరే...ఐతే ఆమె ఒప్పుకుందిలే!"

"భలే ప్లేటువేశావే! ఆమె ఎవ రేమిటి?"

"నా చెల్లెలు..."

"అట్లాగా? అంటుకానే నీ అంతబాగుంది...నువ్విప్పుడు నిజంగా వొదినవే!"

సుందరి నవ్వి వూరుకుంది.

ఇంకా రాసేందుకు మాత్రం యేముందీ? సుందరి నన్నొక ఇంటివాణ్ణి చేసింది. అప్పుడప్పుడు వొదిన మమ్మల్ని చూసేందుకు వొస్తూవుంటుంది.

"దమయంతి ఎలా వుందీ?" అంటుంది.

"ఇంకా అడవులకు వెళ్ళలేదులే—"

"నీకు నచ్చిందా?"

"నీ అంత బాగానూ—నువ్వు నేర్పిన విద్యలన్నీ నేర్చుకుంటోంది"

"ఇంకెవరికన్నా నేర్పేవ్?"

"అర్హత వుండొద్దూ—?"

వొదిన నవ్వి ఊరుకుంటుంది!

—ఆగస్టు, 1942.

ఐపోయింది

# సలహా

రచన:

ధనికొండ హనుమంతరావు



# సలహా

ఏలూరు

ప్రియమిత్రమా!  1-5-44

మొన్నామధ్య మీ ఇంట్లో నేను పొందిన అతిథ్యానికి ఎంతైనా కృతజ్ఞుణ్ణి. అక్కడ నేను పొందగలిగినంత తృప్తిని స్వగృహంలో కూడా పొందలేకపోతున్నా ననటం అతిశయోక్తి కాదు. అక్కడ గడిపిన నాలుగు రోజులూ నేను స్వర్గంలోనే ఉన్నానేమో ననిపించినవి.

అన్నిటికన్నా నన్ను ఆశ్చర్యపరిచింది ఏమిటంటే, మీ అన్యోన్య దాంపత్యం. చిలకా గోరింకల కాపరాలైతే నేను చూడలేదు కాని, మీలాటి దాంపత్యానికి మాత్రం ఆ పేరు సరిపోతుంది. నేనుకూడా రెండేళ్ళనుంచీ దాంపత్య జీవితాన్ని గడుపుతూనే ఉన్నాను. ఇతర స్నేహితుల కాపరాల్ని చూస్తూనే ఉన్నాను. కాని నేను ఎరిగినంతవరకూ నువ్వు గడిపేలాటి ఆనందమయ జీవితం మరి లేదు. నీ సుఖమయ జీవితం నన్ను యీర్ష్యకు గురిచేసిందంటే నమ్ము.

జీవితంలో ఘోరమైన గడ్డు సమస్య 'భార్య'. ఈ భార్యను గూర్చిన సరైన విజ్ఞానం నాకు ఇంతవరకూ చిక్కక పోవటంవల్ల ఇలా బాధపడుతున్నానేమో ననిపించేది. కాని నా మిగతా మిత్రులు కూడా నాలాగే బాధపడటాన్ని గ్రహిం

చాక, ఇది లోక మంతటా ఉన్న సమస్యేననీ, అతి సామాన్య విషయంగా ఏనాడో నిర్ణయించబడ్డదనీ తృప్తి కలిగింది. అలాటి సమయంలో మీ ప్రణయజీవితం చూశాక నా తృప్తికి పెద్ద దెబ్బ తగిలింది. బుర్రలో ఒక ప్రళయమే పుట్టినంత పనయింది.

ఈ కీలకాన్ని గూర్చి తెలుసుకోవా లనుకున్నాను. నిన్ను అడుగుతే నన్నొక అసమర్థుడిగా అర్థం చేసుకుంటావేమోనని భయపడి ఊరుకున్నాను. మనసులో కుళ్ళుతూ, బుర్రతో ఆలోచించి లాభంలేదని ఇప్పటికి నమ్మకంగా తేలిపోయింది. ఈ రహస్యాన్ని తెలుసుకోకపోతే నాకు నిద్రపట్టేట్టు లేదు. ఇక నువ్వు ఏమనుకున్నా సరే—భార్యను ఇంత గొప్పగా ఎలా స్వాధీనపరుచుకో గలిగావో—ఆ రహస్యాన్ని నాకు చెప్పక తప్పదు.

భార్యను అతిగా ప్రేమించటంలో తప్పేమీ లేదు కాని, భర్త చూపినంత ప్రేమను, భార్య తిరిగి చూపకపోవటం విషాద సంఘటన! నా జీవిత శకటం ఆ విధంగానే బోల్తా కొట్టిందేమో నాకు తెలియదు. ఆమెను ఎంతగా ఆరాధించి ప్రేమించి,పూజిస్తున్నా (లేక ఒక పక్క ప్రేమిస్తూనే,రెండో పక్క పూజిస్తున్నా) ఆమెను తృప్తిపరచాలని ఎంతగా ప్రయత్నిస్తున్నా, నా శ్రమ ఎప్పుడూ ఫలించ లేదు; ముందు ముందు ఫలిస్తుందనే నమ్మకం కూడా లేదు. మొదటినుంచీ జీవితంలోని అసంతృప్తిని గమనించి బాధపడుతూనే ఉన్నాను. నాకు నేనుగా ఎంతగా సరిపెట్టుకోవాలని చూసినా అన్వయం కావటం లేదు. ఒకటి మాత్రం తేలింది—నేను అనుసరించిన మార్గం తప్పు. ఇంత దూరం సాగివొచ్చాక ఆ సంగతి తెలుసుకున్నాను; ఇంకా నయం—ఇంకా ముందుకు సాగనందుకు సంతోషపడాలేమో!

దీన్నే ఇంకో రకమైన పద్ధతిలో ఆలోచించాను: హిందూ

కన్యల నరనరాల్లోనూ పాతివ్రత్య ధర్మాలు జీర్ణించి ఉండడం దాదాపు ప్రకృతి సహజమనే మాటను నేను మరిచిపోలేదు. కాని యీమె కాస్త పెద్ద చదువు చదివి ఉండటంవల్ల ఆ పాతివ్రత్య రసం తగిన డోసుల్లో వంటపట్టలేదేమోననే సందేహం నన్ను బాధించింది. లేక ఏమరపాటున ఇంట్లో ముస లమ్మలు తోముతూ గడిపిన చిన్ననాటి విద్యలన్నిటినీ కాల క్రమాన మరిచిపోయిందేమో? అదీ కాకుంటే, కాపరానికి రాబోయ్యేదాకా నేర్చుకున్న పాతివ్రత్య పాఠాల్ని తప్పక అమలు జరుపుదామనే నిశ్చయంతోనే ఉండి, నా ప్రవర్తన (?) తనలో రేకెత్తించిన ద్వేషం ఆ నిశ్చయాన్ని వహించిం దేమో? వీటిల్లో ఏది నిజమైనా పాతివ్రత్యాన్ని ఏదో విధంగా ఆమె మనసుకు పట్టే పద్ధతిని తప్పక ప్రయత్నించి తీరాలని నిశ్చయించుకున్నాను.

ఇందుకు మొదటి మెట్టుగా ఆమెకు 'సతీ అనసూయ' 'సతీ సుమతి' 'సతీ సావిత్రి' 'సత్య హరిశ్చంద్ర' మొదలైన తెలుగు సినిమాలన్నీ చూపాను కాని అవేమీ పనిచేసినట్టు లేదు. సినిమా చూడాలనే కుతూహలం ముందు, సినిమా చూసి నేర్చుకోవాల్సిన నీతి ఆమె దృష్టిని ఆకట్టుకోలేదేమో? నాకు నేనే గురువుగా తయారై నీతిబోధకూడా మొదలు పెట్టాను. అందులోనూ వచనం లాభం లేదేమో నని సమయం వచ్చినప్పుడల్లా 'నాతికి పతిపద సేవా—స్త్రీ జాతికి ముక్తి త్రోవా!' అని సంగీతయుక్తంగానే (హార్మోనియమూ, తబలా మొదలైన కనీసపు వాయిద్యాలు లేకపోయినా!) పాడుతూ వొచ్చాను. దీనికి ఆమె పిచ్చివాణ్ని చూసి నవ్వినట్టు నవ్వేది. నా సీరియస్‌నెస్ అంతా బుగ్గిలో పోసిన పన్నీ రయ్యేది! పాట లోని టీకా తాత్పర్యాన్ని చక్కని వచనంలో (ఒకవేళ పాటలోని భావం అర్థం కాలేదేమోనని నా భయం!) కూడా చెప్పసాగాను: "నాతికి—అంటే—స్త్రీకి—హిందూ వని

తకు, సతి అంటే భర్తయొక్క, పదసేవ అంటే పాదములవద్ద, లేక కాళ్ళవద్ద సేవచేసుకుంటూ పవిత్ర జీవితాన్ని గడపమని భావం...అంటే భర్తకు పాదాలు ఒత్తుతూ (కాళ్లు నెప్పిగా లేకపోతే మాత్రమేం? ఆ సద్గుణాన్ని బాగా అలవాటు చేసుకునేందుకు రోజూ యీ ఎక్సరసైజ్ చాలా అవసరం. ఇదొకరకం వ్యాయామం అని కూడా నా నమ్మకం) జీవితాన్ని గడపడంకల్ల ఏమౌతుందయ్యా అంటే-ఆమె జీవితం—ఆదర్శప్రాయంగా ఉండటమే గాక, స్త్రీజాతి హోల్ మొత్తానికి ముక్తికి-అంటే స్వర్గానికి త్రోవ-అనగా హైరోడ్డు!"

ఇంత విడమరిచి చెప్పినా ఆమె తల కెక్కలేదు సరికదా ఎగతాళిగా తల ఆడిస్తూ "మరి నా కాళ్ళు వొత్తే వాళ్లెవరూ లేరే? అలాటివారికి ముక్తి ఉంటుందని ఏ బడుద్ధాయీ రాయలేదేం?" అని స్త్రీజాతి తరఫున పోట్లాడటం సాగించింది. నేనేం జవాబు చెప్పేదీ?

పాతివ్రత్యాన్ని బోధించే రైల్వే సారస్వత పుస్తకాలు కూడా తెచ్చాను. వీటిల్లో తార, అహల్యలాటి పతివ్రతల గాధల్ని మినహాయించానని వేరే చెప్పనక్కర్లేదు! కాని ఆ పుస్తకాల్ని చూసి ఆమె మండిపడటమే కాకుండా, ఆ పుస్తకాల్లోని కాగితాల్ని వంటగదిలో అన్నం గిన్నెలు దించుకునే పరికరాలుగా ఉపయోగించేది.

ఇక యీ చిటకాకూడా లాభంలేదని తెలుసుకొని, వినుగు పుట్టి ఆమెను ద్వేషించటం మొదలు పెట్టాను. అమృతం పని చెయ్యకపోతే—వెంటనే విషాన్ని ప్రయోగించి చూసినట్టు. ఇది పనిచేసినా, చెయ్యకపోయినా ఒక ఎక్స్పెరిమెంట్ గానైనా తీసుకోవచ్చు కదా! ఈ విధానం వెంటనే ఫలితాన్ని చూపింది: దూ ముడల్లా పీటముడై కూర్చుంది. ఎక్కువ శ్రమ పడకుండానే విషయం తేలటం ఒకందుకు మంచిదే.

మళ్ళీ మొదటి దారినే పడదా మనుకున్నాను. ఎటు

పోయినా నాకు జీవితంలో మిగిలిందల్లా అశాంతి! చివరకు సన్యసిద్దామా అని కూడా ఆలోచించాను. ఇంకో విధాన మేదన్నా చూద్దామా అంటే—నా కేమీ తోచలేదు.

ఒక్క—మాటలో మా దాంపత్య జీవితాన్ని అర్థమయ్యేట్టు చెయ్యాలంటే—నేను ఆమెతో ఏం మాట్లాడినా ప్రమాదమే! 'మంచినీళ్ళు ఇవ్వు' అంటే చెంబు విసిరి కొడుతుందనీ, దాని గుర్తుగా మొహాన నిమ్మకాయంత బొప్పి కడుతుందనీ భయం! పరిస్థితులు ఇంతదూరం ఎందుకు వొచ్చినయ్యో ఎలా వొచ్చినయ్యో నాకే అర్థం కావటంలేదు.

నావల్ల జరిగిన పొరపాటేమన్నా ఉన్నయ్యా అని కూడా ఆలోచించాను. నాకేమీ కనిపించలేదు; అది సహజమే కావొచ్చు. ఉన్నట్టయితే అప్పుడే సరిదిద్దుకు నేవాణ్ని కూడాను! కాని, వొచ్చిన ఇబ్బంది ఏమిటంటే, మాలో ఒకరితో ఒకరు సరిపెట్టుకోవటం కుదరటం లేదు. ఆమె ఆలోచనలూ, ప్రవర్తనా ఉత్తర ధృవానా, నా ఆలోచనలు దక్షిణ ధృవానా ఉంటే ఎలా కలుస్తవి? కలిసే అవకాశాలు ఏమైనా ఉంటే అందుకు నేను శక్తివంచన లేకుండా ప్రయత్నించి తీరుతాను.

ఈ సమస్య యీ జన్మానికి తీర దనుకున్నాను. మీ దాంపత్యాన్ని చూశాక దీనికొక తరుణోపాయం ఉండిఉండాలనే నమ్మకం కలిగింది. మళ్ళీ కొత్త ఆశల్తో హృదయం నిండి పోయింది. నాకు ఆ తారకమంత్రాన్ని ఉపదేశిస్తే మాత్రం జన్మంతా కృతజ్ఞుణ్నిగా ఉంటాను. మిత్రుడివైన నీముందు నా జీవితగాధను విప్పి చెప్పేందుకు జంకను...యదార్థాన్ని జాగర్తగా పరిశీలించి నాకు సహాయపడమని ప్రార్థన.

నీ జవాబుకు ఎదురుదారులు కాస్తాను. మిత్రుడు,

గోవింద్.

తను, పతి అంటే భర్తయొక్క-పదసేవ అంటే పాదములవద్ద, లేక కాళ్ళవద్ద సేవచేసుకుంటూ పవిత్ర జీవితాన్ని గడపమని భావం...అంటే భర్తకు పాదాలు ఒత్తుతూ (కాళ్లు నెప్పిగా లేకపోతే మాత్రమేం? ఆ సద్గుణాన్ని బాగా అలవాటు చేసుకునేందుకు రోజూ యీ ఎక్సరసైజ్ చాలా అవసరం. ఇదొకరకం వ్యాయామం అని కూడా నా నమ్మకం) జీవితాన్ని గడపడంకల్ల ఏమౌతుందయ్యా అంటే-ఆమె జీవితం—ఆదర్శప్రాయంగా ఉండటమే గాక, స్త్రీజాతి హోల్ మొత్తానికి ముక్తికి-అంటే స్వర్గానికి త్రోవ-అనగా హైరోడ్డు!"

ఇంత విడమరిచి చెప్పినా ఆమె తల కెక్కలేదు సరికదా ఎగతాళిగా తల ఆడిస్తూ "మరి నా కాళ్ళు వొత్తే వాళ్లెవరూ లేరే? అలాటివారికి ముక్తి ఉంటుందని ఏ బడుద్ధాయీ రాయలేదేం?" అని స్త్రీజాతి తరఫున పోట్లాడటం సాగించింది. నేనేం జవాబు చెప్పేది?

పాతివ్రత్యాన్ని బోధించే రైల్వే సారస్వత పుస్తకాలు కూడా తెచ్చాను. వీటిల్లో తార, అహల్యలాటి పతివ్రతల గాథల్ని మినహాయించారని వేరే చెప్పనక్కర్లేదు! కాని ఆ పుస్తకాల్ని చూసి ఆమె మండిపడటమే కాకుండా, ఆ పుస్తకాల్లోని కాగితాల్ని వంటగదిలో అన్నం గిన్నెలుద్ధించుకునే పరికరాలుగా ఉపయోగించేది.

ఇక యీ చిటకాకూడా లాభంలేదని తెలుసుకొని, విసుగుపుట్టి ఆమెను ద్వేషించటం మొదలు పెట్టాను. అమృతం పని చెయ్యకపోతే—వెంటనే విషాన్ని ప్రయోగించి చూసినట్టు. ఇది పనిచేసినా, చెయ్యకపోయినా ఒక ఎక్స్పరిమెంట్ గానైనా తీసుకోవచ్చు కదా! ఈ విధానం వెంటనే ఫలితాన్ని చూపింది: దూ మొడల్లా పీటముడై కూర్చుంది. ఎక్కువ శ్రమ పడకుండానే విషయం తేలటం ఒకందుకు మంచిదే.

మళ్ళీ మొదటి దారినే పడదా మనుకున్నాను. ఎటు

పోయినా నాకు జీవితంలో మిగిలిందల్లా అశాంతి! చివరకు సన్యసిద్దామా అని కూడా ఆలోచించాను. ఇంకో విధాన మేదన్నా చూద్దామా అంటే— నా కేమీ తోచలేదు.

ఒక్క మాటలో మా దాంపత్య జీవితాన్ని అర్థమయ్యేట్టు చెయ్యాలంటే— నేను ఆమెతో ఏం మాట్లాడినా ప్రమాదమే! 'మంచినీళ్ళు ఇవ్వు' అంటే చెంబు విసిరి కొడుతుందనీ, దాని గుర్తుగా మొహాన నిమ్మకాయంత బొప్పి కడుతుందనీ భయం! పరిస్థితులు ఇంతదూరం ఎందుకు వొచ్చాయో ఎలా వొచ్చాయో నాకే అర్థం కావటంలేదు.

నావల్ల జరిగిన పొరపాటేమన్నా ఉన్నదేమో అని కూడా ఆలోచించాను. నాకేమీ కనిపించలేదు; అది సహజమే కావొచ్చు. ఉన్నట్టయితే అప్పుడే సరిదిద్దుకునేవాణ్ని కూడాను! కాని, వొచ్చిన ఇబ్బంది ఏమిటంటే, మాలో ఒకరితో ఒకరు సరిపెట్టుకోవటం కుదరటం లేదు. ఆమె ఆలోచనలూ, ప్రవర్తనా ఉత్తర ధృవానా, నా ఆలోచనలు దక్షిణ ధృవానా ఉంటే ఎలా కలుస్తవి? కలిసే అవకాశాలు ఏమైనా ఉంటే అందుకు నేను శక్తివంచనలేకుండా ప్రయత్నించి తీరుతాను.

ఈ సమస్య యీ జన్మానికి తీరదనుకున్నాను. మీ దాంపత్యాన్ని చూశాక దీనికొక తిరుణోపాయం ఉండి ఉండాలనే నమ్మకం కలిగింది. మళ్ళీ కొత్త ఆశల్తో హృదయం నిండిపోయింది. నాకు ఆ తారకమంత్రాన్ని ఉపదేశిస్తే మాత్రం జన్మంతా కృతజ్ఞుణ్నిగా ఉంటాను. మిత్రుడివైన నీముందు నా జీవితగాధను విప్పి చెప్పేందుకు జంకను...యదార్థాన్ని జాగర్తగా పరిశీలించి నాకు సహాయపడమని ప్రార్థన.

నీ జవాబుకు ఎదురుదారులు కాస్తాను. మిత్రుడు,

గోవింద్.

# 2

ఒంగోలు,
4-5-44

భాయీ!

నీ ఉత్తరం అందింది. ఇక్కడ ఉండగా అడిగినట్టయితే అరటిపండు వొలిచి అరిచేతులో పెట్టినట్లుగా బోధ పరిచే వాణ్ణి. ఇప్పటికైనా మించిపోయింది లేదు; అరటిపండును వొలుచుకొని తినే శ్రమకు సిద్ధమైతే చాలు.

నా దాంపత్య జీవితాన్ని ఇక్కడ విశదీకరిస్తే యీ కీలకం నీకు తేలిగ్గా అర్థమౌతుంది:

నువ్విప్పుడు పడే అవస్థ మొదట్లో నేనూ పడ్డాను. హిందూ సమాజంలో దాదాపు అందరూ యీ ప్రమాదంలో పడతారనే నా నమ్మకం. దీనికి కారణం ఏమిటంటే—కొత్త వ్యక్తి మీద భర్తృత్వాధికారాన్ని సంపాయించేందుకు మనం చేసే ప్రయత్నాలకు, కొత్తగా కాపరానికి వొచ్చిన ఏ ఆడదీ లొంగదు సరికదా, తన స్వేచ్ఛను కోల్పోకుండా ఉండేందుకు తనే మన మీద అధికారాన్ని సంపాయించేందుకు ప్రయత్నిస్తుంది. కొత్త పిచ్చిగాడి వ్యవహారంలాగు ప్రేమ మైకంలో పడి ఏది పోతోందో కూడా ఆలోచనలేకుండా వెంటాడే ప్రేమపతిగా మారిన భర్త చూపే ఆదరణను ఊతగా తీసుకుంటుంది. అసలు విషయం గ్రహించి భార్య సంపాయించగలిగిన అధికారమూ, స్థానమూ చూసేప్పటికి పరిస్థితి చాలా విషమించి ఉంటుంది. దాన్ని సరిదిద్దుకునేందుకు పడాల్సిన అవస్థ ఇంతా అంతా కాదు. ఇక్కణ్ణుంచీ ప్రేమను అభినయించి సంపాయించిన (?) అధికారాన్ని నిలబెట్టుకునేందుకుగాను ప్రణయ దేవత, ప్రళయ దేవతగా మారుతుంది. భర్తమీద కోరాలూ, మిరియాలూ నూరటం

నుంచీ, యింట్లోని పాత్రసామగ్రి సొట్టలు పడెయ్యటం వరకూ దృశ్యాలుగా సృష్టించి తన అభిమానాన్ని నిలబెట్టుకునేందుకు ప్రయత్నిస్తుంది. ఒకప్పుడు బాగా ఆలు నివ్వటంవల్ల భర్త వెంటనే యీ దౌర్జన్యాల్ని ఎదుర్కోవటం చాలా కష్టం. శివుడంతటివాడికి గంగ నెత్తిన ఎక్కి కూర్చుని సవారీలు సాగిస్తోంది కదా!

ఇలాంటి క్లిష్టపరిస్థితిలో ఇరుక్కుని బాధపడుతూ దూసుకునే మార్గంలేదా అని కుమిలిపోతున్నాను. ఇంకోరి సహాయాన్ని అర్థించేందుకూ కూడా వీలులేని పరిస్థితి! ప్రతిసాయింత్రమూ ఊరిబైటి మైదానంలో చేరి యీ సమస్యతో బుర్ర చెడగొట్టుకుంటూండేవాణ్ణి. మార్గమేమీ కనిపించనికొద్దీ, నిరాశ ఎక్కువౌతున్నకొద్దీ ఏడుపు వొచ్చేది.

కొన్నాళ్లు గడిచాక ఒకానొక దృశ్యం నా బుర్రలో పని చేసి మెరుపల్లే కొత్తవెలుగులు ప్రసరించింది:

ఒకనాడు ముగ్గురు సాయిబులు ఒక గుర్రాన్ని తీసుకొచ్చారు. అంతవరకూ అది ఎక్కడా సేవచేసి ఉన్నట్లు తోచదు. భలే హారాం చేస్తోంది. బలిష్ఠులైన ముగ్గురూ కూడా దాన్ని స్వాధీనం చేసుకోలేక సతమత మవుతున్నారు. ఒకడు గుర్రంమీద ఎక్కాడు; అప్పటికి దానికి కళ్లెం వేసే వుంది. (అందుకోసం ఎంత అవస్థపడి ఉంటారో నేను తేలిగ్గా ఊహించుకో గలిగాను!) గుర్రానికీ, రౌతుకూకూడా మిగతా ఇద్దరూ చెరోపక్కా కాపలాగా నిలబడ్డారు. ఇప్పుడు ఎలాగైనా దాన్ని పరిగెత్తించాలి. ముగ్గురూ కలిసి దాన్ని బెత్తాలతో బాదటం మొదలుపెట్టారు. లెడ్డయినా కదలదు. దెబ్బలను ఓర్చుకోవటం ఇదివరకే నేర్చుకున్నట్లు ఉండాలి; లేదా మొండటిదెబ్బకు పరుగెత్తటం మొదలుపెడితే—తన జుట్టును (జూలును?) వాళ్ళచేతులకు అందిస్తే మరి ముక్తి ఉండదు; ఆగేందుకూడా వీల్లేదు. ఎందుకంటే ఆగగానే మళ్ళీ వా...

పడుతుంది. ఎంత మంచి గుర్రమైనా, వడిగా పరుగెత్తటం మొదలుపెడితే రౌతుకన్న ముందే అలిసిపోక తప్పదు. యీ రహస్యం ఆ గుర్రానికూడా తెలుసునని నా నమ్మకం.

చాలాసేపటివరకూ కదలకుండా వుంది. ఆ తరువాత డిఫెన్స్ లాభంలేదని తేల్చుకొని అఫెన్స్ మొదలుపెట్టింది. వెనక కాళ్లు ఎత్తి కాపలాగా ఉన్న వాళ్ళిద్దర్నీ తన్నటానికి ప్రయత్నించటమూ, పైన ఉన్నవాణ్ని ఎలాగైనా నేల మీదికి విసిరి పారేసేందుకు ఎత్తు వెయ్యటమూ అర్థమౌతూనే వుంది. దాని కాలు పొడుగుకు దూరంగా నిలబడి కింద ఉన్న వాళ్లిద్దరూ తమ మూతుల్నీ, దంతాల్నీ భద్రంగా కాపాడుకోవటమూ, ఎలాగైనా ఆ గుర్రాన్ని స్వాధీనం చేసుకునేందుకు విశ్వప్రయత్నాలు చెయ్యటమూ సాగించారు. కాళ్లు ఎత్తినప్పుడల్లా వాతలు తేలేట్టుగా దెబ్బపడుతూనే వుంది.

కొంతసేపు ఇలాగే సాగింది. తన మొండితనం లాభంలేక పోగా శరీరాన్ని చెడగొడుతోంది కనుక, తెలివిగా వీళ్ల బాధ వొదిలించుకునేందుకు, చప్పున దౌడు లంకించుకుందా గుర్రం. హఠాత్తుగా, అనుకోకుండా పరుగుతియ్యటంతో మిగతా ఇద్దరూ దాన్ని వెంబడించలేక పొయ్యారు. పోతే దానికి మిగిలిందల్లా పైన ఉన్న ఒక్కడి బాధే!

పైన ఉన్నవాడు దృఢకాయుడు. మంచి గుండెనిబ్బరం గలవాడు. ఇలాటి పొగరుబోతు గుర్రాలకు సక్రమంగా శిక్షణను ఇవ్వటంలో మంచి అనుభవం గలవాడు. అది ఏ ఉద్దేశంతో యీ విధంగా పరుగెత్తుతోందో గ్రహించేందుకు వాడికి ఎక్కువ సేపు పట్టలేదు.

నిజానికి దాని వేగానికీ, దాని తలబిరుసుతనానికీ, తన నిస్సహాయతకూ రౌతు భయపడాల్సిన పరిస్థితి. కాని ఆ సంగతి గుర్రానికి తెలిసిందో, రౌతు శవం మాత్రమే నేల కరుస్తుంది. అందుకని తెలివిగల, అనుభవశాలి అయిన రౌతు

పై ఎత్తు వేశాడు. 'నీ వేగం నాకు చాలదు' అని దానికి తెలియచెప్పేందుకు దాన్ని బెత్తంతో మరింతగా, దయా దాక్షిణ్యం లేకుండా కొట్టసాగాడు. అది మైదానాన్ని చుడుతూ పరుగెత్తుతూనే వుంది. నురుగులు కక్కే దాకా దాన్ని వొదలలేదు. అప్పటికైనా 'ఖరీదైన గుర్రం కొస్తా చస్తుందేమోనని ఊరుకొని ఉంటాడని నా సందేహం. ఇప్పటికీ దాని తలబిరుసుతనం సగానికి పైగా వొదిలి వుంటుందని తోచింది. పిల్లిలాగు వాళ్ళ వెంట నడవసాగింది!

మర్నాడు కూడా అదే విధంగా చేశారు. ఇలా వారం రోజులు వరసాగ్గా దాని వీపు వాయగొట్టేప్పటికి, బహుశా కొవ్వుతో కూడిన పాత చర్మమంతా తోడుగులు తోడుగులుగా ఊడి వుంటుంది! అది మామూలు బజారు గుర్రంగా మారిపోయింది. ఆ ముగ్గుర్లో ఎవరు ఎక్కినా కళ్లెం కదలికతో గ్రహించి సుశిక్షణతో ప్రవర్తించడం సాగించింది; లేకుంటే మళ్ళీ ఈ ఉన్న చర్మాన్నికూడా వొలుస్తారనే భయం దానికి ఘాటుగా నాటుకుంది.

ఈ దృశ్యంతో నాకు జ్ఞానోదయమైంది. ప్రేమగా లాలనగా చూడటం ఎప్పుడూ లాభంలేదు; ఎదుటి వ్యక్తి ఆ అభిమానాన్ని అసమర్థతగా లెక్కకడతాడు. మెత్తనివాణ్ని చూస్తే మొత్తబుద్ధవుతుంది; దుర్మార్గుడి జోలికి ఎవ్వరూ పోరు. కనుక దుర్మార్గాన్నీ, కఠినత్వాన్నీ అభినయించటమన్నా చెయ్యకపోతే (ఇది అభినయమని మాత్రం ప్రయోగింపబడే వ్యక్తికి తెలుస్తే మరింత హాని!) లాభంలేదు. దీన్ని బట్టి భార్య విషయంలో ఏ మాత్రం అసంతృప్తి తోచినా వీపు వాయగొట్టటం (తరువాత యూకలిప్టస్ ఆయిల్ పులమటమూ, వేడినీళ్ళ కాపు పెయ్యటమూ, బెల్లడోనా పట్టీలు అంటించటమూ, తదితర సేవలు భర్తకు తప్పవు!) ఒక్కటే యీ సమస్యా పరిష్కారానికి రహదారిగా తోచింది.

ఎదుటి వ్యక్తిని భయపెట్టగలుగుతే చాలు; ఉదాహరణకు అల్లరిపిల్లవాడికి బెత్తంతో బోధించగల పాఠాల్ని, సంగీతంతో సాధించలేము. తమకన్న ఎదుటివాడు బలవంతుడని నిరూపించాలి. (రావణుడి భార్య మండోదరి; రాముడి భార్య సీత-మొదలైన పతివ్రతలందరూ భర్తలకు భయపడి చచ్చినట్టు పడివుండి, తమకు తెలియకుండానే కీర్తిని సంపాయించగలిగారు; ఆ కీర్తినికూడా భర్తలే ప్రచారం చేసి, అందులోనే ఒక రకం తృప్తిని సృష్టించి భార్యల్ని చెప్పుకింది తేళ్ళవలె తొక్కిపట్టారు. మునిపత్నుల విషయంకూడా అంతే! భర్త శపిస్తాడేమోనని భయపడి పాతివ్రత్య ధర్మాలన్నిటినీ దేవుడో అంటూ శిరసావహించారు.) 'టెర్రరిజమ్'లో పనులన్నీ సులువుగా అవుతయ్! పైవాడి భయంలేకపోతే కిందివాడు ఏం మాట వింటాడూ?

ఈ సూత్రాన్ని వెంటనే అనుసరించాను. మాంఛి ఫేం బెత్తం కొన్నాను. ఆ నాటి నుంచీ రెండు వారాల వరకూ యమకింకరావతారం దాల్చాను. మాటకు ఎదురాడిందా వీపుమీద డయాగ్నల్‌గా ఒక్కవాత. మొదట్లో ఏడ్చేది. ఆ ఏపుడు విని (అందులోనూ కోమల కంఠమాయె! ఇరుగు పొరుగులు వొచ్చి నోట్లో గడ్డిపెడతారేమోనని (మాదొడ్డి నిండా పచ్చగడ్డి తెగ పెరిగి ఉండటం మరీ భయానకం!) భయపడే వాణ్ని. ఇది దూసుకునేందుకు ఏడుపు మొదలెట్టగానే 'ముందు ఏడుపు మాను' అని ఒక్కటి అంటించే వాణ్ని. దాంతో నోటికి తాళం... లేకుంటే మరొక్కటి. ఈ విధంగా వరసాగ్గా కొడుతూండేప్పటికి ఆమె లొంగిపోయింది; ఇష్టముండి కాదు, మరి గత్యంతరం లేక! డేరా మేకుల్లాటి రాడీల్ని ఏకులల్లే చేసేందుకు పోలీసువాళ్లు కనిపెట్టిన పరమ రహస్యమే ఇదాయె!

అంతే! ఆనాటినుంచీ ఒళ్ళు దగ్గర పెట్టుకొని (లేకుంటే

ఆ ఒంటికోసం నాలుకలు చాచి కూర్చున్న బెత్తం ఎదురుగుండానే కనిపించేట్టు మేకుకు వేళ్ళాడేశాను!) ప్రవర్తించేది. మాటకు ఎదురులేదు. కనిపించని హృదయం మాట ఎలా వున్నా, నేనంటే పడిచస్తూన్నట్టు మెలిగేది. అంతకన్న ఇంకేం కావాలి? అప్పటినుంచీ మే మిద్దరమూ చిలకా గోరింకలం! తప్పితే పిల్లీ ఎలుకా స్నేహమే నాయె!

కనుక నా సలహా ఏమిటంటే-ఒక ఫేం బెత్తమూ, పిరికి పడకుండా మర్దనాలూను. కోమలశరీరం కములు తుందని భయపడవోక! మళ్ళీ కొత్తచర్మం వొచ్చి అంతకన్న కోమలంగానూ, కాంతివంతంగానూ, ఉంటుంది. ఇలాటివన్నీ అగ్ని పరీక్షలు. ఎన్నిటికైనా ఓర్చుతూ (భార్యతోపాటు భర్త కూడాను) పోతే విముక్తి తప్పదు. తక్కువ తరగతుల జనంలో భార్యలు భర్తల పాదాల దగ్గర పడి ఉండి సేవ చేస్తారంటే ఇదే కారణం! తను ఏం చేసినా భర్త సహించగలడనే దురభిమానాన్ని (భరించేశక్తి ఉండి కాదు; ఆ ప్రేమపాశం లాగుతూండటంవల్ల!) భార్యలో పెరగనీకూడదు. దాన్ని వేళ్ళతో సహా పీకి పారేసే గొడ్డలి—ఫేం బెత్తం! యీ చిటకా ఖచ్చితంగా పనిచేసి తీరుతుంది...

ఇక ఆలోచించాల్సిం దేమీ లేదు. దారిన పడితే అదే తేలిగ్గా వుంటుంది...

—గోపాల్.

## 3

వాల్తేరు
16—12—'44

గురూజీ!

ఆరునెలల తరువాత కాని నీకు నాయీ దీర్ఘలేఖను పంపలేక పోయ్యాను. ఉత్తరమంతా చదివాక దానికి కారణాలు

నీకు తెలుస్తయ్. నీ సలహాను వెంటనే అమలులో పెట్టాను. ఎంతో తేలిగ్గా సత్వరంగా ఫలితం కనిపించిందని చెప్పేందుకు ఎంతో గర్వపడుతున్నాను. పదిరోజులకల్లా నా గడ్డుసమస్య కరిగి ప్రవాహమై అతివేగంగా ప్రవహించటమే కాక, జల పాతాలతో సహా ప్రత్యక్షమైంది.

ఆమె నన్ను మరి ఎదిరించలేదు. మా మధ్య కలహాలకూ, యీర్ష్యలకూ ఇకముందు ఎలాటి అవకాశమూ లేదు. ఇంట్లోని పాత్రసామాగ్రేమీ చెడే అవకాశంకూడా లేదు. ఆమె పాతివ్రత్య నిదర్శనం నాకూ నా మిత్రులకే కాకుండా, పురవాసులకూ, చివరకు ప్రభుత్వానికికూడా నపాళం అంటేట్టు రుజూ చేసి, నీ చిటకా అమోఘమని నిరూపించింది.

నీ ఉత్తరం అందినప్పటినుంచీ యీ నాటివరకూ జరిగిన విషయాలన్నీ పూస గుచ్చినట్టు నీకు రాస్తున్నాను. ఇందులో నీ థియురీని అప్లయ్ చెయ్యటంలో యీ శిష్యపరమాణువు తెలిసివుండి ఏ విధమైన పొరపాట్లూ చేయలేదు. 'అప్లికేషన్' విషయంలో అతి ధైర్యంగా భారతవీరుణ్ని అనే సంగతి మరచిపోకుండా జాగర్తగానే చేసుకొచ్చాను. ఒకవేళ పొరపాటేమైనా జరిగి ఉందేమో చెప్పేందుకు నీకీ ఉత్తరం రాస్తున్నాను. ఈ సవిస్తర గాధను పూర్తిగా చదివాక నీ కంతా అర్థమౌతుంది...

—నీ ఉత్తరం చదవటం పూర్తికాగానే నాలో కొత్త ఆశలు మెరిసినయ్. ఏ విధమైన సందేహాలకూ గురికాకుండా మనసును తొక్కిపట్టుకున్నాను. మరి ఆలస్యం లేకుండా వెంటనే క్రియారూపంలో పెట్టే ప్రయత్నంమీద ఫేంబెత్తం వొకటి కొన్నాను.

ఇంటికి రాగానే భార్య "ఇదెందుకూ?" అని అడిగింది; ఆమెకు చెప్పి చెయ్యటం ఎందుకైనా మంచి దనిపించింది. దాని ఉపయోగం తెలుసుకోగానే ఆమెలో వెంటనే మార్పు

వొచ్చినా రావొచ్చు; అలా వొచ్చే పక్షంలో శ్రమా, మనశ్శాంతీ ఖర్చు కాకుండానే వుంటుంది కదా! అందుకని ''నువ్వు ఎదురు తిరిగినప్పుడల్లా వీపు వాయగొట్టేందుకు! జాగ్రత్తగా నా అడుగులకు మడుగు లొత్తుతూ మసలుకోకపోతే, నిన్ను సక్రమ మార్గాన నడిపించేందుకు!'' అన్నాను. ఆమె నిర్లక్ష్యంగా నవ్వి ఊరుకుంది. ఆ నవ్వులో 'ఆపని నీచేత ఏమౌతుందిలే!' అన్న హేళన ఇమిడి వుంది. దాంతో నా పట్టుదల మరీ హెచ్చిపోయింది.

బెత్తాన్ని మొట్టమొదటిసారి బోణీగా ఉపయోగించే సందర్భంకోసం వేచి ఉన్నాను. ఎక్కువ ఆలస్యం కాకుండానే ఆ అవకాశం దొరికింది. వెంటనే నిన్ను మనసులో తలచుకున్నాను; నీ తారక మంత్రాన్ని ఒకటికి రెండుసార్లు మనసులో జపించుకున్నాను. కొత్తమేళం కావటంవల్ల చేతులూ, కాళ్ళూ కాస్త ఒణికినయ్ కాని, జాగ్రత్తగా నిలవతొక్కుకున్నాను. ఆమె సుకుమార శరీరంమీది చర్మం కాస్తా తెగిపోతుందేమోనని జాలి కలిగింది; కాని, ఇంతకన్న గత్యంతరం లేకపోవటంవల్ల నాకు నేనే ధైర్యం చెప్పుకున్నాను.

కళ్ళు మూసుకొని, ఊపిరి బిగపట్టి వీపుమీద డయాగ్నల్ గా బలంకొద్దీ మొదటిదెబ్బ వేశాను. కొత్తసిల్కు జాకెట్ కాస్తా చిరిగి వుంటుందని అనుమానం కలిగింది. పోతే కొత్తది కొనొచ్చులెమ్మని సంబాళించుకున్నాను. ఆ దెబ్బకు గిద్దెడు మిరియాలు రాల్చి ఇంటికప్పు ఎగిరేటంతగా అరుస్తుందేమోనన్నంత భయం వేసింది. కాని ఆమె కిమ్మనలేదు. మొహం మాత్రం బాధతో, ఏవగింపుతో ముడిచి ''ఏమిటండీ—మరీ చిన్నపిల్లలౌతున్నారు?'' అని ఆ బెత్తాని లాక్కొని విరిచి పారేసింది. నిజంగా ఆ దెబ్బే కనక నాకు తగిలినట్లయితే గింగుర్లెత్తేట్టు ఏడ్చేవాణ్నంటే నమ్ము!

బహుశా దెబ్బ చాల్లేదేమో ఇంకొక్కటివేసి చూద్దామను
కున్నాను. కాని చేతులోని ఆయుధం కాస్తా హతమారి
పోయె! ఇంకో బదులు ఆయుధాన్ని—ఏ సర్వీకర్రనో, ఏ
వాసాన్నో ఉపయోగిద్దామా అనిపించింది; కాని, ఆ దెబ్బతో
ప్రాణాలే పోతయ్యేమోనని భయం వేసింది. అదీకాక ఫేం
బెత్తంతో అయ్యేపనికి అంతకన్నా ప్రాణాపాయ కరమైన
ఆయుధాన్ని ఉపయోగించటం అనవసరం; అలాటి సూచన
కూడా నువ్వేమీ చెయ్యలేదాయె.

ఈ మొదటి అనుభవం అయ్యాక, దెబ్బలు వెయ్యటం
అనుకున్నంత కష్టసాధ్యమైన పనిగా తోచలేదు. నిజానికి
ఓర్చుకునే వాళ్ళుండాలే కాని, కొట్టేవాడి కేం భయం?
వీళ్ళు మనది కానంత సేపూ ఎంతవరకైనా విజృంభించవొచ్చు...

ఆమె సహనశక్తికి నాకు ఆశ్చర్యం కలిగింది. ఇలాగే
సహిస్తూ, గాంధీగారి సిద్ధాంతాన్ని అమల్లోకి పెడితే మాత్రం
—నేను నా పాలసీని వెంటనే మార్చుకొని—ఏ సత్యా
గ్రహమో (గాంధీగారి సిద్ధాంతానికి విరుగుడు గాంధీగారి
సిద్ధాంతమే కనుక!) అవలంబించాల్సి వొస్తుందేమోనన్న చింత
కూడా కలిగింది. ఇలా ఎన్ని ఫేం బెత్తాలకు సక్రమమార్గం
దొరుకేనో? ఏమైనా తెల్లారాక ఆలోచించి చూద్దాం లెమ్మని
పించింది...ఇక ఆరాత్రికి ఏకశయ్యా వాసమని వేరే
చెప్పాలా?

ఒకటి పోయినా ఇంకోటి ఉంటుందనే నమ్మకంతో
మర్నాడు నాలుగు బెత్తాలు కొనుక్కొచ్చాను. మొదటిదెబ్బ
పడ్డప్పటినుంచీ ఆమె నాతో ఎడమొగం పెడమొగంగానే
ఉంటోంది. ఇంత మాత్రానికే లెక్కచేస్తే మరి ముందుకు
సాగటం కష్టమని నేనేమీ పట్టించుకోలేదు. ఆమె కన్న
ఎక్కువగానే మూతి ముడుచుకున్నాను.

మధ్యాహ్నం పన్నెండయినా భోజనానికి పిలుపు రాలేదు.

అసలు పొయిలోని పిల్లి లేచిందా, లేదా అనే అనుమానం కూడా కలిగింది. పోయి చూద్దామనిపించింది. కాని ఆ వంట సెక్షన్ నాది కాదు కనుక, ఇంతరకూ ఓర్చి ఊరుకున్నాను. కడుపులోని ఆత్మారాముడి పోరు పడలేక వంటింటి వైపు వెళ్ళక తప్పలేదు. ఆమె వంటింటి తలుపు బార్లా తెరిచి, చల్లగాలి పీలుస్తూ నులకమంచంమీద శయనించి వుంది. వంటింటిలోని ఒకభాగం శయ్యాగృహం చేసుకుందన్నమాట! ఇక రెండోవైపు అంతకుముందే భోం చేసిన కంచమూ, ఖాళీ అంట్లగిన్నెలూ సిద్ధంగా ఉన్నయ్. దీన్నిపట్టి నేను గ్రహించిందేమంటే—ఆమె తన భాగం వరకే వొండుకు తిని, అలసటను తీర్చుకుంటూ విశ్రమించిందని; భాగాలుపడ్డ సోదరుల వ్యవహారాన్ని జ్ఞాపకం చేసింది ఆ దృశ్యం.

"వంట చెయ్యలేదా?" అని గద్దించాను. ఆమె మాటాడలేదు. చలిగాలి వీస్తూంటే ముడుచుకున్నట్టు మరింత ముడుచుకొని పడుకుంది.

"అడిగేది నిన్నే!" అన్నాను.

"మీ ప్రశ్నలకు జవాబులు చెప్పాల్సిన అవసరం నాకు లేదు. మీకు వంటచేసి పెట్టాల్సిన బాధ్యత నాకు అంతకన్నా లేదు" అంది.

దాంతో నాకు మండిపోయింది. ఇదే ఇంకే సందర్భంలోనైనా అయితే వెంటనే పుట్టింటికి పంపేసేవాణ్ణి. (ఆ తరువాత ఆమె వెనకనే నేను పరుగెత్తటంమాట అటుంచు!) కాని ఇప్పుడు ఆ పని చెయ్యటం మన శక్తిహీనతను నిరూపించటమే కాక, చేయదలచిన ఎక్స్పరిమెంటుకూడా పూర్తికాదు కనుక, ఆ ఆలోచనకు మరి తావు లేకపోయింది. పోతే కాళ్లావేళ్ళాపడి సంధి షరతులు మాట్లాడుకుందామా అనే ఆలోచన తట్టింది కాని, వెంటనే గురూపదేశం జ్ఞాపకానికి వొచ్చింది. సాయిబులూ, గుర్రమూ-దాని వీపు వంగ తెయ్యటమూ

—చివరకు ఆ పెద్ద మైదానం మీద, దానివీపు మీదనే ఎక్కి ఆనందంగా సవారీలు తియ్యటమూ యీ దృశ్యం కళ్ళ ముందు ప్రత్యక్షమైంది. యిక పట్టిన పట్టును వీడ దలచలేదు. అందులోనూ ఒక్కపూటకే నా ధైర్యసాహసాలు నీళ్ళు కారి పొయ్యేందుకూడా నా మనసు ఒప్పుకోవటంలేదు. అన్నిటి కన్నా-నేను సంపాయించింది (నా స్వంత సంపాదన యేమీ లేకపోయినా, మా పూర్వీకులు బేవార్సు ఆస్తి ఉండనే వుంది; అదంతా ప్రస్తుతం నా స్వాధీనంలోనే వున్నది; దాని పన్నులన్నీ నేనే కడుతున్నాను కనుక, 'నా ఆస్తి' అనే అంటున్నాను) తింటూ పడి ఉండాల్సిన నా ఇల్లాలు, ఇలా ఎదురు తిరగటాన్ని బొత్తిగా భరించలేక పొయ్యాను. ఆక లేమో దహించుకు పోతోంది. ఇక లాభంలేదని మెల్లిగా శివం ఎక్కించుకున్నాను. 'జై సద్గురూ!' అనుకొని హృద యాన్ని ప్రజ్వరిల్లజేశాను. మరేమీ ఆలస్యం లేకుండా షేం బెత్తానికి పనిపెట్టాను.

నాలుగైదు దెబ్బల వరకూ ఆమె ఓర్చుకుంది. ఆమె ఓర్చు కోవటం నాకు ఓటమిగా తోచింది. దెబ్బలు మరీ బలంగా వేయ సాగాను; నువ్వు చెప్పినట్టు కొత్త చర్మం రావాలి కదా! దానికిముందు పాత చర్మం వూదిలేందుకు యింకా చాలా వ్యవధి ఉండనే వుంది.

ఆరో దెబ్బకు ఆమె పెద్దగా యింటికప్పు ఎగిరిపొయ్యేట్టు ఒక్క పెద్దకేక వేసింది. ఆ అరుపుకు నేనే ఉలిక్కిపడి భయ పడ్డాను. వెంటనే మరీ పెద్దగా ఏడవటం మొదలుపెట్టింది. ఇక యీ పాడు పని ఆపుదామా అనిపించింది. ఎందుకంటే నలుగురు పెద్దమనుషులూ జేరి, నానా చివాట్లూ వేస్తారేమో ననీ, ఇంత గడ్డి నోట్లో పెట్టేందుకూడా సాహసిస్తారేమో ననీ (మీ దొడ్లోకన్నా మా దొడ్లోనే ఒత్తుగా ఎక్కువ మేర వరకూ పచ్చగడ్డి పెరిగి ఎప్పుడూ అందుబాటులో సిద్ధంగా

వుంటుంది; దీనికి గొప్ప తార్కాణం ఏమిటంటే-ఏమరపాటున దొడ్డితలుపు గడియ వెయ్యకపోతే చాలు, మా దొడ్లో ప్రవేశించినన్ని-దొడ్డికూడా చాలా పెద్దది కనుక-పశువులు ఇంకెవరి దొడ్లోనూ ప్రవేశించవు; ప్రవేశించలేవు కూడాను) కుటుంబ గౌరవం బజారు పాలౌతుందేమోననీ భయపడ్డాను...కాని నీ అనుభవం—పడవకు చుక్కానల్లే నన్ను కాపాడుతూనే వుంది—

"ముందు నోరుముయ్!" అని ఒక్కటి అంటించాను.

ఆమె నోరు ముయ్యలేదు సరికదా, వీలున్నంతవరకూ నోటిని తెరచి, శృతి యింకా హెచ్చించి ఏడవసాగింది. దీని గాత్రం ఇంత ఉచ్ఛస్థాయిలో పలుకుతుందని నాకు ఇంతకు ముందు తెలియదు.

ఆ ఏడుపుకూడా మామూలుగా ఉంటే ఫర్వాలేదు. ఎవరైనా వొచ్చినా 'తేలుకుట్టిందిలెండి!' అని బైటివాళ్ళను బైటినుంచే పంపేసే ఏర్పాటు చేసేవాణ్ని, కాని 'నన్ను చంపేస్తున్నాడర్రోయ్!' అనీ, 'నా ప్రాణాలు తోడేస్తున్నాడర్రోయ్!' అనీ ఆమె పెద్దగా అరుస్తూ జుట్టు పీక్కుంటూ, చేతికందిన సామాగ్రితో చెయ్యగలిగినంత చప్పుడుచేస్తూ, ఎగిరెగిరి పడుతూ భూకంపం పుట్టినంత హడావిడి చేస్తూంటే నాకు ముచ్చెమటలు పోసినయ్. ఆమె చేసే శబ్దం—దృశ్యం చూడని వాళ్ళకు మాత్రం—ఆమె కంఠ స్వరాన్ని విని అర్థం చేసుకునే బైటి ప్రేక్షక మహాశయులకు-నేనేమో ఆమెను కొట్టి చంపుతున్నాననే భావం కలగజేస్తుంది. నేను నిజంగా కొట్టని ఆ దెబ్బల చప్పుడు ఇతరుల హృదయాల్లో కలిగించే నా క్రౌర్యాన్ని ఎదుర్కోవటం నాకు మించిన పని!

ఇప్పటికే నలుగు రైదుగురు వీధి వాకిట్లో గుమికూడి నాకు వినిపించేట్టే మాట్లాడుతున్నారు. నా చేత తలుపు ఎట్లా తీయించాలనీ, నన్ను ఏ విధంగా మందలించాలా అనీ వాళ్ళ

ఆలోచనలు.

మొదటి బెత్తం విరిగిపోయింది. ఇక రెండో బెత్తానికి పని పెడదామని వుంది కాని, విషయాన్ని సింహావలోకనం చేసుకునేప్పటికి నాకు చేతు లాడలేదు. బైటి జనం గుమిగూడేట్టున్నారు. ఇలాంటి సందర్భాల్లో పిలవని పేరంటగా వొచ్చి తీర్పు చెప్పేందుకు యీ సంఘసభ్యులు ఎల్లవేళలా సిద్ధమే కదా! 'నా భార్య విషయం నీకు అనవసరం!' అనే మొండి జవాబును నాలాటి చదువుకున్నవాడు ఇవ్వటం మోటుతనాన్ని సూచిస్తుంది; దాన్ని ఎవ్వరూ భరించలేరు. వీళ్ళందరి విషయమూ ఎలా వున్నా చివరకు ప్రభుత్వంకూడా దీన్ని ఒప్పుకోదు సరికదా 'సింపిల్ ఇంజరీ,' కింద కేసు బనాయించినా బనాయించవొచ్చు.

ఈ పరిస్థితంతా చూస్తే నాకు తత్తర పుట్టింది. బైట జనం జేరుతున్నారనే సంగతి తెలుసుకున్నకొద్దీ ఆమె ఇంకా ఉధృతంగా ఏడవసాగింది. ఈ మధ్యవర్తుల ఎదుట నిజకథనమంతా చెప్తే తీర్పు ఆమె పక్షమే అవుతుందని నాకు గట్టిగా తెలుసు. అసలు నా కల్మషాత్మ ఘోషకే నేను తట్టుకోలేకుండా వున్నాను...ఇంకొక్క క్షణంకూడా ఆ ప్రదేశంలో నిలవలేక ఊడిపోయే పంచను బిగించి కట్టుకొని, వీధి వాకిట వెళ్తే బైటి గుంపు అడ్డం తగులుతుందేమోనన్న భయంతో—దొడ్డివాకిలిగుండా విల్లును విడిచిన అంబులాగు ఉడాయించాను.

ఆ భయోత్పాతంలో ఏ దారో కూడా తెలుసుకోకుండా చాలాదూరం నడిచాను; నిర్జనమైన నదివొడ్డు జేరాక గుండె దడ కొంచెం తగ్గింది. అక్కడ మర్రిచెట్టుకింద స్థిమితంగా చతికిలపడగానే, యింతసేపూ భయం చాటున మరుగుపడ్డ ఆకలి బాధ, ఆ భయం జారుతూన్నకొద్దీ తీవ్రరూపం దాల్చసాగింది. పర్స్ యింటిదగ్గిరే వొదిలి రావటంవల్ల మరీ ఇబ్బం

దయింది. నిజానికి పై పంచకూడా తీసుకోకుండానే ఉన్న వాణ్ని ఉన్నట్టుగా పరుగెత్తుకు వొచ్చినాయె!

ఇక్కణ్నుంచి అడ్డదోవను రెండుమైళ్ళు నడుస్తే నాకు కొంచెం అప్పుప్పుట్టే తావు లున్నయ్. ఆకలి బాధకు తట్టుకో లేక, ఎవరైనా చూసిపోతారేమోనని భయాన్ని కూడా తొక్కిపట్టి అక్కడికి వెళ్ళేందుకే నిశ్చయించుకున్నాను. 'అత్యవసరం' అనేది మాకు చాతకానివీ, యిష్టంలేనివీ-ఎన్ని పనులో గాలి పీల్చినంత తేలికగా మనచేత చేయించగలదనే విషయాన్ని రూఢిగా తెలుసుకున్నాను.

దారిలో పొరపాటున ఎవరైనా ఎరిగివున్న వ్యక్తి ఎదురైతే పలకరిస్తాడేమోననీ, ఒకవేళ నేను చేసిన నేరం వాడికి తెలిస్తే దాన్ని గూర్చి ప్రస్తావిస్తే మొహం ఇంకా చిన్నబుచ్చుకోవాల్సి వుంటుందనీ-ఇలాటి భయపెట్టే భావాలు తల ఎత్తుకొని నడిచే వేగాన్ని నాలోనుంచి దూరం చేసినయ్. దారిపొడుగూనా అందరూ నావైపే చూస్తున్నట్టూ, లేక నన్ను గూర్చే ఆలోచిస్తూన్నట్టూ తోచటంలో ఆశ్చర్యమేమీ లేదు...ఏదైనా భరించక తప్పదు కదా!

కాఫీ తాగి కాళ్ళీడ్చుకుంటూ ఎలాగో నదివొడ్డు జేరాను. ఎండాకాలం కావటంవల్ల నదంతా ఎండిపోయి వుంది. ఆ ఎర్రని ఇసుకను చూస్తూ, ప్రచండభానుని వేడి కిరణాల తాకిడి నుంచి, ఇప్పటికే బాగా వేడెక్కిన బుర్రను కాపాడుకుంటూ, ముసలి మర్రిచెట్టు నీడలో విశ్రమించాను. అప్పుడప్పుడు ఆకాశంలో వేగంగా ఎగిరిపొయ్యే పక్షుల్ని చూస్తూ, ఒంటరిగా ఎంతసేపని కాలం గడిపేది? ఏ పార్కుకన్నా, ఏ క్లబ్‌కన్నా పోతే కొంత కాలక్షేపం జరుగుతుందనే ఆలోచన తోచింది కాని, జనసమ్మర్ద ప్రదేశా లేవీ నా మనశ్శాంతిని కాపాడేవిగా తోచలేదు.

క్షణాల్ని లెక్క పెట్టుకుంటూ పరిస్థితినంతా మళ్ళీ మళ్ళీ

సూక్ష్మంగా విమర్శించుకో సాగాను. నాకు నేనై ఎంత ధైర్యం చెప్పుకుంటున్నా లోపలి బెరుకు తగ్గే సూచన లేమీ కనిపించటం లేదు.

చీకటి పడ్డది. ఆ కటిక చీకట్లోకి చూస్తూంటే...నల్లని ఆత్మ పడే బాధకు తోడు, నల్లని చీకటికూడా తోడై నన్ను మరీ బాధపెట్ట సాగింది. ఇలాగే బాధపడుతూ ఇంకాస్సేపు ఆగి ఇంటికి మళ్ళటం ఎందుకైనా మంచిదనే సమాధానంతో తృప్తిపడుతూ, ఆకాశంలో మెరిసే నక్షత్రాలు మాత్రమే తోడుగా కూర్చున్నాను.

ఇలాగే ప్రతిరోజూ యీ వటవృక్షచ్ఛాయ ఒక్కటే యీ విశాల విశ్వంలో నాకు నివాసయోగ్యమైన స్థలం కనుక ఐనట్టయితే జీవితం మరీ దుర్భరమైపోతుంది. పోనీ కొన్నాళ్ళ పాటు ఏ దేశాంతరమన్నా పారిపోతే యీ బాధ కొంత వరకూ తగ్గుతుందేమో ననిపించింది కాని, మళ్ళీ ఇంటికి తిరిగి రాగానే యీ భార్య నా కోసం వేచి ఉండటమూ, మళ్ళీ నా మామూలు సమస్యే నన్ను ఎదుర్కోవటమూ తప్పదు. అప్పటికైనా ఇప్పుడు వొదిలిన మార్గమే మళ్ళీ శరణ్యమౌతుంది. కనుక ఎప్పుడో అప్పుడు యీ ఎక్స్‌పరిమెంటును చివరిదాకా ప్రయత్నించి చూడవలసిన బాధ్యత నా తలమీద ఉండనే వుంది. ఆ 'ఎప్పుడో అప్పుడు' 'ఇప్పుడే' కావటం ఒక విధంగా మంచిదే! యీ ఊపులోనే తుదిదాకా సాగిపోవటం తేలిక. మధ్య మధ్య నట్టుపడుతూంటే ఆ కుంటి నడక అసలే కుదిరి చావదు.

ఇంకో విశేషం ఏమిటంటే-యీ విషయంలో ఆలోచనా, ముందు వెనకలూ అసలే కూడదు. ఆలోచించటం వల్ల మన శాంతినీ, ధైర్యాన్నీ కోల్పోవెయ్య ప్రమాదం వుంది. కనుక రాయి చేసుకున్న గుండెతో ఎదుర్కొని తీరాల్సిన గడ్డు సమస్య ఇది! శేష జీవితానందాన్నంతట్నీ పొట్టలో పెట్టు

కొని బెదిరించే పరిస్థితి! ఇక్కడ మాత్రం ఏ మాత్రం తొణి కినా ఆశ లేమీ లేని సుడిగుండాల్లో పడటం తప్పదు. ఇక్కడి దాకా వొచ్చి, ఆగినట్టయితే, ఆమె దృష్టిలో నా స్థానం ఇంకా కిందికి దిగజారుతుంది. పూర్వంకన్నా లోకువై పోతాను. ఆమె నా మీద సవారీలు తీసే అవకాశాన్ని శాశ్వ తంగా సృష్టించినట్టే!

ఇక్కడ నాకు ఇంకా అనేక కొత్త విషయాలు తట్టినయ్! ఎవరో ఆంగ్ల కవి 'స్త్రీలూ, కుక్కలూ కొట్టినకొద్దీ మంచిదారి పడతాయి' అన్నాడు. ఇది అక్షరాలా నిజమై ఉంటుంది. కుక్కల జోలికి నే నింతవరకూ పోలేదు; ఎందుకంటే ఒక రకం బజారు కుక్కల్ని చూస్తే నాకు చీదర, పరమ అసహ్యం. బాగా నున్నగా పెరిగిన పెంపుడు కుక్కల్ని చూస్తే అవి కరుస్తయ్యేమోనని భయం; కరిచినా కరవక పోయినా గొంతెత్తి మొరుగుతేనే, ఫర్లాంగుదూరం పరుగెత్తే అలవాటు, చిన్నతనంనుంచీ నాకు అలవడ్డది. వాటిని కొట్టటంవల్ల బహుశా అవి మాలిమి అయి యజమాని కాళ్ళు నాకుతూ పడి ఉంటయ్యని ఇప్పుడు గుర్తుకొస్తోంది; లోగడ నిజానికి ఆ కుక్కల్ని ఆ యజమానులు ఎలా లొంగతీసుకొని ఉంటారో నేను చూడలేదు కాని, అది మాత్రం పెంపుడుకుక్కగా ఉంటూ, వాళ్ళ ఆజ్ఞల్ని శిరసావహిస్తూండటం నేను అనేక సార్లు చూశాను. ఇక స్త్రీల విషయం—నీ అనుభవాన్ని బట్టి చూస్తే. ఆంగ్లకవి వాక్కు కాచి వడబోసిన సత్యమనేది రూఢి అయింది. మొత్తం స్త్రీ జాతికంతకూ దీన్ని అప్లయ్ చేయ వొచ్చునో, లేక కొంత మందికే చెయ్యావొచ్చునో నాకైతే తెలియదు. అసలు అప్లయ్‌చేసి ఆ ఫలితాల్ని చూసేదాకా ఎవరికీ తెలిసే అవకాశం ఉండదు. కనుక, నేను ఇంకా

ధైర్యంతో అనుకూల ఫలితాల్ని ఆశిస్తూనే సాగిపోవాల్సి వుంటుంది.

అడివిలో స్వేచ్ఛగా విశ్వవిహారం చేసే పెద్దపులినో, సింహాన్నో, సివంగినో, ఏనుగునో పట్టుకొచ్చాక, దాన్ని తమ చిత్తానుసారంగా ఆడించే సర్కస్ వాళ్ళు వెంటనే జ్ఞాపకానికి వొచ్చారు. ఆ ఎలక్ట్రిక్ కర్రా, పిస్టలూ, వాడితేలిన లోహపు ముల్లూ, అంకుశమూ ఇలాటివి లేకపోతే వాటిని మాలిమి చెయ్యటం వాళ్ళ తరం కాదు. చెప్పిన మాట వినకపోతే ప్రాణాలమీది ఆశ మరి ఉండదనే విషయాన్ని చిన్న చిన్న డోసుల్లో వాటికి బాగా అర్ధమయ్యేట్టు చేస్తారు. మనుష్య భాష తెలియని, కనీసం మానవ సమాజపు తాకిడినన్నా చవి చూడని (అడివిలో అదృష్టవశాత్తూ నిరాయుధులైన బాటసారుల రక్తమాంసాల్ని ఎప్పుడైనా చవిచూసి వున్నా, వాళ్ళు తమ రక్తనాళల్లో శాశ్వతంగా జీర్ణించి పోయినప్పటికీ, వాళ్ళ సామాజిక నిబంధనల్లో కానీ, సంస్కారంలో కానీ, ఒక భాగంకూడా వాటికి అర్ధమై ఉండదు. వాటికి తెలిసిందల్లా ఆ రక్తమాంసాల రుచి మాత్రమే!) వన్య మృగాలకు, తమ మనస్సును, సౌజ్ఞల ద్వారా, దెబ్బల ద్వారా అర్ధమయ్యేట్టు చెప్తూ వాటిచేత పురజనుల (కనీసం టిక్కెట్లు కొన్న, లేక బేవార్సుగా చూడటానికి వొచ్చిన ప్రేక్షక మహాజనాల) చిత్తాలు రంజిల్లేట్లు పనులు చేయిస్తున్నారు.

ఆ మృగాలకు ప్రకృతి సంపాదించిన వాడిగల ఆయుధాలున్నాయి. వాటి సహాయంతో అవి ఇతర జంతుసమూహాల నుంచి తమను తాము కాపాడుకోవటమే కాకుండా, తమ ఆహారాన్ని కూడా సంపాయించుకో గలుగుతుండేవి; వాటి ఆయుధాలు ఇతర జంతువుల్ని, అదృష్టవశాత్తూ చిక్కిన మనుషుల్ని చంపటానికే కాకుండా, వాటికి నూపున్సగానూ,

ఘోర్ కృన్నగా కూడా ఉపయోగ పడుతూన్నవి. స్వేచ్ఛా వాయువుల్ని పీలుస్తూ మసించివున్న వాటిని లోబరుచు కోవటం మాటలు కాదు: ఎన్నో అవస్థలుపడితేనే కాని, వాటి కళ్ళ ఎదుట రివాల్వర్ దెబ్బ ప్రభావాన్ని నిరూపిస్తేనే (అంటే ఇంకో జంతువును చంపుతేనో, లేక ఆ జంతువునే ఏ కాళ్ళమీదనో కాల్చి గాయపరుస్తేనో) కాని అవ్వి ఆ ఆయుధానికి భయపడవు; ఇది చిన్నపిల్లవాడు వేలుకాల్చుకొని స్వానుభవంమీద నిప్పు గుణం తెలుసుకున్నట్టు!

వన్యమృగాల్ని ఆడించేవాడికూడా భయం లేకపోలేదు. బలిష్ఠమైన పంజాదెబ్బ ఒక్కటే వాడి ప్రాణానికి చాలు. ఐతే శిక్షకుడు భయపడుతూన్నట్టు మాత్రం దానికి తెలియ కూడదు. తెలుస్తే మాత్రం వాడు దాని పొట్టలో స్థిరనివా సాన్ని ఏర్పరచుకోవాల్సిందే! అందుకని, లేని భీకరరూపాన్ని దాల్చి, లోని బెరుకుతనాన్ని రంగుమార్చి పైకిమాత్రం ధైర్య సాహసాలుగా సూచిస్తూ దాన్ని లొంగదీసుకుంటాడు. ఆడించే వాడికి వన్యమృగాన్ని చూస్తే ఎంతభయమో, వన్య మృగానికి ఆడించేవాణ్ని చూసినా అంతే భయం ఉంటుంది. కాని మానవుడు జంతువుకన్న తెలివిగలవాడు కనుక, జంతువే మానవుణ్ని చూసి భయపడి తీరాల్సిన పరిస్థితిని సృష్టించ గలుగుతున్నాడు.

దీనికిముందు ఆ జంతువును అనేక శారీరక బాధలకు గురి చేస్తాడు. మొదటి నెలల్లా రేషన్ ఆహారం (పూర్తిగా చావ కుండా, బతికి ఉండేందుకు మాత్రమే సరిపడే ఆహారాన్ని) ఇస్తూ, దాని మదమంతా కరిగేట్టు చేస్తారు. తరువాత చిన్న చిన్న డోసుల నల్లమందు ఆహారంలో కలిపి ఇస్తూ (పెద్ద డోసులు అలవాటు చెయ్యటం అంత శ్రేయస్కరం కాదు. ఎందుకంటే నల్లమందు చౌకబారు వస్తువు కాదు. పెద్ద డోసు లకు అలవాటైతే దాని జీవితాంతంవరకూ ఆ వ్యసనాన్ని,

వ్యయాన్ని భరించటం మాటలు కాదు. రెండోది పెద్దదోసు పడితే అసలుకే మోసంవచ్చి మత్తుగా పడిఉంటే దానివల్ల జరగాల్సిన పనులన్నీ ఆగిపోతవి. ఇంకోటి: ఆ విషమంతా దాని జీర్ణకోశంలోకిపోయి, దాని జీవిత పరిమితినికూడా తగ్గించవొచ్చు కూడాను) దాని ఉత్సాహాన్ని బాగా తగ్గించి పారేస్తుంది. యీ విధంగా దాన్ని నానా హింసలూ పెడితేనే కాని అది లొంగదు. తెలిసివుండీ ఎవరి స్వాతంత్ర్యాన్ని ఎవరు వొదులుకుంటారూ? చివరకు కుక్క కూడా ఎదురు తిరుగుతుంది. ఎప్పుడు లొంగుతుందంటే—ఇక ఆ స్వాతంత్ర్యాన్ని కాపాడుకోవటం తన శక్తికి మించిన పని అని దానికి తోచినప్పుడు.

చివరకు వీళ్ళతో విరోధం వూనటం తన తలను కొరివితో గోక్కున్నట్టేననే నిశ్చితాభిప్రాయం వన్యమృగానికి కలిగి తీరుతుంది. తన నివాసం చిన్నదైనా మహా గట్టిది. తన శక్తితో బైట పడే అవకాశం అసలే లేదు. తనను ఆడించే రంగస్థలం చుట్టూ ఎత్తైన కటకటాలు; బలహీనమైన శరీరాన్ని మోసుకుంటూ, మత్తు పదార్థంతో సగం ఉత్సాహం చచ్చి, తన స్వేచ్ఛ అంతా పోయిందేనన్న దిగులుతో కుంగి కృశించి పోయిన తను—చిక్కి శల్యమైన ఆ దేహాన్ని అంత ఎత్తుకు లేపటం తన వశం కాదు. ఒకవేళ అలాటి ప్రయత్నం చేస్తే మాత్రం ముళ్ళకర్ర తన పనిని సాగిస్తుంది. ఆ ప్రయత్నం మరీగట్టిదని నిరూపించిందా—రివాల్వర్ కు పని కలిగి తీరుతుంది. అందుకని, బతికుంటే బలుసాకే చాలనే అభిప్రాయంతో ఒళ్ళు దగ్గర పెట్టుకొని పనులన్నీ సక్రమంగా చేసి తన బాధ్యతను తీర్చుకుంటుంది. అప్పుడప్పుడు తను గోండ్రుపెట్టాలి. అది తను ఎదురు తిరిగే సూచనగా మాత్రం కాదు. పురజనుల్ని రంజింపజేసేందుకూ, తను చిన్నరకం జీబ్రా కానీ, ఇతర గళ్ళ జంతువు కానీ కాదనీ, పులే ననీ

నిరూపించేందుకు మాత్రమే!

యీ విధంగా మొదట పూనిన విరోధంతో విసుగెత్తి, ఇక ఏదోవిధంగా సరిపెట్టుకోవటంకన్న మరి మార్గం లేదనే నిశ్చయానికి వొచ్చి—స్నేహంగానే జీవితాన్ని సాగించేందుకు అలవాటై తీరుతుంది. యిదే విరోధంతో స్నేహాన్ని సంపాయించే మార్గం!

నా తలపులన్నీ సక్రమమార్గంలో సకారణమైన వాద ప్రతివాదాల్లో యీ రకంగా సాగినయ్. యిందులో సర్కసు వాడికీ వన్యమృగానికీ మధ్య వున్న సంబంధం లాటిదే—నాకూ, నాభార్యకూ మధ్యవున్న సంబంధం! నేను భార్యను మచ్చిక చేసుకునేందుకు లేని కాఠిన్యాన్ని ప్రదర్శిస్తూ, ఆమెను నానాహింసలూ పెడుతూ—చివరకు, విరోధం లాభంలేదనీ, స్నేహం ఒక్కటే యిద్దరికీ క్షేమకరమనే అభిప్రాయానికి లొంగిపోయేటట్టు చెయ్యటం నా విధి. దాని కోసమే సర్కసువాళ్ళు ఉపయోగించే టంత మోటు ఆయుధాల్ని ఉపయోగించకుండా (ఎందుకంటే అది క్రూరమైన అడవి జంతువూ: ఇది విజ్ఞానవతియైన, మనిషైన-భార్యానాయె!) సున్నితమైన ఆయుధం—అంటే ఫేంబెత్తంతోనే ముగించాల్సివొచ్చింది. అదీకాక అడవి జంతువు చర్మం మహా గట్టిది. ప్రకృతిని మొండి [illegible]లతోనూ. ప్రకృతి[illegible] నుంచి తనను తాను కాపా[illegible] కలిగిన నివాసస్థలం [illegible] డానూ ఎదుర్కొనేందు[illegible] అలవాటుపడి ఉండటంవల్ల [illegible] ఫేం బెత్తాలూ, చివర[illegible] [illegible]క్రలుకూడా పనిచెయ్య[illegible]. మహా వాడి అయిన, [illegible]నికే ఎసరయ్యేలాటి ఆయుధాలొకటే వాటికి తగినవి.



ఇక ఇక్కడ స్త్రీ వి[illegible] అన్నిటిలోనూ అందమైన, కోమలమైన, యువతి-అర్ధా[illegible] [illegible]ను భూతిలో (నేను ఆమెను అమిత[illegible]యూ, ఆ

సంగతి నాకు రూఢిగా తెలియటమూ మరీ విషాదం!) ప్రవర్తించేందుకు ఫేం బెత్తమే చాలు. ఆమె నిరాయుధురాలు. కత్తిపీటా, గిన్నెలూ, భగోణీలు, రుబ్బుడు పాత్రమూ, పచ్చడి బండా, గరిటెలూ, అట్లకాడలూ మొదలైన వంటఇంటి సామగ్రి ఉన్నా; వాటిని ఆయుధాలుగా ఉపయోగించే విధానం ఆమెకు తెలియదన్న సంగతి నాకు రూఢిగా తెలుసు. ఆమె సత్యభామ శిష్యురాలన్నా కాదుగా! కాని, సమయం వొస్తే ఆత్మరక్షణార్థం తట్టే ఉపాయాల్లో - యీ వస్తు సంచయం కళ్ళ ఎదుట కనిపిస్తూంటుంది కనుక, వెంటనే వాటిని అవసరంకొద్దీ ఉపయోగించినా ఉపయోగించవచ్చు. ఉపయోగించాల్సిన విధానం పరిపూర్ణంగా తెలియకపోయినా, ఏదో విధంగా ఉపయోగించినా, చేతికొచ్చిన రీతిగా విసిరి వేసినా, వాడిగా, బరువుగా ఉంటాయ్ కనుక, గుద్దేటుగా తగిలినా ప్రాణక్షయం తప్పదు. వెధవ ఫేం బెత్తం వాటి ముందు దమ్మిడీకీ, తోలికి కూడా పనికిరాదు.

కనుక ఇక్కడ కొంత మెలకువతో ప్రవర్తించాలి. ఆ రకం ఆయుధాల్ని ఉపయోగించే అవకాశం ఆమెకు ఎంత వుందో, నాకూ అంతే వుంది (వాటి దైనందినావసరాల జోలికి నే నెప్పుడూ పోకపోయినా ఫర్వాలేదు) నిపుణత ఇద్దరికీ లేదు. ఎందుకైనా మంచిది—ఆ ఆయుధాలు అందుబాటులో లేని తావుల్లో—అంటే వంటింట్లో కాకుండా ఏ సావిట్లోనో, ఏ పడకగదిలోనో ఏ దొడ్లోనో యీ దృశ్యాన్ని సృష్టించటం ఉభయులకూ-కనీసం నాకు—శ్రేయస్కరం. అక్కడ మాత్రం ఇంకోరకం ఆయుధాలు లేవా అనే సంశయం లేకపోలేదు. అక్కడ అద్దాల్లో బిగించిన ఫొటోలూ, ఇతర చిత్రాలూ ఎగరవొచ్చు. తేలికైన లోహపు ట్రంకులు పైకి లేవవొచ్చు (ఎక్కడ పడుతుం దనేది వేరే సంగతి) బరువైన తాళాలూ, కిరసనాయిల్ సీసాలూ, సువాసన

నూనెబుడ్లూ, లాంతర్లూ మొదలైనవి ఉంటయ్ కనుక — వాటిని కూడా ఒక రకం ఆయుధాలుగా లెక్కకట్టవలసిందే! ఇలా ఆలోచిస్తే, ఆయుధం అనే పదానికి అర్థం తియ్యటం మొదలుపెడితే—అవి లేనిచోటే లేదు. చివరకు రోడ్డుమీది కంకర్రాళ్ళు కూడా ఆయుధాలే కదా! కనుక యీ ప్రమాదం ఎక్కడైనా ఉండనే వుంది.

పోతే మిగిలిన మార్గం ఏమిటంటే—ఎదుటి వ్యక్తికి అసలు ఆయుధాలమీదికి దృష్టిపోకుండా చూసుకోవటమే! అంటే దెబ్బల బాధలో అవన్నీ తోచకుండా చెయ్యటం. ఏదెలా వున్నా నేను పురుషుణ్ని; అంటే సబలుణ్ని; ఆమె అబల! ఒకవేళ హిందూ ధర్మాలకు కట్టుబడి భార్యాత్వాన్ని మోస్తూన్న ఆమె ఎదురు తిరిగినా, ఆ తిరుగుబాటును బలంగా అణిచే శక్తి నాకు ఉన్నదని గట్టినమ్మకం; నా నమ్మకం మాట అటుంచి, ఆ సంగతి నాకన్నా ఆమెకే బాగా తెలుసు. దెబ్బలు తినే కుర్రాడు కొట్టేవాడికి ఎదురు తిరక్కపోవటంలో గల రహస్యం ఇలాటిదే! తన హీనతమీది (Inferiority Complex) నమ్మకం. కాని ఆ దెబ్బలే మరీ ఎక్కువైతే వాటికి అలవాటు పడటమే కాక, తల వాచి, మొండిగా మారి ఎదురు తిరిగే పరిస్థితి రావొచ్చు. చర్మం మాటిమాటికీ ఊడటం మాని, బండబారి పోతుంది. అప్పుడీ ప్రక్రియ మరి లాభం లేదు. ఏదైనా అతిగా పోతే ప్రమాదం తప్పదు. 'Too much is nonsense' అని ఉండనే వుంది, కనుక, ఎంతకైనా చిన్న డోసుల్లో చర్మం వొలవటమే సక్రమమైన మార్గం.

ఇంకో విశేషం ఏమిటంటే—ఇది ఇలా జరుగుతే ఫలితం ఇలా ఉంటుందనేది జంతువుకన్నా మానవులకే బాగా తెలుసు. అందులోనూ పదిహేడేళ్ళ జీవితాన్ని చూచిన వ్యక్తికి ఆ అనుభవం వృధా పోదు. జంతువుకన్న తెలివిగా,

జాగ్రత్తగా ఆలోచించగల ఆమెకు—ఫేం బెత్తం గాలిలోకి పైకి లేవటం చూసేప్పటికే, అది కోపంతో బలంగా శరీరం మీదికి దూకుతే అది తాకినంత మేరా, సుకుమారమైన చర్మం కములుతుందనీ, (అప్పటి కప్పుడే వూడి రాకపోయినా) వాత తేలుతుందనీ బొబ్బ పొక్కుతుందనీ, అది దూకక ముందే తెలిసివుండాలి. అదీకాక, మాటల ధోరణీ, వాటి విలువా, అర్థమూ తెలిగ్గా గ్రాహ్యమౌతయ్. జంతువులకువలె సౌజ్ఞల రూపంలో ప్రతి చిన్న విషయాన్నీ విసుగు పుట్టేవరకూ చెప్పాల్సిన ఖర్మలేదు.జంతువుకు లాగు బోనును ఏర్పాటుచేసి, శరీరాన్ని కృశింపజేస్తూ, నల్లమందు కూడా ఆహారంలో జత పరుస్తూ, వాతావరణం మొత్తాన్నే మార్చి తీరాల్సినంత అవసరం లేదు. జంతువును మచ్చిక చేసేందుకు వృధాచేసే కాలం కన్న తక్కువ కాలంలో, తక్కువ శ్రమతో, తక్కువ రాపిడితో, తక్కువ బాధతో, భార్యను వశం చేసుకోవొచ్చు; అలా చేసుకోలేకపోవడం నా అసమర్థతే అవుతుంది!

రాత్రి పది గంటలయ్యాక, ఇక లాభంలేదని ఇంటివైపు మళ్లాను. ఇంకెక్కడన్నా పడుకుందామా అనే ఆలోచన కలగకపోలేదు. ఏ స్నేహితుడి గదికన్నా వెళ్తే, ఊళ్లో ఇల్లు పెట్టుకొని, నేను ఇంటికి ఎందుకు వెళ్ళలేదో కారణాలు చెప్పాల్సి వుంటుంది;వాడు అడక్కపోయినా, ఇంకోవిధంగా అనుమానించకుండా ఉండేందుకు యీ జాగ్రత్తను పరువు మర్యాదలున్న పెద్దమనిషనేవాడు పాటించి తీరాలాయె! అలాటి సందర్భంలో చెప్పి నమ్మించగల కారణాలేమీ నాకు తోచలేదు; ఆ సమయానికి తోస్తయ్యనే నమ్మకం అంతకు ముందే లేదు. నాకు యిల్లుండగా ఇంకోడి దగ్గరకుపోయి అర్థించాల్సిన అవసరం ఏముంది? యీ ఖర్మ యీ రాత్రితో వొదిలేదికూడా కాదు. ఇలాగే కనీసం పది, పదిహేను రోజులన్నా సాగందే అంతుపట్టేట్టు తోచటంలేదు. ఇలా ప్రతి

రాత్రీ ఎవణ్ణి అర్థించేట్టూ? చందాలమీద బతికే వాడిలాగు, ఒక్కొక్క రాత్రికి ఒక్కొక్కడి దగ్గరికి పోయి యీ స్థలధర్మాన్ని యాచించాల్సి వుంటుందేమో?

అసలు యీ వ్యవహారం పూర్తిగా ఏదో వొక వొడ్డు పట్టేదాకా, సాధ్యమైనంతవరకూ ఏ స్నేహితుణ్ణి, ఏ పరిచయస్థుణ్ణి పలకరించను కూడా పలకరించకూడదు; సరికదా, వీలైనంతవరకూ తప్పించుకు తిరగటం శ్రేయస్కరం. ఎందుకంటే మాటల సందర్భంలో నా జీవితంలోని యీ కొత్త కొండ విషయం వొచ్చినా రావచ్చు; లేక ఆ స్నేహితుడు ముఖాముఖీ అన లేకపోయినా, ఏ పుల్లాయి మీదనో ఎల్లాయి మీదనో పెట్టి సునిశిత విమర్శ సాగించవచ్చు. అప్పటి నా బాధ ఎలా ఉంటుందో ఊహించుకుంటూంటేనే తత్తర పడుతోంది. వాడి మాటలు నాకు అనువర్తిస్తున్నయ్యనే సంగతి నాకు రూఢిగా తెలుసు కనుక, నేను ఉడుకుతాను; అప్పుడు వాడికి మరీ అలుసవక తప్పదు. ఒకవేళ మనసు కాదులే అని ఏవిధంగానో ఉద్రేకాన్ని బలవంతాన తొక్కిపెట్టుకుంటే, తనకు తోడుగా మరికొంతమందినైనా తెచ్చి నా భరతం పట్టందే మానడు! ఎవడు తప్పు చేస్తాడా అని వెయ్యి కళ్ళతో కాచుకు కూర్చున్న సామాజికుల మధ్య దుకాణాన్ని బైటపడకుండా కాపాడుకుంటూ బతకగలగటం ఎంత కష్టం!

నేను యింటికి వెళ్ళి తీరేందుకు ఇంకో గొప్ప కారణం కూడా వుంది. అసలు ఈ విధంగా తొమ్మిది గంటలకాలం ఎర్రని ఎండలో కటకటాలు మినహాగా విడిఖైదును అనుభవించటం మొదటి పొరపాటు; ఇది ఒక విధంగా ఆమెకు లేని అలుసును కల్పించటమే! తన కేకలకు నేను హడలిపోయి, స్వంత ఆస్తిపాస్తులన్నిటినీ విడిచి పరారై పోయ్యాననే సంగతి బాగా గ్రహించాక, ఆ ఆయుధానికి ఆమె మరీ బాగా

పరువు పెట్టి ఉపయోగార్థం ఎప్పుడూ సిద్ధంగా ఉంచుకుం టుంది. ఇక చీటికీ మాటికీ ఫేం బెత్తాలన్నీ విరిచి పారేసినా సరే, తన పను లన్నిటినీ సాధించేందుకు, తన అధికారాన్ని చెలామణీ చేసేందుకు, నన్ను భయపెట్టేందుకు సమయా సమ యాలు లేకపోయినా ఈ ఆయుధాన్నే తరుచుగా వాడటం మొదలుపెట్టినా మొదలుపెట్టవొచ్చు. అప్పుడు నేను మరీ అలుసవకా తప్పదు; ఆమె నాకు తాటాకులు కట్టకా మానదు. సర్కసువాడు పులిని లొంగతీసుకోవాలని వెళ్ళి, పులికే లొంగినట్టవుతుంది!

అదీగాక ఇద్దరమూ దగ్గరి దగ్గరగా ఉంటేనే ఏదో విధంగా యీ సమస్య ఫైసలవుతుంది కాని, ఆమెకు బెదిరి నేను పరారయితే, నాకు బెదిరి ఆమె పుట్టింటికి పరుగు లెత్తితే మరి లాభం లేదు. నేను భార్యను సక్రమ మార్గంలో లొంగదీసుకునేందుకూ, తద్వారా దాంపత్య సుఖాన్ని అనుభ వించేందుకూ ప్రయత్నిస్తున్నాను కాని, ఆమెను పూర్తిగా విడిచిపెట్టేందుకు కానీ, ఏదో విధంగా వొదిలించుకొని ఏ సన్యాసినో అయేందుకు కానీ, ఆమె వీపు తాపామరబాగా వాయించి ఆనందించేందుకు కానీ ప్రయత్నించటం లేదు. కనుక ఏదో విధంగా ఆమెను ఎదుర్కొనే తీరాలి. ఆమె కేక లకు భయపడటం లేదని కనీసం ఆమెకన్నా నసాళం అంటే ట్టుగా తెలిసేట్టు చెయ్యాలి. ఇది తప్పదు.

మింట్ ఆఫీసులో నాణెం తరువాత నాణెం దానంతట అదే యంత్రంలోంచి ఊడిపడుతూన్నట్టుగా, నిశ్చితాభి ప్రాయాలైతే మనసులో దొర్లుతూనే వున్నయ్ కాని, యిల్లు సమీపించినకొద్దీ, కొద్ది కొద్దిగా భయం లోలోన పని చేస్తూనే వుంది. యింటికి వెళ్ళినప్పట్నుంచీ మళ్ళీ కథాకాండ ఎలా మారుతుందో, దానికి అనుగుణంగా ఎలా మారుతూ ప్రవ ర్తించాలో నని బెదురుతున్నాను. కాని ఇందులో తప్పే

దేదీ లేదని మాత్రం తెలుసు.

లోన గడియ వేసిన తలుపు దగ్గర నిలబడి, తలుపును ఏ విధంగా తెరిచేట్టు చెయ్యాలోనని ఆలోచించాను. సరైన ఆలోచన రాలేదు. మామూలు విధంగా—ఇంతవరకూ మా మధ్య ఏమీ జరుగనట్టే, ఒకవేళ జరిగినా అంతా మరిచిపోయినట్టే నటిస్తూ, పేరున పిలుస్తూ తలుపు గుద్దాను. లోన కదిలిన చప్పుడేమీ లేదు. తలుపు సందులోంచి చూశాను. ఆమె హాయిగా పడుకొని, పుస్తకం చదువుకొంటోంది. మేలుకునే ఈ ఎత్తువేసిం దనేది, స్పష్టంగా తెలిసిపోయింది. నిద్రపొయ్యే వాళ్ళను చప్పుడుచేసి లేపగలం కాని, మేలుకొనే ఉన్న వాళ్ళను లేపటం ఎవరి తరం? ఇక నా యింటి వీధి అరుగు మీద నిలబడి తలుపుకొడుతూ చెవి కోసిన నక్కల్లే అరవటం హాస్యాస్పదం. గోల ఎక్కువైనకొద్దీ 'ఆమె లేవదు సరికదా, ఇరుగుపొరుగులకు నిద్రాభంగమై ఈ వింతను చూసేందుకు నన్ను కమ్ముకుంటారు. ఎంత పరాభవమైనా—దాన్ని అనుభవించగలగటం అంత కష్టమేం కాదు; కాని ఇతరు లందరికీ తెలిసిందే అనే బాధను భరించటం మాత్రం చాలా కష్టం.

అందుకనే ఇంకో మార్గాన్ని ఆలోచించాను. ఇతరుల నెవర్నీ ఏవిధంగానూ ఆకర్షించకుండా, ఎలాగైనా పని పూర్తి చేసుకోవాల్సిన బాధ్యతను మాత్రం మరిచిపోలేదు. దొడ్డి గోడ అంత ఎత్తుగా లేకపోవటం ప్రస్తుతం ఒకవిధంగా అదృష్టమే! చిన్నతనంలో రెండో ఆట సినిమాకు వెళ్ళవస్తే బాబు కోప్పడతాడని, యింట్లో ఎవరికీ తెలియకుండా దొడ్డి గోడ దూకి వెళ్ళి, మళ్ళీ ఏ అర్ధరాత్రో వొచ్చి, మళ్ళీ గోడ దూకి ఏమీ ఎరగనట్టు ముసుగుతన్ని పడుకునేవాణ్ని. ఆ ఫీట్ చెయ్యటం మానేసి దాదాపు ఆరు సంవత్సరాలైనా, కొంత కాలం అలవాటుపడి ఉండటంవల్ల అంత కష్టం అనిపించలేదు. ఎలాగో గోడమీదికి ఎగబాకి, మెల్లిగా దూకాను. కింద

రాగిటిముట్టి కొవటంవల్ల కాళ్ళు అంతగా ఒత్తుకు పోలేదు.

ఆమె పడుకున్న చోటుకీ, యీ దొడ్డికీ మధ్య వున్న కిటికీ దగ్గరికి వెళ్ళే అవకాశం ఇప్పుడు వుంది; అంటే మెల్లిగా మాట్లాడినా ఆమెకు వినపడుతుంది. పెద్ద రగడ చేసి వీధి వాళ్ళందర్నీ పోగుచెయ్యాల్సిన అవసరం ఉండదు. కాని ఇక్కడ ఒక పేచీ వుంది. నేను మొదటినుంచీ ఆమెతో విరోధాన్ని పూనిన విధానంలో మాత్రం మార్పు ఉండేందుకు వీల్లేదు; అంటే ఆ విరోధం ఆమె నసాళానికి అంటాలన్న మాట! నా యీ ప్రవర్తన నటన అని కానీ, లేక పరిస్థితికి అనుకూల వాతావరణాన్ని కల్పిస్తున్నానని కానీ ఆమెకు అర్ధం కా కూడదు. ఆ విధంగా ఆమె అర్థం చేసుకుంటే, యింతవరకూ నేను కష్టపడ్డదంతా వృధాయే!

ఐతే విరోధుల మధ్య మాటలంటూ ఉండవు సరికదా, ఒకళ్ళనొకళ్ళు లెక్క చెయ్యరు. సమయంవొస్తే హృదయాల్లో ప్రజ్వరిల్లే రోషాగ్నిని - అగ్నిపర్వతంలాగు వెలిగ్రక్కేందుకు కూడా సిద్ధంగా ఉండాలి. అందులోనూ బలవంతుడైన వాడు (నిజంగా బలవంతుడు కాకపోయినా యిబ్బందిలేదు; తను బలవంతుడనే నమ్మకం బాగా ఉంటే చాలు) ఎదుటి వ్యక్తి అంటే అసలే లెక్క చెయ్యకూడదు. యీ రకం విరోధాన్ని ఇక్కడ ప్రదర్శించటం అసంభవం! ఇంతకు తక్కువరకం విరోధం అపార్థాలకు దారితీస్తుంది. ఇది ఎంత దూరం వెళ్ళేందుకు అవకాశం ఉన్నదంటే—'ఎంత ఏడ్చినా, నాతో ఎంత విరోధంగా ఉన్నట్టున్నా, లేక ఉన్నా, ఎంత దూరంగా జరిగినా నా అవసరం అనేది ఆయనకు లేకపో లేదు కనుక, ఏనాటికైనా ఆయనే దేవుడో అంటూ తన తప్పు లన్నిటికీ క్షమార్పణలు అర్పించుకొని నాదగ్గరకు రాక తప్పదు' అనే అభిప్రాయాన్ని ఆమెలో దృఢపరిచిన వాణ్ణవుతాను.

కనుక, ఇప్పుడు ఆమెచేత తలుపు తీయించాల్సిన విధా

నంలో పొరపాటు పడేందుకు వీల్లేదు. ధాం ధూం అని కేకలూ వేయకూడదు; అందుకని బతిమాలనూ రాదు. ఎట్లా? ముందు గొయ్యి, వెనుక నుయ్యి, వ్యవహారంగా వుంది... ఇలా ఎంతసేపు యీ చీకట్లో యీ గడ్డిలో, తోటకూర కాడల మధ్య నిలబడి ఆలోచించేది?

దృఢనిశ్చయం లేకుండానే, ఓర్పును కోల్పోయి ఆ కిటికీని సమీపించి మెల్లిగా, మామూలు కంఠధ్వనితోనే "ఇదిగో! తలుపుతీయ్—" అన్నాను.

ఆమె అటుతిరిగి చదివే పుస్తకంలోని పేజీ తిప్పి మరింత దీక్షగా చదవసాగింది. నావైపు కన్నెత్తి చూడనైనా లేదు!

"నీకే చెప్పేది" అన్నాను గొంతు కాస్త ఎక్కించి. యిల్లు నాదీ! నా ఇంటి జాగ్రతను భరించాల్సి కాపలా కాస్తూ ఉండాల్సిన నా భార్యే లోపల కూర్చొని, నాకే ప్రవేశాన్ని ఇవ్వకపోవటంకన్నా, నా అభిమానాన్ని రేపే విషమ సంఘటన ఇంకేమి ఉంటుందీ?

ఆమె సమాధానం చెప్పలేదు సరికదా, అసలు మానవుడనే వాడొకడు ఆ పరిసరాల్లో ఉన్నాడన్నట్లే ఆమె ప్రవర్తించటం లేదు. ఇస్త్రీ చీర కట్టి సన్నని ఇస్త్రీ జాకెట్ తొడిగి, చక్కని వాలుజడ వేసి, తలనిండా మల్లె మొగ్గలు తురిమి, మెడలో, సన్నటి శంఖుతావళం వేసుకొని చల్లగాలికి హాయిగా పడుకున్న అందమైన యువతిని—రాత్రి యీ సమయంలో వెనుకనుంచి చూస్తేమాత్రమేం—లోగడ రుచి మరిగిన ఆ ఆనందాన్ని క్షణక్షణమూ జ్ఞాపకం చేస్తూ, ప్రస్తుతం చేతికి అందకుండా అడ్డం పడే కిటికీ చువ్వల మీద రుసరుసలాడుతూ, యీ సుందరిని-అందులోనూ విధి నాకు భార్యగా చేసి వొదిలిన యీ మెను—చూస్తూంటే యువకుడైన ఏ భర్త హృదయం—పెనుగాలికి కొట్టుకులాడే లేతఆకువలె కొట్టుకులాడదు? కాని అందని సౌఖ్యాన్ని గూర్చి లొట్టలు వేస్తూ

బాధపడటం కన్నా, ఏవిధంగానైనా ఆ సౌఖ్యాన్ని చేజిక్కించుకునే మార్గాన్ని అన్వేషించటం విజ్ఞుల లక్షణం. ఐతే అలాటి అవకాశాలకు చాలా దూరంగా వొచ్చేశా నని పించింది. ఇక వెనక్కి వెళ్ళటం ఎంత కష్టమో, ముందుకు సాగటం కూడా అంతే కష్టం. అందుకని యీ విధంగా ముందుకు పోవటమే ఎన్నుకో దగ్గది. ఒకగుడ్డి గురి మాత్రం ఉంచనే వుంది; దీని కోసం ఎన్ని కష్టాలుపడ్డా, ఎంత శ్రమనూ ఇబ్బందుల్ని ఓర్చినా, చివరకు విజయం తప్పదనే విషయాన్ని మాత్రం మరిచి పోకూడదు.

కనుకనే తొణకకుండా, కంఠస్వరాన్ని మరికొంత కఠిన పరిచి "ఏం చెముడొచ్చిందా?" అన్నాను.

ఆమె చప్పున లేచింది. ఏ సమాధానమో చెప్తుందనీ, లేక తలుపు తీస్తుందేమోననీ ఎదురుచూసే నా ఆశలు వెంటనే ఆకాశం ఎత్తుకు ఎగిరినయ్...కాని, ఆమె దభేల్న కిటికీ తలుపులు వేసి లోన గడియ వేసేసుకుంది...ఎలా తొందరపడి చేతులు వెనక్కి వొచ్చినయో నాకే తెలియదు...ఒక విధంగా అదృష్టవంతుణ్ని—లేకుంటే, వేళ్ళు మినహాగా చేతులుమాత్రమే నాకు దక్కేవి. పై రెక్కలుకూడా క్షణంలో బంధించబడ్డయ్. మా ఇద్దరి మధ్యా ఇనప ఊచలే కాకుండా, వాటివెనుక కొత్తగా వార్నిష్‌చేయబడ్డ టేకు చెక్క తలుపులుకూడా అడ్డంపడ్డవి.

బతిమాలటమూ, భంగపడటమూ చాలా హాస్యాస్పదంగా తోచింది. అలాటి పనిచేస్తే ఆమె పట్టుదలకు నేను లొంగి పోయినట్టే! కనీసం సమయానుకూలార్థం ఆ పని చేసినా, అలా కనిపించినా, ప్రతిభంగం జరిగినట్టే! ఆమె ఇలాటి తప్పుల్ని చెయ్యటంకూడా ఒకరకంగా మంచిదే! అందువల్ల నాలోని పట్టుదల మరీ అధికమౌతుంది. నా మనసు కష్టపడ్డ కొద్దీ, నే నింకా క్రూరంగా ప్రవర్తించేందుకు అవకాశం

ఉంటుంది. వృధాగా ఒకరికి హాని చెయ్యటంకన్నా, ఏ చిన్న తప్పునైనా వెనకేసుకొని, ఆ తప్పును భూతద్దాలతో పెద్దదిగా చేసి చూస్తూ హాని కలిగించటంవల్ల మనస్సుకు తృప్తే కాకుండా, పైవాళ్ళకూ. చివరకు శిక్షను అనుభవించే వ్యక్తులకూడా, ఒక సకారణ ఘట్టంగా తోస్తుంది. కనుక దీనివల్ల మేలే వున్నది. ఈ స్వల్ప కారణంతో రేపు ఉదయానే బడితె పూజను మొదలు పెట్టవచ్చు.

ఇంకోవిధంగా కూడా ఇది నాకు మంచిదే. ఆమె తలుపు తెరిచినట్టయితే, ఆమె ఎదుట కనిపిస్తూంటే (అందులోనూ కిటికీ చువ్వల్లాటివీ, రంగు చెక్కల్లాటివీ, అడ్డం లేకుండా, గాలి ఒక్కటే అడ్డం ఉండగా), ఆమె రూపం పెట్టే ఆశలకు లోనై, లోగడ జరిగిందానికి క్షమార్పణలు అర్పించుకొని, ఏవిధంగానైనా యీ రాత్రి ఆమెను అనుభవించేందుకే ప్రయత్నం చేసేవాణ్ని. (క్రూరమైన కోర్కకు లోబడి వుండటంవల్ల, అభిమానాన్నంతటిన్నీ మరిచిపోయి, నా వ్యక్తిత్వాన్నే లెక్క చెయ్యకుండా ప్రాధేయపడి (కృష్ణుడంతటి వాడు సత్యభామ కాళ్ళు పట్టుకున్నాడాయె! ఇక సామాన్యుణ్ని నా సంగతి వేరే చెప్పాలా?) ఆమె ఎదుట ఎంతో తేలికయేవాణ్ని. యీ దుర్ఘటన కూడా తప్పింది.

యీ రాత్రికి భోజనం లేదు; అంత మాత్రం చేత చావు రాదు కనుక ఫరవాలేదు; ఏదో రకంగా భరించగలను. మధ్యాహ్నం నుంచీ ఎర్రని ఎండలో కూర్చొని ఆలోచనలతో ఉడుకెత్తిన యీ బుర్రకు, వెంటనే విశ్రాంతి కావాలి. అందులోనూ నిద్ర రెప్పలమీద నాట్యం చేస్తోంది. ఎలాగో, ఎక్కడో ఒకచోట పడుకొని యీ రాత్రి గడిపేస్తే—తెల్లారాక మిగతా విషయాలు చూసుకోవచ్చు.

దొడ్లోకి వెళ్ళి వెతికాను. అదృష్టవశాత్తూ—ఆమె బైట కెరినప్పుడు ఉపయోగపడే నులక మక్కి దొడ్లోనే వుంది.

ఇక యీ రాత్రికి అదే గతి! ఎల్లాగో ఆ ఉయ్యాల్లో పడుకొని చొక్కాను ఉండగా చుట్టి తలగడగా పెట్టుకొని ఆకాశం వైపు నక్షత్రాల గుడ్డి వెలుగును చూస్తూ పడుకున్నాను.

ఇంతసేపూ కళ్ళమీద ఆడే నిద్ర అంతా లేకుండా పోయింది. మళ్ళీ కొత్త కొత్త ఆలోచనలు బుర్రలో మెరుపుల్లాగు ప్రారంభమయినయ్.

క్షణక్షణానికీ యీ సమస్య ఆలోచనలకు అందకుండా తీవ్రరూపం దాలుస్తోంది. నేను ఆమెనుంచి పొందే ప్రతి చిన్న సౌఖ్యానికీ ఆమె సమ్మె ప్రారంభించింది. యీ సమ్మె సాగినన్నాళ్ళూ నేను పడాల్సిన బాధల్ని కొంతవరకూ ఊహించుకోగలను. వాటిని ఎలాగైనా భరించి తీరాలి. యీ తుచ్ఛ సౌఖ్యాల్ని గూర్చి ప్రస్తుతానికి బాధ పడకుండా ఉంటే, ఉత్తరోత్రా మన్మథ సామ్రాజ్యాన్ని ఏకఛత్రాధిపత్యంగా ఏలవొచ్చు. ఆ బాధలు కలిగించిన వ్యక్తిమీద కోరాలూ మిరియాలూ నూరటానిగ్గాను మనసుపొందే ఆరాటాలనే ఆయుధాలుగా ఉపయోగించుకుంటే, చుట్టు దార్లన్నీ దగ్గర దార్లవుతయ్...

ఇక్కడ ఇంకో కొత్త ఆలోచన వొచ్చింది; నేను పొరపాటు పడటంలేదు కదా! ఈ సంగతి తేల్చుకోవటం నా విజ్ఞానానికి అతీతంగా తోచింది. పోనీ యీ తారక మంత్రోపదేశాన్ని చేసిన నీకు ఎప్పటికప్పుడు యీ పరిస్థితులన్నిటినీ ఉత్తరాల ద్వారా తెలియ పరుస్తూ నీ సలహాలనే అనుసరిద్దామా అనుకున్నాను కాని, ఉత్తరం నీకు చేరేలోపునే ఇక్కడి పరిస్థితుల్లో అనేక మార్పులు వొస్తవి. ఎక్కడికక్కడే క్షమాపణను సమీపిస్తున్నామన్నట్టు ఉండే ప్రమాదకరమైన పరిస్థితుల్లో నీ సలహాకూడా సకాలానికి అందే అవకాశం యేమీలేదు. నువ్విచ్చే సలహా గతించిన పరిస్థితులకు సరిపడేదై వుంటుంది. మళ్ళీ ప్రస్తుత పరిస్థితుల కొక్కడా

అదే గతి పడుతుంది. అందుకని అదేమీ లాభం లేదు.

అదీకాక నువ్వు కూడా దాదాపు ఇలాటి పరిస్థితుల్నే ఎదుర్కొని ఉంటావనేది నిస్సందేహం! ఇందుకు కారణాలు-ఆడవాళ్ళ మనస్తత్వం దాదాపు అంతటా ఒక్కటే! ఒక త్తైను చూసి మొత్తం జాతికంతకూ సరిపడే అనేక విషయాల్ని చెప్పవొచ్చు. నీ ఉత్తరంలో 'ఇలాటి అగ్నిపరీక్షలకు ఎన్నిటికైనా ఓర్చాలి. పట్టువిడవకుండా సాధించాలి' అని రాశావు. యీ మాటలు—నువ్వు ఎన్నో (బహుశా ఇప్పటికి నేను ఎదుర్కొన్నవి నువ్వు ఎదుర్కొన్న వాటిలో బహు చిన్న భాగమే నేమో?) ఎదుర్కొన్నావని చెప్తున్నవి. అవన్నీ ఇంచుమించుగా ఇలాటివే ఐ ఉండొచ్చు. కనుక నీ దగ్గర్నుంచి వొచ్చే సలహాను కూడా నేను ఊహించగలను. 'వాటిని భరించు; పట్టు విడువకు' అంటావు. కనుక యీ మాటనే గాయిత్రీ మంత్రంలాగు జపించుకుంటూ ముందుకు సాగాలి...అందుకనే జరిగిన సంఘటన లన్నింటినీ ఇంత కాలానికి నీకు రాస్తున్నాను; ఎప్పటి కప్పుడు రాసే తీరుబాటు లేకా, అందువల్ల ఉపయోగం ఉంటుందనే నమ్మకం అంతకు ముందే లేకాను.

ఆమె ప్రవర్తించిన విధానంమీద నాకు ఒక విధంగా జాలి కూడా కలగక పోలేదు. ఆమె ఎంతో హాయిగా పడుకొని చదువుకుంటున్నదని నేను అనుకున్నానే కాని, ఆ దృశ్యానికి ముందు, ఆమె యూకలిప్టస్ ఆయిల్ పట్టించుకొని ఉంటుందనీ, వేడినీళ్ళకాపు వేసుకొని ఉటుందనీ, ఇందాక ఆలోచించలేక పొయ్యాను. సమయానుకూలంగా ఆమె వీపు పగల కొట్టిన దుర్మార్గుణ్ని! పిల్లలమీద ప్రేమ లేకనా వాళ్ళను కొట్టేది? ఒక వ్యక్తిని సక్రమ మార్గంలో నడిపేందుకు చేసే ప్రయత్నమాయె...ఏమైనా ఆమె ఇక భరించలేని పరిస్థితిని

త్వరలోనే కల్పిస్తే అప్పుడే రాజీకి దిగుతుంది. అంతకన్న గత్యంతరం లేకపోవటం నా ఒక్కడి పొరపాటే కాదు.

ఈ ఆలోచనలకు తోడుగా కటిక నులక కుక్కికింద గుచ్చు కుంటూ, తన కుక్షిలో జాగ్రత్తగా రక్తాన్ని ఇన్నాళ్ళూ కాపాడు కుంటూన్న నల్లుల్నికూడా నామీద దాడికి పంపింది. అది ఆమె మంచం కావటంవల్ల ఆ నల్లులుకూడా ఆమె పార్టీవే ఐ వుంటవి. కనుకనే అవి నాతో హోరాహోరిగా పోరు ప్రారంభించినయ్. తెల్లవారుజామున నాలుగింటిదాకా వాటితో అవస్థపడుతూ, చివరకు విపరీతంగా అలసిపోయి, ఆకలి బాధకు కుంగిపోతూ, నాకు తెలియకుండానే ఆ కుక్కిని కరుచుకుపొయ్యాను.

* * *

ఉదయాన డొడ్డి చిమ్మేప్పుడు లేచిన ధూళిమేఘం నన్ను ఉక్కిరిబిక్కిరి చేసి నిద్రనుంచి మేల్కొలిపింది. కావాలనే ఆమె—మామూలుకన్న ఎక్కువ వేగంతో, శక్తితో చిమ్ము తూండటంవల్లనే ఇంత దుమ్ము లేచింది. ఆమె తన పగను సాధించుకోనేందుకు ఇలాటి మార్గాల్నే అనుసరించటంలో అసహజమేమీ లేదు. బలహీనుల ఆయుధాలు ప్రాణభయం లేనివే కాక, ఎక్కువ బాధనుకూడా కలగచెయ్యవు. అందు కనే చిన్నపిల్లలు కోపంవొచ్చి తిట్టినప్పుడూ, వాళ్ళ చిన్న చేతుల్ని మనమీదికి విసిరినప్పుడూ, లేక ఏ రాయో తీసుకొని మనమీదికి వేసినప్పుడూ (సామాన్యంగా అది తగలదు—గురి ఎక్కువగా అలవాటు లేక పోవటంవల్ల; ఒకవేళ ఏ గుడ్డేటు గానో తగిలినా అది బలహీనమైన చేతినుంచి బయలుదేరి ఉంటుంది కనుక, అంత పెద్ద దెబ్బ తగలదు. అసలు పిల్లల కన్న తెలివిగల వాళ్ళం కనుక దాని గతిని అనుసరించి దెబ్బ తప్పుకునేందుకు ప్రయత్నించి తప్పుకోగలం కూడాను.) మనకు కోపంరాదు సరికదా, ఒకరకం జాలిపుట్టి, ఆ పని

లోని చిలిపితనాన్ని చూస్తూ, మెచ్చుకోలుగుతాం.

ఆమె ఈ కొంటెతనాన్ని ఇంకే పరిస్థితిలోనైనా నా చిరునవ్వురూపాన అభినందించి ఉండేవాణ్ని. కాని పొద్దున్నే లేవగానే దొరికిన ఈ అవకాశాన్ని ఎందుకు వృధాగా జారవిడవా లనిపించింది. అంగులోనూ అవకాశాలకోసం వేచి కూర్చున్న నాలాటివాడికి చీమ దూరే సందు దొరికినా చాలు. ఏ రంగు అద్దంలోంచి చూస్తే దృశ్యమంతా ఆ రంగుగానే కనిపించినట్టు, ఆమె ఏది చేసినా, ఒకవేళ నిజంగా నాకు హానిచేద్దామని ఆమె అభిప్రాయం కాకపోయినా సరే, దాన్ని ఒక పెద్ద తప్పుగా ఎత్తి చూపవొచ్చు. గంధ్రాన్వేషణకు బయలుదేరినవాడికి ఇలాటిది గాలి పీల్చినంత తేలిక!

నాందిగా "ఏం-కళ్ళు కనపట్టంలా?" అని ఉరిమాను.

ఆమె జవాబు చెప్పలేదు. మరీ వేగంగా తన పనిని చేసుకుపోతోంది. ఇలా మూగనోము పట్టినవాళ్ళతో వ్యవహారం మరీ దుర్భరం! అవతలి మనిషి ఏవిధంగా సంభాషణను సాగించినా, ఒకరకంగా ఆమె తప్పును బ్రహ్మాండంగా చూపే అవకాశం ఉంటుంది. అదీకాక, నాతో మాట్లాడేందుకే ఇష్టపడని వ్యక్తితో నాకు నేనై మాట్లాడటం (అచేతన వస్తువుల్తో మాట్లాడినట్టూ, నాటకంలో స్వగతాలు చదివినట్టూను) నాకు మనస్కరించలేదు. ఐతే తలపెట్టిన పనిని పూర్తి చెయ్యాల్సిన బాధ్యత నా మీద వుంది కనుక, ఇలాగే యీ కుంటి నడకతోనే వ్యవహారాన్ని సాగించ దలుచుకున్నాను. ఆమె జవాబుచెప్పని తలబిరుసుతనాన్నే ఎందుకు ఊతగా తీసుకో కూడదూ?

"ఏం...ఒళ్ళు కొవ్వెదాయేం? రాత్రి తలుపు తియ్యలేదు. సరికదా, ఇక్కడ దుమ్మంతా నామీదనే చిమ్మకపోతే...!"

ఇక్కడ భర్త కాదు కదా, చివరకు ఒక మనిషనే వాడన్నా ఉన్నాడన్నట్టు ఆమె భావించటం లే దనిపించింది.

పమిటను నడుముకు చుట్టి, నీళ్ళు చల్లుకుపోతుంది. ఆ నీళ్ళు నామీద పడితే మరింత అవకాశం చిక్కుతుం దనిపించింది... ఆమె నడకలో పూర్తిగా కనిపించే ఆడదనం నన్ను ముగ్ధుణ్ని చేసింది. నా మీది కోపంతో కనుబొమలు ముడిచి, బుంగ మూతి పెట్టింది—ఎంత ముద్దుగా, అందంగా వుంది! మాటి మాటికీ చలించే వెధవ మనస్సును మళ్ళీ తొక్కి పట్టు కున్నాను.

కోపాన్ని ప్రజ్వరిల్ల జేశాను...ఇక మాటల్తో కాదు, ఫేం బెత్తాలతోనే పని మొదలుపెట్టాలని నిశ్చయించు కున్నాను. తీరాపోయి చూస్తే ఫేం బెత్తాలన్నీ చిన్నచిన్న ముక్కలుగా విరిచి పడేసి వున్నయ్. యీ విధంగా అయితే ఎన్ని బెత్తాలు కొనేట్టూ? కొన్నా వీటి ఉపయోగం లేకపోతే ఏం చేసేట్టూ? సమయానికి ఆయుధం చేతులో లేకపోతే ముందుకెలా సాగగలనూ? దీన్ని ఇంకో కారణంగా తీసుకోవ చ్చనిపించింది.

ఏమైనా ఉదయానే పాచిమొహంతో యీ కార్యక్ర మాన్ని సాగించాల్సిన నా బాధ్యత గుర్తొచ్చేప్పటికి—ఏమీ చదవకుండా మేకపోతుగాంభీర్యంతో పరీక్షాపత్రాన్ని అందు కున్న విద్యార్థి కీలాగు-నరాల బలహీనత్వం విపరీతంగా నాలో ప్రవేశించింది. కాని తప్పేదేముందీ?...నిన్న మధ్యాహ్నం లాగే, ఇవాళ కూడా మర్రిచెట్టు నీడలో తలదాచుకోవాల్సి వొస్తుందేమోననీ, అన్నపానాదులు లేకుండానే అవస్థపడాల్సి వొస్తుందేమోననీ ముందుగానే ఆలోచించి, జేబులో డబ్బు వేసుకొని, మరచి పోకుండా పై పంచకూడా వేసుకొని రంగంలోకి ప్రవేశించాను.

వేపచెట్టు ఎక్కి సన్నగా బాగా ఊతంగా ఉండే రెండు బెత్తాల్ని విరిచి, ఆకులు దూసిపారేశాను. మొగం కడుగు పుల్లలకోసం నేనీ పని చేస్తున్నానని ఆమె అనుకొని

వుంటుంది. ఆమె ముందు జాగ్రత్త పడకుండా ఉండేందుకు ఇదీ కొంత నయమే ననిపించింది.

చెట్టు దిగీ దిగటంతోనే "ఏమే! ఇందాకట్నుంచీ చూస్తాను-నీ యీ తల బిరుసుతనాన్ని ఇంకెన్నాళ్ళు సహిం చేది? మాగదానిలాగు మాతి ముడుచుకొని—" అని బెత్తం ఝళిపించాను.

ఆమె మాతి బిగించి, కనుబొమలు చిట్లించి తన మామూలు కార్యక్రమానికి ఉపక్రమిస్తున్నట్టే సూచించింది.

ఇక ఆలోచించి లాభం లేదనే నిశ్చయంతో ఒక్క దెబ్బ వేశాను. ఆమె మామూలు పదాల్ని గొంతెత్తి అరుస్తూ, జుట్టు పీక్కోసాగింది. ఉదయమేమో, అందరూ యీ కేకలకు జవా బుగా గుమిగూడుతున్నారు. ఒకళ్ళిద్దరు ఆడజనంకూడా దొడ్డి మూలల్లోకి అప్పుడే జొరబడ్డారు. యీ విధంగా ఆమె తన సైన్యాన్ని సమీకరిస్తూవుంటే ఇక ముందుకు సాగటం చాలా కష్ట మనిపించింది.

ఎలాగో నిలవతొక్కుకున్నాను. "ముందు నోరుముయ్" అని ఇంకో చురక వేశాను. ఆమె మరింత రెచ్చి కిందపడి దొర్లుతూ "ఈయనకు పిచ్చి ఎక్కిందర్రోయ్!" అని కొత్త పదాన్ని సృష్టించి గోలగా ఏడ్వ నారంభించింది.

"ముందు నోరుమూస్తావా, లేదా?" అని గుడ్లురజేసి బెత్తం గాలిలోకి ఎత్తాను.

"నన్ను చంపేస్తున్నాడర్రోయ్!" అన్నది—నిజంగానే తన తుది వాక్యాలు ఇవే నన్నంత గట్టిగా!

ఎలాగైనా ఆమెచేత నోరు మూయించాలనే నా పట్టుదల మరీ హెచ్చి, ఐదారు దెబ్బలు కాస్త బలంగానే వేసి, బెత్తాలు కాస్తా విరగగొట్టుకున్నాను. ఇంకా కొత్త బెత్తాల అవసరం ఉన్నదా, లేదా అనే సందిగ్ధంలో ఉండి, ఒక్క సారి తల ఎత్తి చూద్దును—

పక్క ఇళ్ళలోని ఆడజనం, మొగజనం మొత్తంగా, వాళ్ళ దొడ్లలోనుంచి మా దొడ్డిగోడమీదికి ఎగబాకి యీ సుందర దృశ్యాన్ని చూస్తున్నారు. ఇంతమందిని చూసేప్పటికల్లా, ఆంజనేయ దండకాన్ని జపించుకోవాల్సిన పరిస్థితి నాకు ఏర్పడ్డది. ఆమెను కొట్టటం మాట మరిచి పోయ్యాను. ముందు ఆహ్వానంలేని యీ ప్రేక్షక జనాన్ని ఎందుకు బాద కూడ దనిపించింది. ఆ దృశ్యం వీ ళ్ళందరికీ ఆనందాన్ని ఇస్తోందో, లేదో నాకు తెలియదు కాని, నాకు మాత్రం ఒక విధంగా నిరుత్సాహాన్ని ఇచ్చి, నా పనికి అడ్డం పడ్డదని మాత్రం రూఢిగా చెప్పగలను.

వీళ్ళను వొదిలించుకునేందుకు రెండు ఉరుకుల్లో రహదారి పడదా మనిపించింది. ఇంతమంది ఎదుట సిగ్గుతో తలబాదు కొని చావాల్సిన క్లిష్టపరిస్థితిని నాలాటి పెద్దమనిషి ఎలా భరించగలుగుతాడు? కాని వీళ్ళంతా చూడటం నాకెంత కంటకప్రాయంగా వుందో, ఆమె కంత సహాయకారిగా వుంది. కొత్తశక్తులేవో ఆమెలో ప్రవేశించినయ్. కిందపడి దొడ్డంతా దొర్లుతూ "యీ పిచ్చివాడితో నే నింకేం కాపరం చేస్తా నర్రోయ్!" అని పిలుపులేని ప్రేక్షకులందరికీ 'అప్పీల్' చేయ నారంభించింది.

ఇలా రెండు మూడు నిమిషాలు జరిగేప్పటికి, నేను స్తంభించి పోయ్యాను. ఇప్పుడు పారిపోవటం లాభంలేదు. అది నా ఓటమినే తెలియపరుస్తుంది; జీతమూ, బత్తెమూ లేని యీ సైన్యం ఆమెకు ఎప్పుడూ అందుబాటులోనే వుంటుంది కనుక, ఇకముందుకూడా నే నీ విధంగా ఆమెను లొంగదీసు కునేందుకు చేసే ప్రయత్నాలు వృధా! రోజురోజుకూ నేను బలహీనుణ్ణయి, ఆమె స్థానాన్ని బలపరచవలసిన పరిస్థితి ఏర్పడేట్టుగా వుంది. కనుక ఏ విధంగానైనా నా యీ దుర్ఘటన నను ఎదుర్కోవటంలో నా కీ అగ్నిపరీక్ష ఎదురౌతుందని

గట్టిగా నమ్మాను.

ఇక్కడ మాత్రం ఆమెకు ఏ మాత్రం సందిచ్చినా రేప ట్నుంచీ ఊరందర్నీ పిలిచి నన్ను కించపరుస్తుంది. అంతే కాదు, సామాజికులందర్నీ పిలుస్తానని బెదిరిస్తే చాలు, నేను వెంటనే లొంగిపోవలసి వుంటుంది. ఆమెకన్నా ముందుగా నేనే ఆమె చేయదలుచుకున్న పనిని కాస్తా చేసి కూర్చుంటే బాగుంటుంది కాని, పురుషత్వపు గర్వం వున్న నేను మాత్రం ఆ పని చెయ్యలేను. ఒకవేళ అవసరంకొద్దీ చేసినా ఎవ్వరూ నమ్మరు. భర్త భార్యను బాధిస్తున్నాడంటే నమ్మే లోకం, భార్య భర్తను బాధిస్తోంటే (అది నిజమైనా సరే!) నమ్మేందుకు ఎప్పుడూ సిద్ధంగా లేదు. పై పెచ్చు అలాటికి భర్త అసమర్థ తగా కూడా చలామణీ అవుతుంది. అసలు ఇలాటిది అరుదుగా జరిగినా, నిజం కావొచ్చు కాని, పురుషుడన్నవాడు యీ కారణాన్ని మాత్రం బైట పెట్టుకోలేడు. ఆమెలాగు కింద పడి దొర్లి గింతలు పెడుతూ, కన్నీరు లేకపోయినా, గొంతెత్తి అరుస్తూ, ఏడుస్తూ, జుట్టుపీక్కుంటూ రమ్యమైన ఒక దృశ్యాన్ని సృష్టించ గలిగేందుకూ, ప్రేక్షక మహాజనాల్ని రంజింప జేసేందుకూ కనీసం సంవత్సరమన్నా ప్రాక్టీస్ చేయ వలసి వుంటుంది.

ఈ సందర్భంలో యీ కోన్‌కిస్కా గొట్టాంగాళ్ళకోసం మాత్రం నా ధైర్యాన్ని త్యాగం చేయుదలుచుకో లేదు. వీళ్ళందరి ఎదుటా బహిరంగంగా తిరుగుబాటు చేశానంటే యీ సాంఘిక విప్లవాన్ని భరించితీరాల్సిన పరిస్థితిని ఏర్పరిచిన వాణ్నవుతాను. ఎందుకంటే సాంఘికంగా కాస్తోకూస్తో అర్థ సంపద ఉన్నవాణ్ని; పై పెచ్చు చదువుకున్న విజ్ఞానవంతుణ్ని; మామూలు మనిషిమీద మోపబడే నేరారోపణను నామీద రుద్దాలంటే కాస్త కష్టతరమే అవుతుంది. నేను కనుక తిరగ బడ్డానంటే, నా భార్యనే కాకుండా ఇరుగు పొరుగుల్ని

కూడా తృణీకరించినట్టే!

—ఇక్కడ చిన్నతనంలోని ఒకానొక దృశ్యం నా కళ్ళ
ముందు మెరిసింది.

సిగరెట్ కాల్చటం అంతకు ముందుగానే అలవాటు చేసు
కున్న రోజులవి. పెద్దవాళ్ళూ, నేను విధిగా గౌరవించి తీర
వలసిన వాళ్లూ ఎదురైనప్పుడు సిగరెట్ పారెయ్యటమో
(చిన్నదైనా కూడా పారెయ్య బుద్ధి పుట్టేది కాదు; ఎందు
కంటే ఇప్పుడున్న ఆర్థిక స్వాతంత్ర్యం అప్పుడు లేదు.
పూర్తిగా తల్లిదండ్రుల చాటు వాణ్ని కావటంవల్ల, డబ్బులు
సరిగ్గా దొరికేవి కావు. ఒక వేళ దొరికినా, ప్రతి ఖర్చుకూ
ఎక్కౌంటు చెప్పాల్సి వొచ్చేది. ఇక సిగరెట్ల ఖర్చు కని
చెప్పి డబ్బు గుంజటంలో కష్టమే కాకుండా, వీపుకూడా
తాషామరబాగా మోగటం ఒక విశేషం కాదని, ఇలాటి
అనుభవం వున్న ప్రతివారికీ తెలుసు కదా! పోతే, సామా
న్యంగా ఏదో వొక రూపాన ఇంటి దొంగగా మారకపోతే
యీ ఖర్చును భరించగలిగే వాణ్ని కాదు! అందుకని విరివిగా
కనీసం నాకు కావాల్సినన్ని సిగరెట్లు కొనుక్కునే అవ
కాశం పూర్తిగా నా చేతుల్లో లేదు కనుక-సిగరెట్ చిన్న
దైనా పారేసే వ్యవహారం జోలికి పోలేక పొయ్యేవాణ్ని)
లేక చేతిలోనే గుప్పెట్లో భద్రంగా దాయటమో జరుగు
తూండేది. ఏ మాష్టరన్నా కనిపిస్తే, మొదటినుంచీ ఎదురై
నప్పుడల్లా నమస్కారం పెట్టటాన్ని అలవాటు చేసుకున్న
నేరానికిగాను—నమస్కారాన్ని తన శిష్య పరమాణువు
నుంచి పొందటానికి అలవాటుపడ్డ మాష్టరుగార్ని యీసారి
దూసుకోవటం—అంటే ఒక్కసారే విప్లవాన్ని రేకెత్తిం
చటం నాకు అసాధ్యమైన పని. ఒకవేళ చూసీ చూడకుండా
తప్పుకొని వెళ్ళేందుకు ప్రయత్నించినా, మాష్టరు అప్పటి
కప్పుడే నానుంచి పొందాల్సిన గౌరవంకోసం ఒక్క దబా

యింపు చూపు చూస్తాడు. ఇక అప్పుడైనా తప్పేది లేదు. ఆయన దయకోసం—విశేషించి పరీక్షాపత్రాలు దిద్దేప్పుడు నే పొందే ఆరాటం కోసమన్నా యీ పని చేయక తప్పదు. ఆయన దృష్టిలో దుష్టుడుగా నిలిచి పోవటంకన్న, యీ పాడు మొక్కు కొస్తా ఎప్పటి కప్పుడు వొదిలించుకోవటం ప్రతి విద్యార్థీ (ఇప్పటి కాలపు వాళ్ళను మినహాయించి; విద్యార్థి నుల సంగతి కూడా నా కంత బాగా తెలియదు!) శిరసా వహించాల్సిందే! నా సంగతి ఎలా వున్నా, మిగతా విద్యార్థు లందరూ కనిపించినప్పుడల్లా నమస్కార బాణాల్ని వొదుల్తూం డటం వల్ల నానుంచి కూడా ఆ గురువుగారు అదే గౌరవాన్ని ఎల్లవేళలా కోరుతూనే ఉంటారు. ఇలాటి దుర్ఘటన జరిగి నప్పటినుంచీ, యీ అధికార ధిక్కారాన్నీ, నా తల బిరుసు తనాన్నీ నాకు నేనుగానే ప్రకటించి నప్పటినుంచీ, పోకిరి కుర్రాళ్ళ లిస్టులో నా పేరు కొత్తగా జేరుతుంది. ఇది నాకు ఇష్టం లేదు కనుకా, నమస్కరించినంత మాత్రాన మన పరువు (అసలా యీడులో పరు వేమిటి?) పొయ్యేదేమీ లేదు కనకా, యీ బెడదను-ఒక్క నమస్కారంతోనే వొదిలించుకుంటూ ఉండేవాణ్ని.

సిగరెట్ చేతులో ఉండగా యీ పని చేసేందుకు ముందు, ఆ సిగరెట్టన్నా పారెయ్యాలి; లేదా, సిగరెట్ అనేది నా చేతులోనే వున్నదన్న సంగతి ఆ మాస్టరుకు తెలియకుండా ఉండే ఉపాయమన్నా వెతకాలి. ఆలోచించాలే కాని ఉపాయాలనే వాటికి యీ లోకంలో తక్కు వేమిటీ?

సిగరెట్ వున్న కుడి చేతిని గుప్పెట్లో ముడిచి, గాలిలో చెయ్యి ఊపుతూన్నట్టు ఆల్లల్లాడిస్తూ (లేకుంటే పొగ సన్నగా ధారలాగు బైటపడుతుంది. అటూ ఇటూ చెయ్యి ఊపటంవల్ల కొస్త కొస్తగా కంటికి కనిపించని పరిమాణంలో గాలిలో కలిసిపోతుంది.) మాస్టరును సమీపించేదాకా వీపు వెనకనో,

లాగూజేబులోనో దాచేవాణ్ని.సిగరెట్ గుప్పెట్లో వుంటుంది కనుక, లాగూ అంటుకోదు. వేళ్ళకు తగలకుండా దానికో గూడులాగు వేళ్ళను ముడుస్తాను కనుక, వేళ్లు కాలవు-అదీ అసలు రహస్యం!

మాష్టరు బాగా దగ్గరకు రావటంతోనే సిగరెట్ ను లాగూ జేబులోనే వొదిలేసి మాస్టరు మొక్కు తీర్చగానే, వెంటనే చేతిని మళ్ళీ జేబులోకి పోనిచ్చి సిగరెట్ ను యథాప్రకారంగా పట్టుకునేవాణ్ని. ఇది చెయ్యటం కొద్ది క్షణాలే కనుకా, జేబులో బొగ్గుపులుసు గాలి ఎక్కువగా ఉండటం వల్లా (ప్రాణవాయువు లేకపోతే మంట లేవదని అంతకుముందే సైన్సులో చదువుకున్న విజ్ఞానాన్ని నిత్యజీవితంలో ప్రవేశ పెట్టటం అప్పటినుంచే అలవాటు చేసుకున్నాను.) సిగరెట్ వల్ల బట్టలు అంటుకునే పరిస్థితి ఏర్పడేది కాదు...మాష్టరుకూ నాకూ మధ్య మరి కొస్త దూరం ఏర్పడగానే సిగరెట్ ను పాతరలోనుంచి మళ్ళీ పైకి లేవనెత్తేవాణ్ని. ఇదేమంత కష్టసాధ్యమైన విద్యగా తోచేది కాదు; కనీసం సిగరెట్లు కాల్చటం నేర్చుకునేందుకు పడ్డంత అవస్థ కూడా దీని కోసం పడలేదు. అదీకాక 'అభ్యాసం కూసువిద్య' కదా!

ఈ పద్ధతిని విరివిగా ఉపయోగంలోకిపెట్టి బహుళ ప్రచారాన్ని చేసిన రోజుల్లో (సిగరెట్ పీల్చే అలవాటున్న నా ఇతర మిత్రులకూ-డా యీ ఉపాయాన్ని చెప్పేశాను. దొంగ లందరూ జేరి దొంగతనంలోని సుళి సూత్రాల్ని చర్చించినట్టు, మేమంతా ఇదే పద్ధతిని అనుసరించి, దాన్ని బహుళ ప్రచారంలోకి తీసుకొచ్చాం) ఒకనాడు తెలుగు మాస్టరు ఎదురయ్యాడు. మామూలు పద్ధతిలోనే ఆయనకు నమస్కరించిన వెంటనే జేబులో చెయ్యిపెట్టి సిగరెట్ ను మామూలుగా పట్టుకున్నాను.

రెండడుగులు ముందుకు వేశాడో లేదో, ఆయన నన్ను

వెనక్కు పిలిచి, వెకిలిగా నవ్వుతూ "వెధవా! ఇలా ఎంత సేపని జేబులో దాచుకుంటావ్! లాగూ తగలపడదూ? తియ్—ముందు" అని గద్దించాడు. ఈ ఆవలిస్తే పేగులు లెక్కపెట్టే రకాన్ని మొట్టమొదటిసారిగా ఎదుర్కోవాల్సి వొచ్చేప్పటికి నాకు చెమటలు పోసినయ్. నా అవస్థ ఏదో నేనే పడి, దానిలోని లాభనష్టా లన్నిటినీ అనుభవించేందుకు సిద్ధంగా వున్న నన్ను పట్టుకొని, ఇలా నిలవదీసేప్పటికి నా కేమీ పాలు పోలేదు. ఇందులోని రహస్యాన్ని చెప్పి యీ విద్య నాకు బాగా అలవాటేనని ఆయనకూ కాస్తా బోధించి ఆయన మెప్పును సంపాయిద్దామనీ, తెలివితేటల్ని ప్రదర్శించాల్సిన యీ వొక్క అవకాశాన్నీ ఉపయోగించుకుందామనే ఆలోచనైతే కలిగింది కాని, తన మాటకు ఎదురాడి, తనను పరాభవించానని ఆయన అనుకుంటాడేమోనని జంకాను. ఇక తప్పేది లేక, కాలుతూన్న సిగరెట్‌ను బైటికి లాగేశాను.

"ఇలాటిపని ఇక ఎప్పుడూ చెయ్యవోక" అని పురమాయించి ఆయన వెళ్ళిపొయ్యాడు. ఆయన అట్లు తిరగ్గానే సిగరెట్ కాల్చుకోవటంలో నిమగ్నున్నయ్యాను. దాంతో పాటే నా ఆలోచనలు కూడా రేగినయ్.

...తెలుగుమాస్టరు ఉద్దేశం ఏమిటంటే- నేను సిగరెట్‌ను ప్రమాదం జరిగేందుకు అవకాశం ఉండే విధానంలో దాయకూడదు. అంతకన్న నాకు మరి గత్యంతరం లేదాయె! పోతే రెండో విధానం ఏమిటంటే—ఆ విధంగా దాయటంకన్న ఆ సిగరెట్‌ను బాహాటంగానే, భయంలేకుండా, మామూలుగా ముక్కూ మొగమూ తెలియని వ్యక్తిముందు కాల్చుకుంటూ పోతూన్నట్టే పోవటం. ఆయన నాచేత సిగరెట్ బైటికి లాగించిందాకా వొదల్లేదు; కనుక, యీ పని చెయ్యటం ఆయనకు బాగా ఇష్టమన్న మాట! నేను ఏ పని చెయ్య కూడదో ఆయన విప్పి చెప్పాడు. దీని అర్థం: 'అది' మినహా

యించి, మిగతా అన్నిపనులూ చేయవొచ్చుననే! కనీసం ఏ పని చెయ్యవొచ్చో ఆయన ఆజ్ఞాపించాడు. ఒకవేళ ఇష్టం లేకపోయి నట్లయితే, ఆ చెయ్యగూడని పనులన్నిటినీ వరస నెంబరు ప్రకారం బైలాస్‌గా చెప్పేసేవాడే! ఆ బాధ్యత గురువుగారైన ఆయనకు వుంది. 'ఆజ్ఞ' ముందూ, 'శిరసావహించటం' తరువాతానూ...ఇంకెందుకూ? ఇతర మాస్టర్ల ఎదుట, వాళ్ళకు కనిపించకుండా (కనీసం అలా నటించి—వాళ్ళకు నిజంగా తెలిసినా, తెలియనట్లు వాళ్ళు నటించినట్టే, నిజంగా నేను సిగరెట్ కాలుస్తూన్నా, కాల్చనివాడి గాజ్ వేసి మానేజ్ చేస్తూ) నా మామూలు పద్ధతిని అవలంబిస్తు న్నాను. వాళ్లెప్పుడూ నన్నివిధంగా ఇరుకున పెట్టలేదు; కనుక వాళ్ళకు పాతవిధానమే బాగున్నదన్నమాట! పోతే తెలుగు మాస్టరికి మాత్రం అలాంటిదేమీ నచ్చలేదు. ఏ విష యాన్ని రహస్యంగానే ఉంచుదామని తంటాలు పడు తున్నానో అదంతా బట్టబయలై పోయింది. కనుక ఇంక ఆ వ్యక్తి దగ్గర రహస్యాన్ని దాయటానికి ప్రయత్నించటం పోస్సాధ్యదం-వృథా శ్రమ కూడాను! అందులోనూ తెలిశాక పోనికరమైన శిక్షకూడా జరుగలేదు కనుకా, యీ కొత్త పద్ధతి ఉభయులకూ శ్రేయస్కరంగా ఉన్నదే కనుకా, ఆనాటినుంచీ ఆయన ముందు మాత్రం దర్జాగా సిగరెట్ కాల్చుకుంటూ వెళ్లేవాణ్ని.

ఇక్కడ జరిగిన విశేషం ఏమిటంటే, ఆయన మాసీ చూడ నట్టు—మామూలుగా ఊరుకుంటే సరిపొయ్యేది. విషయం లోతులు తీసేప్పటికి యీ విధంగా నగ్నంగా, అతి భయం కరంగా తయారైంది. ఒకసారి దారి చూపాక, ఆమాత్రం లోకువను ఇచ్చాక, దాన్ని ఉపయోగించుకోలేక పోవటానికి నేనేం మూర్ఖుణ్ని కాదుగా!

—ఈ విషయాలన్నిటినీ నేను రాసేందుకూ, నువ్వు చది

వేంగుకూ ఇంతసేపు పట్టింది కాని, నా బుర్రలో మెరిసేం దుకు కొద్ది క్షణాలే సరిపోయినయ్.

ఇదే థియరీని ఇక్కడ అప్లయ్ చేయవలిచాను. వాళ్ళ ఉనికి—కనీసం యీ గోడల మీదికి ఎక్కింది నాతో సమాన మైన మానవులేనని మాటను మరిచిపోయినట్లు, ఏ దేవాలయం మీది గాలిబొమ్మలో (బూతు బొమ్మలు మాత్రం కాదు!) నన్నట్టూ ప్రవర్తిస్తే, ఆ పని వల్ల వాళ్ళ గౌరవ మర్యాదల్ని మంట గలిపినట్లే! అప్పుడు కాని ఇలాటి సంఘటన జరుగుతూ వుంటే గోడల మీదికి ఎగబాకి యీ విధంగా చూసే దురల వాటునూ, గురదనూ విడనాడక తప్పదు. అవమానం తప్ప కుండా జరిగే తావుకు ఇష్టపూర్వకంగా ఎవరు వెళ్తారు?

ఒకవేళ ఏ యువకుడన్నా (జాత్యాభిమానంవల్ల యితర స్త్రీలందరూ ఆమెపట్ల పెదవుల కదలికతో సానుభూతిని చూపుతే చూపొచ్చుగాక, కాని మొగాడైన నన్ను ఎదిరించే శక్తీ, గుండే వాళ్ళకు ఉండదు. ఒకవేళ ఒకళ్ళిద్దరికి అలాటి ధైర్య సాహసాలు వున్నా, పరాయి మొగాణ్నయిన నా మీద చెయ్యెత్తి, నాతో యీ పట్టపగలు పోట్లాడినందుకు, వాళ్ళ భర్తల దృష్టిలో నేరస్థులే అవుతారు. భర్తలు లేని విధవలకూ, పెళ్ళికాని కన్యలకూ శక్తి ఉండదు; ఉన్నా ఒక రకి ఈ అనుభవం ఉండదు. యీడుకూడా చాలా తక్కువే- కనుక వాళ్ళ కి విషయాలు తెలియక, రెండో వాళ్ళకు శక్తి తక్కువే-శక్తివున్నా తమపెద్దరికాన్ని ఆజ్ఞలద్వారా వెల్లడిం చేందుకూ సలహాలద్వారా మందలించేందుకూ సిద్ధపడతారే కాని, చూస్తూ చూస్తూ చెయ్యి మాత్రం ఖరాబు చేసుకోరు. అందులోనూ ఈ నరశింహావతారంలో శివాలెత్తి చిందులేస్తు న్నట్టు నటిస్తూన్న నా జోలికి వొచ్చేందుకూ, అటుపైన పోర పాటునో, లేక నేను కావాలనో ఒక్క చురక వాళ్ళకూడా అంటించానంటే, అక్కడ ఒక్క క్షణంకూడా నిలబడే శక్తీ,

అసలు ఆ అనవసరపు చురకను భరించే శక్తి ఎవరికి వుంటుందీ! ఇప్పుడు జరిగే దృశ్య మేదో వాళ్ళు తెలుసుకొని, (ఇంతకు ముందు చుట్టు పక్కలవన్నీ ఖాళీ గోడలే కావటంవల్ల, జరిగి పోయిన సంగతు లేవీ వాళ్ళకు తెలియవు. తెలిసీ తెలియని వ్యవహారాల్లో ఎవరూ—విశేషించి స్త్రీలు జోక్యం కలుగ జేసుకోలేరు. కనుక ఇక మిగిలిందల్లా, కాస్త దేహ పటుత్వమూ, సంఘ సంస్కార కాంక్షా, ధైర్యమూ వున్న యువకులే!) దూకి నన్ను ఎదిరించే పక్షంలో, వాడి మధ్య వర్తిత్వాన్ని మాత్రం నేను అంగీకరించను. పైపెచ్చు వాడు మళ్లీ యీ ప్రాంతాల్లో కనిపించకుండా ఉండేందుకూ, మరో ప్రశ్న బైటికి రాకుండా వాడి నోటికి తాళాం వేసేందుకూ, మొరటుగా 'నాభార్య సంగతి నేను చూసుకుంటాను. నా ఇష్టం వొచ్చినట్టు చేసుకుంటాను—నీకుమాత్రం ఈ సంగతి అనవసరం. నీ భార్య సంగతి నువ్వు చూసుకో...కావాలంటే నాలుగు వేపబెత్తాలు నువ్వుకూడా విరుచుకుపో'. అందామని నిశ్చయించుకున్నాను. ఇలాటి సందర్భాల్లో సకారణమైన వాదనకన్నా' (అందులోనూ సకారణాలైన వేవీ మనవైపు లేనప్పుడూ, సానుభూతి అంతా నేలమీద పడి దొర్లే నా భార్యవైపే ఉన్నప్పుడూను) మొండి జవాబే శ్రమ యేమీ లేకుండా, త్వరగా వెంటనే నసాళానికి అంటుతుంది. దాంతో ఆ వొచ్చిన వాడికి మొహం వాచి, అంబోతుల పోరాటం చూసేందుకు వెళ్ళి, తమాషాకు మధ్య తలకాయ ఇరికించిన లేగ దూడలాగయి, తెల్ల మొహంవేసి తోక ముడవాల్సిందే! అసలు దృశ్యాన్ని చూసి ఆనందించే ప్రజానీకం—ఆ దృశ్యంలోని న్యాయాన్యాయాల్ని విచారించేందుకు నడుం కడుతుందనే విషయంలో ఎనభై పాళ్ళు అసత్యమే!...కాకపోతే చాటుగా మాటుగా నా క్రూరత్వాన్నీ, నాభార్య సతీత్వాన్నీ, త్యాగశీలతనూ, మృదుత్వాన్నీ, సహన శక్తినీ

ప్రజలు చెప్పుకుంటారేమో? అందువల్ల నాకు జరిగే హాని యేమీ లేదు!

ఈ రకం ధైర్యం నేను ముందుకు సాగేందుకు తోడ్పడ్డది. కత్తి మేదీ చేతులో లేనందువల్లా, మళ్ళీ వేపచెట్టెక్కి కొత్తబెత్తాన్ని విరిచే ఓర్పూ, కాలయాపనా భరించలేకా— చేత్తోనే ఒక్కటి చరిచి "ముందు—ఇంట్లోకి పో!" అన్నాను.

ఆమె మాత్రం స్థాయి హెచ్చించి, హైరానవుతూ "నన్ను రక్షించేవాళ్ళే లేరా?... యీ వూళ్ళో పెద్ద మనుషులే లేరా? నేను యీ పిచ్చివాడి చేతుల్లో చావవలసిందేనా?" అని ఏడ్వసాగింది.

నా ఆజ్ఞ ప్రకారం ఆమె ఇంట్లోకి వెళ్ళినట్టయితే ఉభయులకూ శ్రేయస్కరంగానే ఉండేది. కాని అలా వెళ్ళటం— సానుభూతి చూపగలిగే జనాన్ని వొదులుకోవటమే అవుతుందని ఆమె తెలివిగా ఆలోచించి అక్కడే ఉండిపోయింది. నన్ను మరింత ఇబ్బందిలోకి, ఇరుకులోకి, నెట్టాలని ఆమె వేసిన ఎత్తు ఇది! ఆమె అనే మాటలు ప్రేక్షక జనాన్ని ఒక విధంగా ఉద్రిక్త పరుస్తవి. 'యీ చుట్టూ జేరిన మీరంతా వినోదాన్ని మాత్రమే చూసేందుకు వొచ్చిన వొట్టి వెధవలా?' అన్న సవాలు ధ్వనించే ఆమె మాటలు తమకు అంటగట్టే అవమానాన్ని వొదిలించుకునేందుకన్నా కొంతమంది నడుం బిగిస్తారని ఆమె ఆశ! ఇంకో తమాషా ఏమిటంటే—తన సహనశక్తిని ప్రదర్శించటమూ, ఏడుపులూ, పెడబొబ్బల్తో, కొట్టిన దెబ్బల్ని తేలిగ్గా ఓర్చుకోగలనని ఆమె గత రెండు ఘట్టాల్లోనూ ఏకాంతంలో నాకు నిరూపించింది. కాని ఇక్కడ నేను చెయ్యి ఎత్తుతేనే ఆమె ప్రాణాలే ఎగిరి పోతూ న్నట్టుగా కవ్వున కేకలు వేస్తుంది! తనకోసమూ, నాకోసమూ కాదు...యీ ప్రేక్షకుల కోసం! నిజానికి ఆదెబ్బ

రుచిని బైటినుంచి చూసేవాళ్ళకు, ఆమె ఏడుపు మాత్రమే విని, ఆవేడిని గ్రహించే అవకాశం మాత్రమే వుంటుంది. అందుకనే ఆమె ఎంత గొప్పగా తన బాధను అభినయిస్తే తనకు వొచ్చే సానుభూతి పరిమాణం కూడా పెరుగుతూం టుంది!) ఇతరుల ఉచిత సహాయాన్ని సాధించటం ఏ కాస్త తెలివిగల ఆడదైనా చెయ్యగల తేలిక పని!

ఒకటి రెండు నిమిషాల్లోనే ఆమె ఎత్తు ఫలించిందని గ్రహిం చేప్పటికి నేను ఆశ్చర్యపడ్డాను. ఇద్దరు యువకులు గోడదూకి వొచ్చి, నారెండు చేతుల్నీ బలంగా, కదలకుండా పట్టు కున్నారు. నిజానికి వాళ్ళిద్దర్నీ ఎదిరించగల శారీరక శక్తి నాకు లేకపోయినా, నాకోపం నాలో కలిగించిన కృత్రిమ శక్తితో ఇద్దర్నీ దాదాపు విదిలించి పారేశాను. కాని వాళ్ళు మాత్రం సళ్ళివ్వలేదు; 'మనకెందుకొచ్చిన తెగలాటం.' అను కొని జారనూ లేదు. ఇంకా బలంగా పట్టుకున్నారు. ఈ విధంగా కుస్తీపట్టి లాభంలేదనీ, మాటల్తో బాధించి వాళ్ళను పంపెయ్యటం మంచిదనీ తోచింది.

అన్నాను: "మీ రెవరూ? నన్నిలా నిర్బంధపెట్టేందుకు మీకేం హక్కుంది?"

వాళ్ళిద్దరూ ఒకరిముఖం ఒకరు చూసుకొని నవ్వుకున్నారు —బహుశా ఇలాటి ప్రశ్నను వాళ్ళు ముందుగానే ఊహించి వుంటారు.

వీ ళ్ళిద్దర్నీ చూశాక ఆమె మరీ రెచ్చిపోయి, తను దొళ్ళే విస్తీర్ణాన్ని హెచ్చించింది. అసలు యీపాటికి దెబ్బలు తినటం అలవాటై ఉండవలసింది; అలాటిది ఈ నటన అంతా రెట్టింపుగా ప్రదర్శిస్తూ వుంటే నాకు నవ్వొచ్చింది; సన్నగా నవ్వానుకూడాను.

ప్రస్తుతం నాకు బాడీగార్డులల్లే వున్న వీళ్ళిద్దరూ వొదిలేట్టు కనిపించలేదు. వీళ్ళను తృణీకరించి వొదిలించుకోకపోతే,

గోడలమీదినుంచి మరికొంతమంది దూకి, నన్ను వాటేసు కుంటూ రనేది స్పష్టం! యీ క్షణంలో ఏమాత్రం అలుసు ఇచ్చినా ఊరు మొత్తం నామీద పడుతుంది. యీ కొరివి పెట్టి నెత్తి గోక్కునే పరిస్థితినిమాత్రం కల్పించకూడదని నిశ్చయించుకున్నాను.

"మీరు మర్యాదగా ఇక్కణ్నుంచి వెళ్ళండయ్యా—" అని ఒక్కసారి గుడ్లు పెద్దవిచేసి ఉరిమాను.

వాళ్ళిద్దరూ ఆమెమీదికి ఉరికేందుకు సిద్ధంగా ఉన్నట్టు సూచించే నన్ను రెండడుగులు వెనక్కు నెట్టగలిగారు.

ఒకడు "మీరు లోపలికి వెళ్ళండమ్మా!" అని ఆమెకు సలహా ఇచ్చాడు. ఆమెమాత్రం మొహాన్ని పమిట చెంగుతో కప్పుకుంది—లేకుంటే కన్నీరు మినహాగా తన ముఖాన్ని ప్రదర్శించవలసి వొస్తుందేమో ననేమో!

ఇప్పటికే ఇద్దరు ముగ్గురు స్త్రీలు వొచ్చి ఆమెను ఓదార్చుతూ ఇంట్లోకి తీసుకొని వెళ్ళారు.

"అసలు మీ రెవరయ్యా?" అన్నాను యీ రాహు కేతువుల్ని ఉద్దేశించి.

"మే మెవరమో ఇప్పుడు కొత్తగా మీకు పరిచయం చేసుకో నక్కర్లేదు. ఎందుకంటే, మీరు మా యిద్దర్నీ బాగా ఎరుగుదురు!"

నిజానికి వాళ్ళెవరో నాకు తెలుసు; ఏళ్ళతరబడి యిరుగు పొరుగున ఉండేవాళ్ళు నాకు తెలియకుండా ఎలా వుంటారు?

"మీరు ఎవరైనప్పటికీ నాకు అనవసరం. మీకు ఇక్కడికి రావాల్సిన పనేమీ లేదు. నా సంసార విషయంలో మీ

కేమీ సౌఖ్యం లేదు. నాకు లేని దిగులేదో, మీకు ఉన్నట్టుగా ప్రవర్తించటం హాస్యాస్పదం!...కనుక తక్షణం ఇక్కడ నుంచి దయచెయ్యండి" అన్నాను.

నా మాటవల్ల వాళ్ళకు కోపం వొస్తుందేమో అనుకున్నాను. కాని వాళ్లకు కోపం రాలేదు సరికదా, నేనేదో ఎగతాళిగా మాట్లాడినట్టుగా, చిన్న కుర్రాడు తిడితే లెక్క చేయక నవ్వినట్టుగా—నవ్వారు. మిగతా జనసమూహం కూడా ఇదేవిధంగా లోలోన నవ్వుకుంటున్నారన్న అనుమానం కూడా వెంటనే కలిగింది. ఇప్పటికి వాళ్లలోని ఆవుర్దా చల్లారింది—సస్పెన్స్ లేని కథల్లే వాళ్ళకీ దృశ్యం కనిపించి వుంటుంది.

తామంతా కలిసి ఏం జరుగుతుందో ముందుగానే ఊహించుకున్నారో (ఎవరికి వాళ్ళే ఊహించుకున్నా, ఆ ఊహాల్లో చాలా పోలికలు ఉండి ఉంటయ్, వాళ్ళ ఊహలేమిటో నిజానికి నాకైతే తెలియదు. అందుకని ఇప్పుడు జరిగిన సంఘటన వాళ్ళ ఊహాలకు అతుకుతుందో లేదో నేనైతే చెప్పలేను. కాని వాళ్ళ ముఖవికారాల్ని పట్టి 'ఇదయి' వుంటుందని మాత్రమే రూఢిగా తెలుసుకోగలిగాను) అదే విధంగా ఇక్కడ జరిగి వుంటుంది కనుక, వాళ్ళ ఆలోచనలు చల్లారి ఉంటవి కనుక, తృప్తిగా తొందరేమీ లేకుండానే శాంతంగా ఉండిపోగలిగా రనుకుంటాను.

నన్ను పట్టుకున్న యువకులు ఏం మాట్లాడుతున్నారో నాకు మాత్రం అర్థంకావటంలేదు. నా పరిస్థితి నాకు అర్థమై ఏడిసింది కనుకనా? ఏడ్చే కుర్రాణ్ని మాయ మాటల్తో మరిపించినట్టు, బాధపడే రోగికి సానుభూతి వాక్యాలు చల్లిస్తూ, ఆశతో అతని హృదయాన్ని నింపుతూ బాధను కప్పిపుచ్చేందుకు డాక్టర్ చేసే ప్రయత్నం లాటి దేదో వాళ్ళు చేశారనీ,

దానికి నేను గురయ్యాననీ తరువాత తెలుసుకోగలిగాను... ఎందుకంటే వాళ్ళు యీ విధంగా మాట్లాడుతూనే, కొంత దూరం బలవంతంగానూ, ఆ తరువాత ఊరికనే తేలిగ్గా పట్టుకొని నడిపించుకొని వెళ్ళగలిగారు. దూరం పెరిగినకొద్దీ వెంబడిస్తూన్న జనం పల్చబడ్డారు. ఇక నే నున్న పరిస్థితిని పూర్తిగా అర్థం చేసుకునేప్పటికి చాలా దూరం వొచ్చేశాం.

ఎదురు తిరుగుదామా అనిపించింది. కాని నేనేమైనా ఉద్రేకాన్ని కనబరుస్తే ఆ నడిరోడ్డుమీద వొక హాస్య దృశ్యాన్ని సృష్టించవలసి వుంటుంది. నన్నొక వింత మృగమల్లే చూస్తూ జనం చుట్టుముట్టుతారు. బజార్లో మందు సీసాలు అమ్మేవాళ్ళు ఇచ్చే ఉపన్యాసం లాగు, వీళ్ళిద్దరూ నన్ను గూర్చి దండకం పఠిస్తారు. వాళ్ళ ఇద్దరి కంఠస్వరాల ముందూ, నాది ఎక్కదు. అప్పుడైనా నేను మళ్ళీ లొంగి పోవాల్సి వుంటుంది. ఇక గుమికూడిన జనం తల కొక అభిప్రాయాన్ని, ఒక తిట్టును నామీద రుద్ది గోల చేసి కాని వొదలరు. పరిచయం వున్న ఇరుగు పొరుగుల్లో పొరపాటున నన్నెవరైనా సానుభూతి చూపే అవకాశం వుంటుంది కాని, ఈ రాజబాట మీద మాత్రం నాకు ఏ విధమైన ఆశా లేదు. యువకులైన ఈ రాహుకేతువులు నన్ను తేలిగ్గా కంట్రోల్ చేయగలరు. కనుక ఎదురు తిరిగే ఊహకు నీళ్ళ ధార వొదులుకున్నాను. ఇక మిగిలిందల్లా ఒకే ఒక మార్గం—ఏదో విధంగా మంచి మాటల్తో వీళ్ళను వొదిలించుకునేందుకు ప్రయత్నించటం!

ఇందాకటినుంచీ వాళ్ళేదో మాట్లాడుతూనే వున్నారు. నా గోలలో నేను వుండి యేమీ వినటం లేదు. వాళ్ళకు నచ్చచెప్పి బైట పడదామనే ఊహ మెరవగానే, వాళ్ళ మాటల్ని అర్థం చేసుకునేందుకు మొట్టమొదటిసారి ప్రయ

త్నించాను. ఏదో రకంగా అన్నిటికీ 'ఊఁ' కొడితే సరి పోతుంది కాని, దానికూడా వొక సందర్భ శుద్ధి ఉండాలి కదా!...లేకుంటే నా ఈ సదుద్దేశాన్ని వాళ్ళు తేలిగ్గా గ్రహించగలుగుతారా యె!

''.....మీరు బాగా చదువుకున్న వాళ్ళు. మేము మీకు చెప్పాల్సిన వాళ్ళం కాదు కాని, యీ సందర్భంలో అది తప్పనిసరి అయింది. భార్యతో కలహంరాని భర్త కలలో కూడా కనిపించ డనేది కాచి వడబోసిన సత్యం. ఐనా ఒక రితో ఒకళ్ళు సరిపెట్టుకుంటేనే కాని సంసారం ముందుకు సాగదు. మాటల్తో అయే పనిని, చేతుల్తో సాధించుకునేందుకు ప్రయత్నించటం ఎవరికీ శ్రేయస్కరం కాదు—''

ఆ సంగతి నాకు తెలియకనా? వీళ్ళకు ఇప్పుడు కలిగి ఊహ కొన్ని ఏళ్ళ క్రితం నాకు కలిగింది. ఐతే—అదే...ఆ సరిపెట్టుకోవటం అంటేనే ఏమిటో అర్థంకాక ఛస్తున్నాను. దాని సూత్రాన్ని కనిపెట్టగలిగిన వీరు డెవడూ బైట పడడేం? అసలు ఈ చెప్పేవాళ్ళు సరిపెట్టుకో గలుగు తున్నారా అనేది అనుమానించాల్సిన విషయమే! ఒక విధంగా చూస్తే ఆ సరిపెట్టుకోవటం అనేది ఎవరికీ చాతకానిదే... కాని ఆ రహస్యాన్ని ఎవరి పాటికి వాళ్లు లోపలే మింగేసు కున్నారు. కొత్త బైటపడి నేను దాన్ని సాధించేందుకు ప్రయత్నించేప్పటికి వీళ్ళందరికీ వింతగా కనిపిస్తున్నాను కాబోలు!...ఏదో దొరక్క దొరక్క దొరికిన ఈ సదవ కాశాన్ని ఉపయోగించుకునేందుకు ఈ కుర్రకుంకలు తహ తహ లాడుతున్నట్టున్నారు...'చావనీ!' అనుకున్నాను.

మెల్లిగా వొక కాఫీ హోటల్‌కు తీసుకువెళ్ళారు. ఆ ఫల హారశాలను చూసేప్పటికి ప్రాణం లేచొచ్చినట్టయింది. రాత్రి నుంచీ భోజనం లేదేమో, ఆ ఆకలంతా ఒక్కసారిగా విరుచు

కొని మీద పడ్డట్టయింది. ఇంతవరకూ ఉద్రేకం వెనుక ఇంత బాధ ఎలా దాగి ఉండగలిగిందో ఆశ్చర్యంగానే వుంది.

ఆ తొందరలో ఇంకా మొహమన్నా కడగలేదనేమాట మరిచిపోయ్యాను. ఆ సంగతి గుర్తు రాగానే చప్పున ఇన్ని నీళ్ళు పుక్కిలిపట్టి, ఒక్క నిమిషంలో ముఖం కడగటాన్ని పూర్తి చేశాను.

వాళ్ళ నీతిబోధ సన్నని స్థాయిలో సాగుతూనే వుంది. ఆకలికొద్దీ కడుపు నింపుకోవటంలో ఏకాగ్రచిత్తుడనై ఉండటం వల్ల వాళ్ళ మాటల్ని అంతగా పట్టించుకోలేకపోతున్నాను.

ఒకటి మాత్రం నిజం: వాళ్ళు నన్నెక్కడ అపార్థం చేసుకుంటున్నారో తెలుస్తూనే వుంది. నా భార్యమీద నేను ద్వేషంతో మాత్రం ఈ పని చెయ్యటం లేదని వాళ్ళు గ్రహించలేరు; ఆ సంగతి విడమరిచి చెప్పే అవకాశం నాకు లేదు. ఆమెకేదో గొప్ప అన్యాయం జరుగుతూన్నట్టూ, దాన్ని అడ్డగించి ఇంత సంఘసేవ చేసేందుకు యీ యువకులు నడుం కట్టినట్టు మాత్రమే పైకి కనిపిస్తుంది...కనిపించినా నా కింకో మార్గంలేక ఊరుకుంటున్నాను. కాని, నా మౌనాన్ని వాళ్ళు వేరు విధంగా - నా తప్పులన్నిటినీ ఒప్పుకుంటూన్నట్టుగానే, తీసుకొని ఇంకా ముందుకు సాగుతున్నారు. యీ యిబ్బందిని నేను గ్రహించాను కాని, వొదిలించుకునే మార్గం లేక ఊరుకోవాల్సి వొచ్చింది.

ఉండివుండి వాళ్ళొక కొత్తవిషయాన్ని బైటపెట్టారు:

“చూశారూ!...గోవింద్ గారూ! మీరు ఎప్పుడూ అనేక కొత్త పుస్తకాల్ని కట్టలు కట్టలుగా చంకనబెట్టి తిరుగుతూంటారు. యింట్లో వున్నప్పుడు చదువుతారో లేదో మా అందరికీ అనుమానంగా ఉండేది...కాని మీరు వాటన్నిటినీ

చదివి ఆ సారాంశాన్ని పీల్చిపారేశారనే సత్యం యీ నాటికి బైటపడ్డది!"

'ఎట్లా?' 'ఏమిటి?' అన్నట్లు వాళ్ళ ముఖాల్లోకి చూశాను.

"చెప్తాంగా...మీరు మహా పండితులు. విజ్ఞానవంతులు. కాని ఏం లాభం? ఆ విజ్ఞానాన్ని మీ బుర్రలో పట్టనంతగా ఎక్కించుకున్నారు. అక్కడ మరి చోటు లేకపోయింది. అంత భారాన్ని మీరు మొయ్యలేకపోయ్యారు కూడాను. కనుక అదంతా మీకూ, మాకూ, మరెవరికీ కూడా తెలియకుండానే ఎగతన్నింది. ఆ బరువుకు తట్టుకోలేక మీరు పూర్తిగా ఉద్రిక్తులయ్యారు...దాని స్వరూపమే ఇది!"

"అంటే?...నాకు అర్థం కావటంలేదు."

"అర్థమయేందుకు ఏముంది? ఎక్కువ చదవటంవల్ల పిచ్చెక్కుతుంది...ఆ సంగతి మీకు తెలియకనా?"

"నాకు పిచ్చి అంటారా?"

"పిచ్చిఅంటే విపరీతార్థాలు తీసుకోకండి. మనస్సు బాగా పరితపిస్తున్నప్పుడు, లేదా దారుణమైన మార్పులకు గురైనప్పుడు, లేదా నరాల బలహీనత్వం విశేషమైనప్పుడు— లోకంలోని వస్తువులూ, వ్యక్తులూ వేరొక రూపంలో కనిపిస్తారు. దాంతో మీ అభిప్రాయాలు కూడా రంగుల్ని మార్చుకుంటవి. కనుక వెంటనే మారిపోయి, మీరొక వింత మనుష్యుల్లాగు తయారవటంలో ఆశ్చర్యమేమీ లేదు. కాని ఇందులో ఒక తమాషా వుంది. మీరు మారినట్టు మీకు తప్ప మిగతా ప్రపంచానికంతకూ తెలుసు!"

"మీ ధోరణి నాకు అంతుపట్టకుండా వుంది...నాకు పిచ్చి అని...?" అని రెట్టించాను.

"అందుకు సందేహమా?" అన్నాడు, రెండో వాడు- మొదటి వాడి పాటకు తాళంగా విషయాన్ని సూటిగా తేలుస్తూ.

నేనిక సహించలేకపోయ్యాను. నాకేమీ అపకారం జరగకుండా వాళ్ళు మాట్లాడుతూన్నంతసేపూ వాళ్ళ తృప్తి కోసం మౌనాన్ని వహించాను. కాని ఆ పొరపాటు ఏకు మేకై కూర్చుంది, మౌనాన్ని సంపూర్ణాంగీకారంగా కాకపోయినా, అర్ధాంగీకారంగా నన్నూ తీసుకొని ఉంటారు; కాని 'నాకు పిచ్చి' అని వెల్లడిస్తూ ఉంటే ఉద్ఘాటించారో నా తల పైనా వెంట్రుకలు లేచి నిలబడ్డట్టయింది. నా నరాలన్నీ ఒక్కచోట నే సమకూడి నాకు ఎదురు తిరిగినట్లు తోచినయ్. దీనికూడా నేను మాట్లాడకుండా ఊరుకుంటే, నా సంపూర్ణాంగీకారాన్ని తీసుకొని, విషయాన్ని తమకు అనుకూలంగా లాక్కొని, తమ కోల బద్దలకు నన్ను ఎరగా చేసుకుంటారు. నేను మాత్రం అంత మూర్ఖుణ్ని, చిన్న పిల్లవాణ్ని మాత్రం కాదు! ఇక ముందు ఇలాటి అభిప్రాయాలకు చోటు లేకుండా, కూకటి వేళ్ళతో వాటిని పీకి పారెయ్యక పోతే, నా గతి కుక్కలకూ, నక్కలకూ ఎరుక! అన్నిటినీ మించి నిజానికి నాకేమీ పిచ్చిలేదు. ఆ సంగతి నాకు నమ్మకంగా తెలుసు.

ఐనా వాళ్ళను ఎదిరొక్కనేందుకు నాకు శారీరకంగా బలం చాలదు. అందులోనూ వాళ్లు సూచించే తప్పుకు (పిచ్చి ఎక్కటం పిచ్చివాడి తప్పు కాదు. ఏ ఇతర వ్యాధైనా మన అనుజ్ఞ లేకుండానే యే విధంగా మనకు ప్రాప్తిస్తుందో పిచ్చి కూడా అదే విధంగా ప్రవేశించవొచ్చు. అలాటి సందర్భాల్లో నిజానికి ఎవరి తప్పూ లేదు. ఒకవేళ వాళ్ళ తప్పేనని వాదించే ప్రముఖులు ఎవరైనా వుంటే - వాళ్ళు మాత్రం పిచ్చి వాళ్లేననే విషయానికి ఇంకోరకం రుజూలేమీ అక్కర్లేదు) నేను చెయ్యలేదు. నేను చేసిన తప్పుకు (దాన్ని తప్పు అనాలో

అనకూడదో (ప్రస్తుతం వివరించి తేల్చే స్థితిలో నేను లేను) నా అంతరాత్మ సన్నగా ప్రారంభించిన మూలుగును వినలేక, కొంతవరకూ వీళ్ళిద్దరి ధోరణినీ సహించాను. కాని అసలు తప్పును (వీళ్ళు అనుకునేది!) తోసివుచ్చి, దానిస్థానే నేను చెయ్యాని తప్పును నాకు అంటగట్టటం, దానికి నేను మాట్లాడకుండా వూరుకుంటే, అది క్రమంగా అతి త్వరలోనే ప్రళయరూపం దాల్చటం, అప్పుడు ఆ సుడిగుండంలోంచి బైటపడటం నా చేతుల్లోని విషయం కాకపోవటం-ఇదంతా ఆలోచించాక, ఇంకొక్క క్షణం కూడా వృథా పుచ్చ దలచలేదు...కాకపోతే సౌమ్యమైన ధోరణిలోనే, ఉద్రేకాన్ని బలవంతాన తగ్గించుకొని, వాళ్లకు అర్థమయేట్టు చెప్పేందుకు ప్రయత్నించటం కొంత మేలు!

"మీరు పొరబడుతున్నారు. నాకు పిచ్చీ, గిచ్చీ యేమీ లేదు" అన్నాను.

"గిచ్చి సంగతి మాకు తెలియదు కాని, పిచ్చి మాత్రం ఉన్నదని మాకు రూఢిగా తెలుసు...మీరు దబాయించకండి. పిచ్చివాళ్ళకు దబాయింపు కూడా ఎక్కువ. పిచ్చిలో అదొక కళ అనండి...ఇంకేమన్నా అనండి...కాని ఒకటి మాత్రం నిజం——మీ పిచ్చి అంత బాగా ముదరలేదు. యీ శైశవ దశలోనే తగిన జాగ్రత్త తీసుకుంటూ, మెదడుకు ఎక్కువ పని కల్పించకుండా తగినంత విశ్రాంతి నిస్తే మాత్రం యీ విషాద సంఘటనకు ఎరగాకుండా మీరు బైటపడే అవకాశాలు వున్నాయ్. కాని..."

"ఏమిటీ——మీ ఉపన్యాసం? మీరు పొరపాటు పడటమే కాకుండా, ఆ పొరపాటును సదభిప్రాయంగా తీసుకొని, దాన్ని నా మీద రుద్దుతూ, నేను చెప్తున్నా వినకుండా, నాకు యీ పిచ్చి సలహాలు ఇస్తూ కోపం తెప్పించటం..."

"పిచ్చికి ఇంకో గొప్ప లక్షణం ఏమిటంటే అమితంగా అలసిపోయివున్న మెదడు మరి పనిచేయలేక మొండికి వెయ్యటంవల్ల—ఆ వ్యక్తి ప్రతి సామాన్య విషయానికీ అమితోద్రేకానికి గురవుతాడు. అందులో మీకు ఇలా కోపం రావటంలో కూడా విశేషమేమీ లేదు...ఒక్కటి ఆలోచించండి: మీ లోపాన్ని మీకు ఎత్తి చూపి, మీ బాగుకోరి, 'అయ్యా, బాబూ జాగ్రత్తపడి యీ దుర్ఘటనకు గురికాకుండా మిమ్మల్ని మీరు కాపాడుకోమని మంచి మాటలు చెప్పే మా మీద మీకు నిష్కారణంగా కోపం రావటంకన్నా హాస్యాస్పదమైన విషయం ఇంకేమన్నా వుంటుందా?"

"నా కసలు పిచ్చిలేదయ్యా—అనటంలా? మీరు మీ ఇష్టం వొచ్చినట్లు ఊహిస్తే దానికి నేను బాధ్యుణ్ణా?" అన్నాను, చివరకు కోపంతోనన్నా వాళ్ళ నోళ్ళు కట్టేద్దామనే ఆలోచనతో కళ్ళెర్రజేసి, కంఠస్వరంలో కాఠిన్యాన్ని ప్రవేశపెడుతూ.

వాళ్ళిద్దరూ ఒకరి ముఖం ఇంకోరు చూసుకొని తృప్తిగా చిరునవ్వు నవ్వారు. వాళ్ళు ఏ ఉద్దేశంతో నవ్వారో కాని, ఆ నవ్వులో మాత్రం ఎంతో విషం ఇమిడి వున్నట్టనిపించింది.

"మీరు బాధ్యులనీ, ఇందులో అంతా మీ పొరపాటే వుందనీ మేము అనటంలేదు. ఒక విషవ్యాధికి గురైనవాడి మీద మాకు సానుభూతి వుంది; అందులోనూ ఆ వ్యక్తి పరిచయస్తుడూ ఇంతవరకూ మా దృష్టిలో గౌరవనీయుడూ కావటంవల్ల ఆ సానుభూతి ఎంతో ఎక్కువ మోతాదులో పనిచేస్తుంది కూడాను. పోతే విషవ్యాధి వొచ్చినందుకు రోగిని అనవలసిన పనిలేదు. ఎందుకంటే వ్యాధికి గురైన వాళ్ళు అనేక రకాల జనం ఉంటారు కనుక, ఆ వ్యాధికి దారి తెన్నూ

ఉన్నవని మాకు తోచలేదు. ఇక ఆ రోగి—వ్యాధి విషయం ఏదో విధంగా తోసిపుచ్చి, కప్పెడుతున్నాడు...పాపం, రోగికి తాను వ్యాధికి గురైన సంగతి తెలిసి ఉండక పోవొచ్చు ...ఆ విషయాల్ని వొదిలేద్దాం...ఇక కర్తవ్యాన్ని ఆలోచించటం వొక్కటే ఎవరైనా చేయవలసిన పని—'

“మీరూ ఆలోచించండి. వొచ్చిన వ్యాధిని సాధ్యమైనంత త్వరలో వొదిలించుకొని బైటపడటం అత్యవసరం కదా! అందుకు మేమంతా మీకు సహాయం చేసేందుకు సిద్ధంగా ఉన్నాం. సమయం మించిపోలేదు కనుక, కొద్దిరోజుల చికిత్స తోనే మీరు తిరిగి ఆరోగ్యవంతులు కాగలరనేది మాకు స్పష్టంగా కనిపిస్తోంది.” అని రెండో వాడు తేల్చి వివరించాడు.

నేనిక భరించలేకపోయ్యాను. ఒక్కో మనిషి కొంతవరకే సహించగలడు. అదేపనిగా ఆ విషయాన్ని రెచ్చగొడితే మానవమాత్రుడెవరూ బతికి వుండీ భరించలేడు.

చివరిసారి హెచ్చరికగా అన్నాను. “మీరు పొరబడు తున్నారు. ఇంకోసారి చెప్తున్నాను. మీ ఉద్దేశాలూ, సల హాలూ, సహాయాలూ, సానుభూతులూ నాకేమీ అక్కర్లేదు. నాకు లేని వ్యాధిని కుదిర్చేందుకు బయలుదేరిన మొనగాళ్ళు! ఇంతమాత్రం మిమ్ము మాట్లాడనిచ్చినందుకు—”

“ముందు కాఫీ పూర్తి కానీండి. లేవొద్దు...మా ఉద్దేశాలు అలా వుంచండి. పురజనుల అభిప్రాయం వుంది. అందరికన్నా, మీ అర్ధాంగి అభిప్రాయంకూడా కాదంటారా? ఆమెకన్న అథారిటీ ఇంకేం కావాలి? ఇప్పుడు మీరు—మీకు పిచ్చి లేదని మాటిమాటికీ మమ్ము హెచ్చరించటం సహజమే! పిచ్చివాణ్ణి —పిచ్చివాడంటే ఊరుకుంటాడా? తన ధోరణిలో మొండిగా

వాదిస్తూ ఒక రకంగా తన పిచ్చిని నిరూపిస్తూనే వుంటాడు... మా సహాయం మీకు అనవసరం అంటారా?...దాన్ని మేము లెక్క చెయ్యం. మీరు మమ్మల్ని తిట్టినా పట్టించుకోం. పిచ్చి వాడూ, తాగినవాడూ, భావకవీ—వాళ్ళకు మతి స్థిమితం వుండదు. తాము భూమిమీద ఉన్నామనే సంగతి మరిచి పోయి, ఏదో ఊహా ప్రపంచంలో ఊరేగుతూ, వాళ్ళ చిత్తం వచ్చినట్లు వాగుతుంటారు. అందుకనే మీరు మమ్మల్ని నిందించి పొమ్మన్నా, మీకు సహాయం చెయ్యటం మా విధి కనుక, నోళ్ళు గిల్లుకుంటూ మాట్లాడకుండా ఊరుకోవటం మాత్రం కల్ల. కాకపోతే మీరు మామూలు ఆరోగ్యాన్ని పుంజుకున్నాక, మా మేలుకు కృతజ్ఞతగా వెలిబుచ్చటం తప్పదనుకోండి—"

ఏమిటీ, ఇదంతా? నా వ్యక్తిత్వమూ, నా సత్తాగ వాదనా—చివరకు, నా ఉద్రేక పూరితమైన కోపమూ ఇదంతా వీళ్ళముందు వృధాయేనా? నా మొక్కలే కాకుండా పురజనుల అందరి అభిప్రాయాల్నీ సాగుజేసి, నాయందు వాగుతూ, నన్ను నిజంగానే పిచ్చివాణ్ణిగా తయారుచేసే సన్నాహంలో ఉన్నట్లున్నారు!

ఇక నా అర్థాంగి విషయం: నావు దెబ్బలు తినే ఆమె ఏదో రకంగా నా తప్పుల్ని కప్పిపుచ్చుకునేందుకూ (అవి తప్పులని నాకూ ఆమెకూ మాత్రమే తెలియటమే ఇందులోని విషాదం!...) తనమీద శత్రుత్వాన్ని (నిజానికి అది మిత్రత్వమే అయినా, ఆ విషయాన్ని ఆమె గ్రహించే అవకాశాలేమీ లేని పరిస్థితి కావటం మరీ శోచనీయం!) ప్రదర్శించే నా మీద ఏదో విధంగా ప్రతీకారం తీర్చుకోవటం, యీ విధంగా నన్ను నా పీడను వొదిలించుకునేందుకుగాను నా వీపువెనుక (నా ఎదుటపడి అనేందుకు ఆమెకు ధైర్యం చాలదు; అలా అనటం అంటే మరిన్ని దెబ్బల్ని తనకు తానై

ఆహ్వానించటమే అవుతుం దని) ప్రచారం చెయ్యటంలో అబద్ధమేమీ ఉండక పోవచ్చు. అందులోనూ పై పరిస్థితుల్ని మాత్రమే చూడగల యీ పురవాసులు ఆమె స్వరం మధుర గాంభీర్యత కంఠధ్వనిని పట్టీ, పాలికేకల మోతనుపట్టీ, కొంత వరకూ నమ్మి వుంటారు. తరువాత నేను ఆమెను బెత్తాలతో కొట్టటాన్ని కళ్ళారా చూసో, చాటుగా వుండి చెవులారా వినో. లేక పొరుగావిడ చెప్పగా వినో, గాఢంగా నమ్మి ఉంటారు. దీని కంతకూ ముందు ఆమె మాటలు చెప్పి వాళ్ళకు కలిగించిన 'ఇంప్రషన్' కూడా బాగా పనిచేసి వుంటుంది... ఐతే పరిణామా లన్నిటికీ నేను బాధ్యుణ్ణా?

నా గోడు ఆలోచించకుండానే వాళ్లు చెప్తునే పోగారు:

"ఇంకో విషయం—మీరు యీ మధ్య తాగుడుకూడా అలవాటు చేసుకున్నార నే కిం వదంతి బయలుదేరింది. మొదట్లో మే మెవ్వరమూ నమ్మలేదు; కాని, ఒక విధంగా మీకు మీరై ఆ విషయాన్ని రుజూ చేసుకుంటూన్నారేమో నన్న అను మానం మాకు కలిగిన మాట వాస్తవం. నిజానికి ఆ పని చేస్తున్నప్పుడు మే మెవ్వరమూ చూడలేదు కనుక, అనవసరంగా ఈ అపవాదును మీ మీద వేయదలచలేదు. అసలు మీరు ఈ పనులు చేసేందుకు పిచ్చి వొక్కటే చాలు; ఇంకా తాగుడు కూడా దేనికీ?"

శృతి మించి రాగాన—ఉచ్ఛస్థాయిలో పడ్డది.

"పోండి...ముందు మీ రందరూ ఇక్కణ్ణుంచి వెళ్ళి పోండి—"

పెద్దగా అరిచాను. ఆ వొళ్ళు తెలియని కోపంలో టేబిల్ మీద ఒక్క గుద్దు గుద్దాను. నా ఉద్దేశం వీళ్ళల్లో ఒకొ్క

కక్కళ్ళను ఒక్కో గుద్దు-ఇంత బలమైందీ వెయ్యాలని, కాని గురి తప్పి, లేక అంత ధైర్యం నా కల్మషాత్మకు లేకనో, ఆ టేబిల్ ఖర్మ కాలో, దానికి తగిలింది. దాని ఫలితంగా ఆ టేబిల్ మీది గాజాముక్క అనేక ముక్కలు కావటమే కాకుండా, టేబిల్ మీద ఒక పక్క నే పెద్ద బరువు పడటం వల్ల అది తలక్రిందులై బోల్తపడ్డది. కాస్తో కూస్తో కాఫీ, కప్పుల్లోని చేతులు కడిగిన నీళ్ళూ, కప్పు వరకూ ఎగిరి ఆ చుట్టు పక్కల ఒక షవర్ బాత్ ను సృష్టించినయ్.

ప్రొప్రయిటరూ, ఇతర హోటల్ పనివాళ్ళూ పరుగెత్తుకుని వచ్చారు. బట్టలు ఖరాబ్ కావడంవల్ల మరి కొంతమంది కాతాదార్లుకూడా విషయం తెలుసుకొని, నన్ను చట్నీ చేద్దామన్నంత కోపంతో మా చుట్టూ మూగారు. ఇంత పెద్ద పొరపాటు చేసి ఇంత ఆలస్యంగా విషయాన్ని గ్రహించి బిత్తరపోయి నోట మాట రాకుండా గుడ్లప్పగించి ఊరుకోవటంకన్నా ఇంకేమీ చేయలేక ఊరుకున్నాను.

నా మిత్రులు మాత్రం ఈ ఆపత్ సమయంలో నన్ను విడనాడకుండా బైటపడేసి రక్షించారనే చెప్పాలి.

"పాపం! ఆయనకు పిచ్చిలెండి!" అన్నారు వాళ్ళు.

"పిచ్చివాణ్ణి ఇక్కడికెందుకు తీసుకు వొచ్చారూ?" అన్నాడు ప్రొప్రయిటరు.

"ఆకలవుతోందంటే తీసుకొచ్చాం...క్షమించండి...మీ టేబిల్ ఖరీదు ఇచ్చుకుంటాం..."

పిచ్చివాడు పొందగలిగే సానుభూతి చూపులు మాత్రం నాకు దక్కినయ్. ఇప్పుడు మాత్రం నేను మాట్లాడానంటే, పిచ్చివాడికి ఉన్న హక్కు లన్నిటికీ నీళ్లధారే! అందుకనే

రంగాన్ని చెడగొట్టకుండా నేను నిజంగా పిచ్చివాణ్నే నన్నట్లు ఊరుకున్నాను.

ఎవరి గోలలో వాళ్లున్నారు కాని, సీసపు పెంకులు గుచ్చుకొని నెత్తురు కారే నా చేతి గొడవ ఎవరికీ పట్టదేం? నేను కూడా బాధను ఓర్చుకున్నాను; మరి పిచ్చివాడి వేషంలో ఉన్నాను కదూ? ముందు ఏ విధంగానన్నా ఇక్కణ్నుంచి బైటపడితే అదే పదివే లనిపించింది.

మిత్రులు (?) నన్ను బైటపడేశారు. ఇంతతో వొదుల్తే నా దోవను నేను పోయ్యేవాణ్ని. బలవంతాన. ఖైదీని పోలీసులు లాక్కు వెళ్ళినట్లు, తీసుకు వెళ్తున్నారు. సమయం చూసి పారిపోదామా అని చూశాను కాని, వాళ్ళు కేకలేస్తే నలుగురూ మీదపడి నన్ను ముట్టడించి పట్టుకుంటారనే అనుమానం కలిగింది. ఇలాంటి పని చెయ్యటమంటే, నా పిచ్చి [illegible] నికీ ముదురు పాకానికి జారుతోందని మరోసారి రుజూ చేయవలసిన పరిస్థితి ఏర్పడుతుందేమో నని ఊరుకున్నాను. సౌమ్యంగా, బుద్ధిమంతుడల్లే వాళ్ల వెనకాలే నడవసాగాను.

నన్ను డాక్టర్ దగ్గరకి తీసుకు వెళ్లారు. నా చేతికి కట్టు కట్టించారు; గాయంమీద వేసిన మందు, తేలు అంటు పొడవటాన్ని జ్ఞాపకం చేస్తున్నా నేను అలాగే ఓర్చుకున్నాను.

వాళ్ళు డాక్టర్ చెవిలో ఏదో ఊదారు. డాక్టర్ నన్ను పరీక్షిస్తూ ఏమేమో ప్రశ్నలు అడిగాడు. ఆ ప్రశ్నల్ని అర్థం చేసుకునే స్థితిలో నేను లేనని ఎవరికీ, చివరికి నాకూ కూడా తెలియదు. అందుకనే తోచిన సమాధానాలేవో చెప్పాను.

చివరకు "పిచ్చి అనేందుకు సందేహం లేదు" అన్నాడు, డాక్టర్.

ఆ మాట మాత్రం నాకు అర్థమైంది. దాంతో తత్తర పుట్టింది. వీళ్ళంతా ఏకమై చివరకు నన్ను పిచ్చివాడుగానే తేల్చిపారేశారన్నమాట! డాక్టర్ మాటను—ఎవరూ—చివరకు ఇంకో డాక్టర్ కూడా—కాదనలేదు! నేను ఎదురు తిరుగుదామని ప్రయత్నించాను. నెమ్మదిగా వారించి ఈ ఆపదలోనుంచి తప్పించుకుందామని చూశాను. కాని నా మాటలు ఎవరూ వినలేదు; సరికదా, హేళనగా నవ్వి ఊరుకున్నారు.

"పిచ్చివాణ్ని పారిపోనివ్వకండి ... సూది ఏదైనా ఇస్తాను" అని డాక్టర్ లోనికి వెళ్ళిపోయాడు.

ఇక అక్కడ ఉంటే నాకు జరిగే మర్యాదను ఊహించుకున్నాను. నన్ను గొలుసుల్తో కట్టేస్తారో, లేక నాకు బెండు కొయ్య వేస్తారో, వీళ్లందరూ ప్రత్తిపడతారేమో?

ఎవరూ చూడకుండా మెల్లిగా లేచాను. మెల్లగా ఎవరికీ అనుమానం కలిగే అవకాశాన్ని ఇవ్వకుండా, సందు మలుపు తిరగ్గానే, పరుగు తీయ ప్రారంభించాను. నా పాతచోటుకు, మర్రిచెట్టు నీడలోకి వొచ్చేదాకా, గాలి పీల్చుకునేందుకు కూడా ఆగలేదు.

నావెంట ఎవరూ పడనందుకు నా అదృష్టదేవతకు వేయి నమస్కారాలు అర్పించుకున్నాను.

ఇంతవరకూ నాకు తెలియకుండానే—నాకు పిచ్చి అనే అపవాదు-గాలి తోడైన అగ్నివలె ఊరంతా ఎంతో తేలిగ్గా, అమితవేగంతో పాకిపోయింది. ఇలాంటి విషయాన్ని నేనెప్పుడూ ఆలోచించలేదు. ఏదెలాగైనా ఇలాగే మరికొన్ని రోజులు గడుస్తే మాత్రం నన్ను పిచ్చాసుపత్రికి ఎగుమతి చేస్తారనేందుకూడా సందేహం లేదు. నా ప్రవర్తన పై

వాళ్ళకు పిచ్చిగా కనిపించినా, నాకు పిచ్చిలేదనే సత్యం నా హృదయంలో మాటిమాటికీ మారుమోగుతూండటం నా అదృష్టాల్లో వొకటి.

నా యీ క్లిష్టపరిస్థితికి కారణం ఎవరనే విషయం ఎక్కువ ఆలోచన లేకుండానే తేలిపోయింది. నాభార్య రెండుమూడు రోజుల ధాటికే ఓర్వలేక, తనకు రక్షణగా ఉండేందుకు యీ ఎత్తు వేసింది; కనుక ఇక యీ వ్యవహారాన్ని ఏమాత్రం సాగనిచ్చినా లాభంలేదు. యీనాటితో దీని అంతు కనుక్కోవాల్సిందే!

చేసింది—పొరపాటో, తప్పో, ఒప్పో—దిద్దుకునేందుకు వ్యవధి కావాలి. కనుక పాతమార్గాన్నే ఇంకొక్క ఊపున ముందుకు సాగుతే, ఐసా పైసా తేలితీరుతుంది.

ఇవాళమాత్రం రాత్రిపూట యింటికి పోకూడదు. ఆమె తెలివిగా యీరాత్రి దొడ్లోవున్న నులకమంచాన్ని కూడా యింట్లోకే లాగేస్తుంది; అప్పుడు నాకు వొట్టి అరుగే గతి! కనుక కాస్త ముందుగానే, సాయంత్రానికల్లా యిల్లు చేరాలనుకున్నాను. నేను మామూలుగా ప్రవర్తించకపోతే గోలై పోతుంది. కనుక ఉన్నట్టుండి, పొంచికూర్చున్న వన్యమృగం లాగు పైకి ఉరుకుతే సరిపోతుంది. ఇది సక్రమమైన ఊహాగానే తోచింది.

ఏమైనాసరే ఇక నాన్చి లాభం లేదనీ, క్లైమాక్స్‌ను బలవంతానయినాసరే దగ్గరకు లాక్కోవాలనీ నిశ్చయంతో సంధ్యవేళ ఇంటిముఖం పట్టాను. ఒకరి జోలి లేకుండా (నా మంచి కోసమే!) తలవొంచుకొని, నా దారిన నేను పోతున్నాను. మా వీధిలో ఆటలాడుకునే పిల్లవాళ్ళు 'పిచ్చివాడు' 'పిచ్చివాడు' అనటాన్ని నేను వినకపోలేదు. ఇంకో సంద

ర్భంలో అయితే వాళ్ళ వెంటపడే వాణ్నే కాని, నా ప్రస్తుత పరిస్థితులు బాగా లేకపోవటంవల్ల, 'కొత్త రిస్కు'ల జోలికి పోదలచలేదు. వాళ్లు కొంతదూరం వెంబడించి వెనక్కు మళ్లారు.

అదృష్టవశాత్తూ వీధితలుపు తెరిచే వుంది. నా రాకను పసి కట్టి, చుట్టుపక్కలున్న ఆడవాళ్లు బైటికివొచ్చి నన్నొక వింతమృగమల్లే చూస్తున్నారు. నేనేమీ ఎరగనట్టు, ఆ చూసేది నన్ను కానట్టుగా చకచకా యింట్లోకి జొర బడ్డాను

బైట సూర్యాస్తమయమైనా, ఇంకా గుడ్డివెలుగు ఉంది; యింట్లోమాత్రం చీకటిగానే వుంది. ఈపాటికి లాంతరు వెలుగుతూ ఉండవలసింది. ఈ పూటకు భోజనం సున్నా అనే మాటకూడా ఇప్పుడే గుర్తొచ్చింది. పోనీ మళ్ళీ బైటికి వెళ్తే-తిరిగి ప్రవేశం దొరకదు. బహుశా ఈ సమయంలో నేను వొస్తానని ఆమె అనుకుని వుండదు—అందుకే నే ఇంత తేలికమార్గం నాకు లభ్యమైంది.

ఇంట్లో అసలు మనుషులెవరూ వున్నట్టు తోచలేదు. ఇంటిని దొంగలకు వొదిలి, నాలాగే ఆమెకూడా ఎక్కడికన్నా పరారైపోయిందా? లేక ఊళ్లో నాగూర్చిన విష ప్రచారానికి బయలుదేరిందా? నన్నుగూర్చి ఆమె ఏ విధంగా వాగే అవకాశమన్నా వుంది కాని, ఆమెనుగూర్చి నేను ఒక్క ముక్కన్నా మాట్లాడేందుకు వీల్లేదుకదా-ఖర్మ!

దొడ్లో ఉన్నదేమోనని వెళ్ళాను.

ఆ దృశ్యాన్ని చూసేప్పటికి నా కళ్ళను నేనే నమ్మలేక పోయ్యాను.

మామగారూ, అత్తగారూ దొడ్లో కూర్చుని మాట్లాడు కుంటున్నారు. పడగవిప్పి మీదికి వొస్తూన్న తాచుపామును చూసినంతగా భయపడి ఒక్క ఉరుకులో యింట్లో పడ్డాను.

వూరందరికీ తెలియటమే కాకుండా, పరిసర గ్రామంలో వున్న అత్తవారింటికి కూడా, ఈ తాజావార్తలు చేరినవని అర్థమైంది. వీళ్ళు ఈ యింట్లో ఉన్నన్నాళ్లూ ఆమెను పల్లెత్తు మాటన్నా అనేందుకు వీల్లేదు. నాకన్న తెలివిగా, ముందు జాగర్తతో ఆమె తన రక్షణను ఏర్పరచుకున్నట్టు తోచింది. ఆమె పొందేలాటి సహాయం నాకు ఈ మగ జన్మలో లభ్యమవదు కదా! ఆమె అబలత్వమే ఆమెకు లోకంలో దొరికేందుకు అవకాశం ఉండే సహాయాన్నంతట్నీ సమీకరించింది.

ఇక ఇప్పుడు చేయవలసిం దేమిటి? అత్తమామలు ఇప్పట్లో వొదలరు; ఒకవేళ వొదిలినా, వాళ్లతోపాటే ఆమెకూడా వెళ్ళిపోతుంది. మళ్ళీ తిరిగి ఆమెను ఇక్కడికి తీసుకు రావట మంటే మాటలా? యుద్ధానంతరం సంధిపత్రాలు సంతకాలూ చేసినంత తతంగం జరగాలి! అంటే ఏ విధంగా చూసినా ఇంతవరకూ పడ్డ శ్రమంతా బూడిదలోపోసిన పన్నీరే నన్న మాట!

క్షణంలో కథ ఇలా అడ్డం తిరిగి ఇరుకున పడేప్పటికి, ఎంతకూ సరైన ఆలోచన రాకుండా వుంది. ఏదారీ కనిపించక తన్నుకుంటున్నాను.

ఇంతలో పక్కగదిలోనుంచి జాలిగా బాధగా మూలుగు వినిపించింది; ఏమిటోనని భయంవేసి వెళ్ళి చూశాను.

ఆమె మంచంలో పడుకొని మూలుగుతోంది. నిజంగా బాదపడుతున్నదో లేదో ఆమెకే తెలియాలి. మూలుగును పట్టి

నిర్ణయించవలసి వో స్త్రీమాత్రం, ప్రతి మానవ హృదయమూ ఆమెకు సానుభూతిని చూపి తీరుతుంది. ఇంకే పరిస్థితిలో నైనా నేనే ఆమెకు ఎంతో సానుభూతిని చూపేవాణ్ణి. కాని ఇక్కడ ఆమె బాధపడటం, లేక బాధపడుతూన్నట్టు నటించటం - నా ప్రవర్తనలోని చెడుగునంతా ఇతరులకు ఎత్తి చూపటమే అవుతూండటంవల్ల ఆమెమీద నాకు సానుభూతి లేకపోను, కోపంకూడా రావటంలో అసహజమేమీ లేదు.

అదృష్టవశాత్తూ ఆమె నన్ను చూడలేదు. చూడగానే— నేనేమీ చెయ్యకపోయినా, చేసినంతగా ఇతరులకు అర్థమయేట్టు ఏడవటం మొదలుపెట్టేదేమో? ఈ అనుమానం తగలగానే నేను నా గదిలోకి వెళ్ళిపొయ్యాను.

ఇంట్లో లాంతర్లు వెలిగినయ్. గిన్నెలు చప్పుడవుతున్నయ్. పాగ కొద్ది కొద్దిగా నా గదిలోకూడా వొస్తోంది... ఈ చిహ్నాల్నిపట్టి ఆమె పనిని అత్తగారు నిర్వహిస్తోందని అర్థమైంది.

క్రమంగా పక్కగదిలోని మూలుగు స్థాయికూడా హెచ్చింది. ఇక తెల్లవార్లూ ఆమె ఈ స్థాయినే మాటి మాటికీ పెడుతూంటుందేమో ఖర్మ! నా చేతి బాధతో నే వేగిపోతూన్న నేను, ఇతర మూలుగుల్ని కూడా ఎలా భరించేది?

చివరిసారిగా ఆమెతోడి ఈ వ్యవహారాన్ని తేల్చుకుందా మనే నా వుద్దేశం మాయమై పోయింది. ఆమె ఆత్మబంధువులు ఈ కప్పుకింద వున్నంతకాలమూ నామీదనుంచి వీచే గాలికూడా ఆమెను తాకేందుకు భయపడుతుంది. నా అంతట నేనే వాళ్ళకు వుద్వాసన చెప్తామా అంటే, గుండె చాలటం లేదు. ఒకవేళ పోతూపోతూ ఆమెనుకూడా వెంట పెట్టుకొని

పోతేమాత్రం (గుర్నాథుడికి దూరంగా వుండమన్నా రాయెమట!) ఈ సమస్య సంగతి అటుంచి, నేను స్వయంపాక సన్నాహాలు చేసుకోవాలి (హోటల్ భోజనం నాకు బొత్తిగా పడదాయె!) ఎట్లా?

బుర్ర మొద్దుబారి అసలు పని చెయ్యటమే లేదు. ఏదో గొప్ప ఆపద జరగబోతూందనగా చూస్తూ ఊరుకోవటంకన్నా చేసేదేమీ లేని సమయాన. ఒక సామాన్య మానవుడు చేయగలిగిందే నాకూ శరణ్యమైంది.

ఇంట్లో సజీవ వ్యక్తులున్నా అంతా నిశ్శబ్దంగా వుంది. ఈ నిశ్శబ్దతకన్న ఆమె మూలుగే భరించగల దనిపించింది. గదిలోకి సగం మేరవరకే చొరుచుకునే లాంతరు కాంతిలోకీ, ఆ పక్కనే ఆవరించిన చీకటిలోకీ చూస్తూ పడుకున్నాను.

ఒక గంట గడిచి వుంటుంది. జట్కా ఏదో ఇంటిముందు ఆగింది. ఈ సుందర దృశ్యాల్ని చూసేందుకూ, నన్నొక నేరస్థుడిగా నీచంగా చూసే అవకాశాన్ని వినియోగించుకునేందుకూ, ఇంకా ఎంతమంది పెద్దమనుషులు వొస్తున్నారో అర్థం కాలేదు. పరిస్థితి ఏ విధంగా ఇంత చకాచకా మారుతోందో అంతుపట్టటంలేదు.

—నా ఊహ నిజమే ఐంది. గచ్చునేలమీద బరువైన బూటుకాళ్ల చప్పుడు స్పష్టంగా వినిపిస్తోంది. వాళ్లు మాట్లాడుకునే దేమిటో నాకు అర్థం కాలేదు. ఆ భయంలో అర్థం చేసుకునేందుకే ప్రయత్నించలేదు. తరువాత గుసగుసలు కూడా అస్పష్టంగా వినిపించినవి. ఆమెకు నేను చేసిన మర్యాద లాటిదే, నాకు వీళ్ళు చెయ్యరు కదా? నా మీద ఏమన్నా కుట్ర జరుగుతోందేమో?

మళ్ళీ బూటుకాళ్ళు కదిలినయ్. వొచ్చింది ఎవరనే ఆతృత నన్ను మొదటినుంచీ వేధిస్తూనే వుంది. కాని తెలుసుకునేందుకు, నేను గదిలోనుంచి బైటికివొచ్చి చూసేందుకు దమ్ములు లేవు...గది కిటికీ తెరిచి చీకట్లో నిలబడి వీధిలోకి చూశాను. కోటు జేబులోని స్టెతాస్కోపును పట్టి డాక్టర్ అని గ్రహించాను.

ఒకందుకు మాత్రం సంతోషించాను. ఈ డాక్టర్ ఏ రోగిమూ లేని నా కోసం రాలేదు; ఎందుకంటే నన్ను పరీక్షించనే లేదుగా?...ఇంతకు ముందు నిన్న మూలుగును పట్టి నా భార్య రోగి ఐ వుంటుందనే నిశ్చితాభిప్రాయం కలిగింది. ఆమెకు ఏమైందో, ఏమై వుంటుందో నాకు అర్థం కాలేదు.

ఇంకో ప్రదేశం లేకపోవటంవల్ల ఈ రాత్రికి ఏదో విధంగా యీ ఇంట్లోనే గడిపి తీరవలసిన అవసరం ఏర్పడ్డది. ఇంటి పరిస్థితిని తెలుసుకునేందుకు కూడా మనస్కరించలేదు; తెలుసుకోగానే నా కోసమై వేచి కూర్చున్న పెద్ద ఆపద ఏదో మీదికి దూకుతుందేమో నన్నంత భయం వేసింది.

అమితంగా అలసిపోయి ఉండటంవల్ల, ఆకలి కూడా మరిచిపోయి, ఒళ్ళు తెలియని నిద్రలో పడ్డాను.

* * *

ఉదయానికల్లా పరిస్థితి నాకు బాగా అర్థమైంది. నా భార్యకు నిన్న మధ్యాహ్నంనుంచీ జ్వరం తీవ్రంగా, వొళ్ళు తెలియనంతగా వొస్తూ వుంది. మధ్య మధ్య స్పృహ తప్పుతూండటంవల్ల ఏవేవో పిచ్చిమాటలు మాట్లాడుతూ వుంది.

ఆ మాటలు కూడా ఏవో కావు... నేనేమో తనను కొట్టబోతున్నట్టూ, ఆమె భయపడి సహాయంకోసం కేకలు వేస్తున్నట్టూ, నా దెబ్బ పడ్డాక, ఆమె ఎలుగెత్తి ఏడవటం మొదలైన దృశ్యాలకు సంబంధించినవి. మొదట్లో ఇదోరకం దొంగ ఎత్తని అపోహపడ్డాను.

కాని ఇరుగుపొరుగులు వొచ్చి ఉచితంగా ఇచ్చే అమూల్యాభిప్రాయాలూ, మానవ శారీరక శాస్త్రంమీద అథారిటీ అయిన డాక్టర్ మూల్యాభిప్రాయమూ నన్ను భయపెట్టినవి. పరిస్థితి ఇంతగా విషమించినందుకు, నన్ను నేను దూషించుకునేందుకూ కూడా జంకి, నా విధిని లోలోన తూలనాడసాగాను.

వేళకు ఇంత తింటూ యింట్లోనే పడి వున్నాను. యీ విధంగా జరిగినందుకు హృదయం క్షోభిస్తోంది. నా ముఖాన్ని ఎవరికీ చూపలేకనే యీ నాలుగుగోడల మధ్యా కాలాన్ని వెళ్ళబుచ్చుతున్నాను. మామగారూ, అత్తగారూ నన్ను పల్లెత్తు మాటకూడా అనకుండా ముభావంగా ఊరుకోవటం వల్ల, శిక్ష పడని నా నేరం క్రమంగా నేను భరించలేనంత భయంకర రూపాన్ని దాల్చసాగింది.

ఎంతో సానుభూతితో ఓదార్చుదామని, నా తప్పులకు క్షమార్పణలు అర్పించుకుందామని ఎప్పుడైనా రోగి గదిలోకి వెళ్తే, నన్ను చూడగానే ఆమె భయపడి కెవ్వున కేక వేస్తోంది. నా ముఖాన్ని చూసేందుకు ధైర్యం చాలక, నిజంగా నేను బాధిస్తున్నాననే ఊహతో గోడవైపు తిరిగి వెక్కి వెక్కి ఏడుస్తోంది. యీ విధంగా రోగి మనసును ఇంకా పాడుచేసేందుకు నా మనస్సు అంగీకరించలేదు. నేను

ఎందుకు వొచ్చానో చెప్పటానికేందుకూడా నాకు తగిన అవకాశం లభించటంలేదు. నేను ఏదో దొంగవేషం వేస్తున్నట్లు అనుమానంగా చూసే పై వాళ్ళ చూపులు నన్ను మరింత గాబరా పెట్టినయ్.

ఆమె ఈ స్థితికి వొచ్చేందుకు నిజంగా నేనే కారణమో, కాదో చెప్పలేను. ఒకవేళ అంతకూ నేనే బాధ్యుణ్ని కాకపోయినా, యీ నింద నంతటినీ భరించి తీరవలసింది నేనేనని ప్రతిఒక్కరూ అభిప్రాయపడుతూన్నట్లు తోచింది. అన్నివైపులనుంచీ ఒకేరకం జవాబును వింటూంటే, నిజంగా నేనే కారణమనే నమ్మకం నాకూ్కడా బాగా నాటుకోవటంలో ఆశ్చర్యపడవలసిం దేమీలేదు.

ఆమెకూ నాకూ ప్రస్తుతం ఒకే భేదం కనిపిస్తోంది. ఆమె శరీరోష్ణంతో పడి వుంది; నేను ఆ వేడి లేకుండా, థర్మామీటర్‌కు అందని ఇతర మానసికోష్ణపు సెగ సెగతో కాలిపోతున్నాను.

గంటగంటకూ ఆమె స్థితి విషమించ సాగింది. ఒక్కరోజులోనే ఆమె ఎంతో తీసిపోయింది. శారీరకంగా కాకుండా మానసికబాధ ఏదో ఆమెను అతివేగంతో కుంగదీస్తోంది. దెయ్యాలు అంటే బొత్తిగా నమ్మకంలేని నాకు—దెయ్యం కాకపోయినా, అలాటిదే ఏదో ఆమెను పీల్చి పిప్పిచేస్తూ వుందనే నమ్మకం కలగక పోలేదు.

ఈ వాతావరణంలో కొంత మార్పు వుంటే కొంత మేలని అత్తమామలు అభిప్రాయపడ్డారు కాని, డాక్టర్ రోగిని కదిలించేందుకు వీలులేదని ఆజ్ఞాపించటంవల్ల, మార్పు రాకుండానే ఉండిపోయింది.

ఇంట్లో నన్నెవ్వరూ లెక్కచెయ్యటంలేదు. దోషిని చూసే తేలికచూపులే నాకు దక్కుతున్నయ్. నిజంగా హృదయపూర్వకంగా నేను పశ్చాత్తాపపడుతున్నాను. కాని ఆ సంగతి బైటపెట్టే అవకాశం నాకులేదు. నన్నెవ్వరూ-చివరకు దేవుడుకూడా నమ్మడనే నమ్మకం వుంది...ఏం

ఇంత ఇరుకున పడతా ననుకోలేదు. నా భార్య అంటే నాకుండే అనురాగాన్ని, కనీసం మరో మానవప్రాణి బాధ పడే సమయంలో హృదయంలో దానంతటది అదిగా రేకెత్తే సానుభూతిని ప్రకటించుకునే అవకాశమన్నా లేకుండా పోయింది.

రెండురోజులు గడిచేప్పటికల్లా ఆమె స్థితి మరీ దిగజారింది.

డాక్టర్ అన్నాడు: "ఆమె మానసికంగా బాగా బెదిరిపోయింది. జీవితమంటేనే విపరీతమైన భయంతో, నిరుత్సాహంతో ఆమె క్షణక్షణానికీ కుంగిపోతోంది. నేను అనుకోనంతగా—శాస్త్రరీత్యా జరగకూడనంతగా ఆమె ఆరోగ్యం చెడిపోయింది. ఏమీ లాభం లేదనే నాకు తోస్తోంది."

నేను ఏడుద్దామనుకున్నాను. కాని నాది దొంగ ఏడుపని అందరూ అంటారు. అందుకనే ఆ దుఃఖమంతా శరీరంలోనే కుళ్ళిపోవలసి వచ్చింది.

డాక్టర్ ఆశలన్నీ వొదులుకోగానే అత్తమామలు ఆమెను వాళ్ళ ఊరు తీసుకు వెళ్ళిపోయ్యారు. నన్ను రమ్మనలేదు. నే నసలు బతికి ఉన్నట్టుగానన్నా వాళ్ళెవ్వరూ భావించటం లేదు. ఏం ఖర్మ!

బావురుమనే ఇంట్లో ఒక్కణ్ణీ ఉండిపోయ్యాను. భరించ లేనంత ఉద్రేకంలో, నామీద నాకే కలిగిన అసహ్యమూ కోపమూ, నా మూర్ఖత్వమూ, గుడ్డిగా, కఠినంగా ప్రవర్తించిన విధానమూ, ఇవన్నీ నన్నే బాధించసాగినయ్. నన్ను నేను కొట్టుకొని కొంత తృప్తిపడ్డాను. యింట్లోవున్న వస్తు సామగ్రి నంతా చిందర వందర చేసి, మరికొంత తృప్తిపడ్డాను. యీ గోడలు ఒక దానొకటి కరుచుకుపోతే ఎంతో బాగుండునో ననిపించింది; యింటి కప్పంతా విరిగి మీద పడకూడదా అని పించింది.

ఏం జరిగి వుంటుందో నాకు తెలుసు; కాని విధి కటా క్షించి అలా జరగలేదని నా కెవరైనా వార్త తెస్తారేమోనని వేచి ఉన్నాను. జరగ వనుకునే అనేక సంఘటనలు, వాటంతట అవి మా ప్రయత్నమూ, ప్రమేయమూ లేకుండా జరుగుతూనే ఉన్నవి: వాటిల్లో ఇదికూడా వొకటి కాకూడదా?

*　　　*　　　*

రాత్రి ఒంటిగంటకు తలుపుకొట్టిన శబ్దం విన్నాను. ఎవరో నాకోసం, ఏదో దుర్వార్త (?) తెచ్చారనే భయం ఎంతో అధికంగా నన్ను వేధించింది. తలుపు తెరవకపోతే, యీ సస్పెన్స్‌లోపడి మరింత బాధపడాలేమో? బైట ఎవ రున్నారో కూడా నేను అడగలేదు—గొంతు స్వాధీనం తప్పటంవల్ల.

తలుపు తెరిచాను; మా అన్నగారు ప్రత్యక్షమయ్యారు. ఆయన ముఖంలో కోపమూ, అసహ్యమూ విచారమూ

స్పష్టంగా కనుపిస్తున్నవి.

"వెధవపనిచేశావ్! నీకు ఇష్టంలేకపోతే భార్యను వొదిలి పెట్టినా బాగుండి పొయ్యేది. అంతేకాని ఆమె నలా చావు దెబ్బలు కొడతావా? ఎవరు చెప్పార్రా నీ కీ విధానం?"

ఎవరనే ప్రశ్న రాగానే నువ్వు చెప్పావని అందా మనుకున్నాను. కాని నువ్వు చెప్పినంత మాత్రాన గుడ్డిగా అనుసరించిన నాతప్పు నీడలాగు అంటుకొనే వుంది కదా?

"ఇప్పుడామె చనిపోయింది...కూర్చొని ఏడు వెధవా!" అన్నారాయన.

నాకు నిజంగా ఏడుపు వొస్తోంది కాని, ఏడ్చే ఓపిక లేక ఊరుకున్నాను.

"వంశానికంతకూ అపకీర్తి తెచ్చావ్. ఇంత చదువుకొని ఇలా మూర్ఖుడివల్లే ప్రవర్తిస్తావనుకోలేదు. ఈ విషయం ఇంతతో అగిం దనుకుంటున్నావేమో? వాళ్ళు పోలీసు రిపోర్ట్ ఇచ్చారు"

నాకు మరీ భయం వేసింది. పోయిన భార్య కోసమే ఏడవలేక ఛస్తూంటే, ఇంకో పెద్ద తద్దినం నెత్తిన పడ్డది.

"ఆమె చావుకు నువ్వే కారణమని వాళ్ళు రుజూచేస్తారు. వాళ్ళకు బోలెడు సాక్ష్యం వుంది. ఒక ఖూనీకేసు నీ నెత్తికి చుట్టుకుంటుంది."

నాకు తత్తరపుట్టింది. ఉరి స్తంభానికి నన్ను ఎక్కించటం, కడియం ఆకారంలో వుండే కొయ్యముక్కలాటి తాడు నా మెడకు తొడగటం, తాడును బిగుతుగా బిగించి నన్ను వేళ్ళాడెయ్యటం, నాకు ఊపిరి ఆడక, కాళ్ళతో తన్నుకొని, నా బరువుతో ఆ ముడి మరింత బిగిసేట్టుగా చెయ్యటం, చివరకు నాలోని ప్రాణికొస్తా అనంతంలోకి ఎగరటం-నా గుడ్లు వెళ్లుకొచ్చి, ఎండిపోయిన తోటకూర కాడల్లే మెడ వేళ్ళాడి పడటం, ఆ బొందిని వాళ్ళు విసిరి గోడవతలికి పారెయ్యటం-ఈ దృశ్యాలన్నీ కళ్ళముందు నాట్యం చేసినయ్... అనేక కొత్త ప్రదేశాల్లోకి పరారై తలదాచుకోవటంకూడా నాకు తోచకపోలేదు. కాని అదంతా మనకు ప్రస్తుతం అందుబాటులోలేని వ్యవహారం... పోతే పొటాసియం సైనైడ్ దొరికేమార్గం ఏదన్నా వుందా అని ఆలోచిస్తున్నాను...

"నేను ఎంతచెప్పినా వాళ్ళు వినలేదు. ఈపాటికి నీమీద సమనుకూడా జారీఅయి వుండవొచ్చు. తెల్లవారే లోపుగానే జైలు నివాసంలోకి ప్రవేశిస్తావ్... త్రాష్టపు వెధవా!"

మా అన్నయ్య లాయరు. జీవితంమీద కొద్దో గొప్పో ఆశ లేకపోలేదు. చాకలేక, బతికే ఉపాయమేదన్నా మావాడి చేతుల్లో వుందేమోననే ఆశతో, మాటలు రాక వాడి రెండు కాళ్ళమీదా పడ్డాను.

"ఈ మాత్రం జ్ఞానం ఆమె మీద చెయ్యెత్తినప్పుడు ఉండక్కర్లా?" అన్నారాయన.

ఎవరేమన్నా నేను మాత్రం నోరు విప్ప దలచలేదు. ఈ

స్థితిలో నేను ఏది మాట్లాడినా ప్రకృతివిరుద్ధంగానే అందరికీ కనిపిసుంది!

ఆయనకు నామీద జాలి కలిగిం దనుకుంటాను. అన్నారు: "సరే...ఐందేమో ఐంది. నీభార్య నీకూ, ఆమెకూ కూడా తెలియకుండా ఒక గొప్ప ఉపకారాన్ని నీకు చేసింది. నీకు పిచ్చి అని ఆమె ఊరంతా టమటమా వేసింది. నీ చేష్టలు కూడా ఆమె మాటల్ని బలపరిచినయ్. అప్పుడే కాదు— ఇప్పుడు చిందర వందరైన యీ వస్తుసామగ్రీ ఇంటినిండా విరజిమ్మబడ్డ యీ గాజుముక్కలూ ఇదంతా నీకు పిచ్చి అని నమ్మే అవకాశాన్ని కల్పించినయ్. నిజంగా నీకు పిచ్చో కాదో అది తరువాతి సంగతి. ఒకవేళ నీకు పిచ్చి లేక పోయినా, ఈ కేసు పూర్తయి నువ్వు బైటపడేదాకా, నువ్వు పిచ్చివాడివేషం వేయకతప్పదు. పొరపాటు పడ్డావో ఉరిస్తంబం ఎక్కాల్సిందే!"

లోగడ లేకపోయినా, నిజంగానే ఇప్పుడు పిచ్చి ఎక్కే స్థితిలో ఉన్నందుకు నావిధికి వేయి నమస్కారాల్ని అర్పించుకున్నాను.

"మరిచిపోయి తెలివిగా మాట్లాడావా, నీ బుర్ర రామకీర్తనే—జాగర్త!" అని ఆయన హెచ్చరించాడు.

పోలీసులు రానూ వొచ్చారు. చక్రవర్తికి నన్ను అతిథిగా తీసుకు వెళ్ళనూ వెళ్ళారు. దమ్మిడీ అద్దెలేకుండా, కటకటాల

వెనుక గచ్చు గదీ, కానీ ఖర్చు లేకుండా మూతుళ్ళలో కూడూ, పిడతల్లోని నిర్మలోదకమూ రుచి చూడ సాగాను.

*　　*　　*

కేసు నడిచింది. నేను పిచ్చివాడల్లే నే నటించటంలో వొళ్లు దగ్గర పెట్టుకున్నాను. సాక్షులుకూడా నాకు పిచ్చి కొత్తగా ప్రవేశించిందని చెప్పారు. ఆనాటి ఉదయం నన్ను డాక్టర్ దగ్గరకు తీసుకువెళ్ళిన మిత్రులుకూడా నాకు పిచ్చి అని బలపరిచారు. ఇంతకూ కోర్టువారు నాకున్న పిచ్చిని నమ్మటం నా అదృష్టాల్లో వొకటి.

అన్నయ్య నావైపు వాదించాడు...ఆ పిచ్చిలో నా భార్యకు నేనేదైనా అపకారంచేసి ఉండొచ్చన్నాడు. నా ఉద్దేశంమాత్రం ఆమెను చంపటం కాదన్నాడు. నామతి చాంచల్యం అందుకు బాధ్యత వహించి వుంటుందని అన్నాడు.

అంతమాత్రం చేతనే నేను నిర్దోషిని కాలేదు. తెలిసో, తెలియకో ఇతరులకు హాని చేసినందుకు (అందులోనూ ప్రాణ హాని!) నాకు బొత్తిగా శిక్ష లేకుండా పోలేదు.

"వీడి పిచ్చి వొదిలేదాకా వాత్తేరు పంపండి" అని తీర్పు చెప్పారు.

గవర్నమెంటు ఖర్చుమీద వాత్తేరు జేరుకున్నాను. ప్రస్తుతం పిచ్చాసుపత్రి ఆవరణలో హాయిగా మకాం!

ఇక్కడ మిగతా పిచ్చివాళ్ళను చూస్తుంటే, చాలా తమాషాగా వుంటుంది. వాళ్ళతోపాటే నేను కూడా పిచ్చిగా

మాట్లాడుతూ, రాంభజనలు చేస్తూ, హరికథలు చెప్తూ, భరత నాట్య ప్రదర్శనలు ఇస్తున్నాను. గానసభలు కూడా యీ మధ్య మొదలుపెట్టాను కాని, పక్క వాయిద్యాలు కూడా మనుషుల కంఠాలే కావటంవల్ల అంత ఎక్క రాలేక పోతున్నాను.

అప్పుడప్పుడు అన్నయ్య వొచ్చి 'జాగ్రత్త' అని చాటుగా హెచ్చరిస్తూంటాడు. అనుపత్రి సూపరెంటుకు నాకు పిచ్చి లేదనే నమ్మకం కలగకుండా కాపాడు కుంటున్నాను. నన్ను ఇంత త్వరలో వొదిలిపెట్టారంటే, కేసు దూసుకు నేందుకు యీ ఎత్తు వేశానని నన్ను మళ్ళీ విచారించి పై కోర్టువారు నా గొంతుకు కంఠాణీ గుచ్చక మానరు!

—కాని ఇక్కడ మరి కొన్నాళ్లుంటే మాత్రం నాకు పిచ్చెక్కేట్టుగానే వుంది. నా విచారం ఒక్కటే: ఇక్కడ నీ కంపెనీ కూడా వుంటే ఒక విధమైన 'లైఫ్' ఉంటుందని, నా నమ్మకం.

ఏమైతే నేం—దివ్యమైన నీ సలహావల్ల నా సమస్య పటా పంచలైంది. భార్యే పోంగా లేంది, ఆమెను గూర్చిన సమస్య అంటూ ఉండేందుకు ఏ అవకాశమూ లేదు!

గురూజీ! నీకూ నీ సలహాకూ చివరిసారి ఒక్కటే సలాం!

నీ శిష్యపరమాణువు

—గోవింద్.

—జూలై 1947

ఐ పో యిం ది

1968 మార్చిలో విడుదల

కొమ్మూరి సాంబశివరావు రచన

మహోజ్వల సామాజిక నవల

## తొలిప్రేమ

రెండు వైపులా మల్టీ కలర్ ఆఫ్‌సెట్ కేపర్

వెల: రూ. 1-50

నరేంద్ర రచన

ఉత్కంఠతలూగించే డిటెక్టివ్ నవల

## నల్లకుక్క

త్రివర్ణ ముఖచిత్రం | వెల: రూ. 1-50

